## ముఖ చిత్రం

విజ్ఞి ముఖ చిత్రము అమాయకముగా చాలా బాగుంది సినీతారల ముఖ చిత్రాలు తప్ప దేశ-నాయకులు భగత్‌సింగ్, సుభాస్ చంద్రబోస్ చిత్రాలు ముఖ చిత్రాలుగా ప్రచురించ గలరు అని కోరు-చున్నాను.

జంధ్యాల నాగేశ్వరరావు, నాగులపాడు.

♦ ♦ ♦

నాటి కథా నాయకుడు నిన్నటి ప్రాంతీయ నాయ-కుడు నేటి జాతీయ నాయకుడు అయిన తారక రాముని కాషాయ వస్త్రాలు ధరించి వున్న ఫోటో ముఖ చిత్రంగా వేస్తారని కోరుతున్నాను.

చిట్టూరి ఇంద్రయ్య, జగన్నాథపురం

♦ ♦ ♦

ముఖ చిత్రం "సుమన్" చాలా ఆకర్షణీయంగా వుంది.

మద్దు కామరాజు, అక్కుపల్లి.

## వినాయకచవితి సంచిక

వినాయక చవితి సంచిక (7.9.84) చూడటానికి ముచ్చటగా వుంది. ఆర్టిస్ట్ వి. ఎస్. రావు గారు బాగా చిత్రించారు. రాయప్రోలుగారు అందించిన "వివిధ రూపాల వింత వింత వినాయకులు" పై విశేషాలు చదివి విజ్ఞానం పెంచుకున్నాం.

పి. రాధా గోపాల కృష్ణ, బల్లిగూడ (ఒరిస్సా)

## శ్రావణి

21-9-84 సంచిక సుహాసిని ముఖ చిత్రము చాలా బాగున్నది. 'శ్రావణి' సీరియల్ నన్ను బాగా ఆకట్టు-కున్నది.

డి. చంద్రశేఖర్, కళింగపట్నం




## భాషలేని భావాలు

రవ్వంత దిగులుతో సూన్యంలోకి దృష్టి సారించి ఊపిరి పీల్చక నిలబడిపోయిన హాసము లేని సుహాసిని ముఖ చిత్రం ఏదో చెప్పటానికి భాషలేని భావాలని మనసుకు అందించింది.

అనంత, మచిలీపట్నం.

## అద్దం పట్టినట్లుంది

డా. జైదుబాషీగారి వ్యాసం "ఇది రామ్‌లాల్ వ్యవహారమా" చదివినాను నాకు చాలా నచ్చింది ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న పరిణామాలకు అద్దం పట్టినట్లుగా చక్కని తీరులో వ్రాసినారు.

న్యాయపతి రామారావు, (బరంపురం)

## న్యూఢిల్లీ లేఖ

21-9-84 తేది 'సుహాసిని' ముఖ చిత్రం, ముచ్చ-టగా వుంది. "అసలుఇది రామ్‌లాల్ వ్యవహారమా?" డా. జయిదుబాషీగారి, న్యూఢిల్లీ లేఖ ఎంతో చక్కగా వ్రాశారు. వారికి కృతజ్ఞతలు.

గవర శంకరరావు – రాధికారాణి,
కిచ్చాడ.

(66వ పేజీ చూడండి)




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం. 1908

శివలెంక శంభు ప్రసాద్
సంపాదకుడు :
(1938-1972)

శుక్రవారం : 26-10-'84
శ్రీ రక్తాక్షినామ సం కార్తీకశు విదియ

**సంపుటము 77 : సంచిక 8**

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003.


విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"అమ్మాయిలూ ప్రేమించండి"లో
భాగ్యరాజ్, రాధిక

**కథలు :**



**సీరియల్ నవలలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

# రాష్ట్రాల అభివృద్ధి - కేంద్రం సహాయం

గెలుపుకన్నా గెలిచేది ఉండకపోతే ఓటమికన్నా ఓడిపోయేది ఉండదంటారు (ఇంగ్లీషులో!) అమెరికా సంయుక్త రాష్ట్రాల నుంచి వచ్చే "టయిమ్" వారపత్రిక ఈమధ్యనే ఆ దేశంలో వస్తున్న మార్పులని పొగడుతూ ఒక సంచికని వెలువరించింది. అ. సం. రా. సంగతి వస్తే అతిగా పొగడటం టయిమ్‌కి అలవాటే- అమెరికా భగవంతుడి స్వంత దేశం కదా మరి? అయినా సరే, ఇదంతా ఎన్నికల ముందు జరిగే హడావిడి అని తోసెయ్యటానికి వీలు లేదు. యూరోపులో ఆర్థిక మాంద్యం ఇంకా ఉంది. అమెరికాలో అది బాగా తగ్గిపోతోంది. అక్కడ ఆర్థికాభివృద్ధి ఉప్పొంగుతోందనవచ్చు.

భారత దేశం సంగతో? ఇక్కడ ప్రణాళికల లక్ష్యాలని కొన్ని దశాంశ భాగాల చొప్పున దాటగలిగితే ప్రణాళికా సంఘం వాళ్ళు ఒకటే సంబరపడిపోతారు. అమెరికాలో 1982 నవంబరు తరువాత ఆర్థిక మాంద్యం తగ్గు మొహం పట్టింది. అప్పటి నుంచి తలసరి ఆదాయాలు రు. 18000 చొప్పున పెరిగాయి. ఈ పెరుగుదల మాత్రం భారత దేశంలో మొత్తం తలసరి ఆదాయాల కన్నా తొమ్మిది రెట్లు ఎక్కువ. నవంబరు 1982 నుంచి 20 లక్షల కొత్త ఉద్యోగాలు సృష్టించుకున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో. తక్కిన దేశాలలో నిరుద్యోగ సమస్య ఇంకా తీవ్రంగానే ఉంటోంది.

గత అయిదు సంవత్సరాలలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోకి 25 లక్షల మంది వలస వెళ్లారు. వీరిలో భారతీయులు కూడా ఉన్నారు. వలస వెడదామని కాచుకుని ఉన్న వాళ్ల వరస చాలా పొడుగుగా ఉంది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలు దేవుడి స్వంత దేశాలలో ఒకటి; ఆ దేవుడి స్వంత దేశం ఇంకొకటి ఉంది. అదే కార్ల్ మార్క్స్, లెనిన్‌ల దేశం- సోవియెట్ యూనియన్. ఇక్కడ పరిస్థితులు ఎలాగ ఉన్నాయిట? ఈ దేశం తాలూకు లెక్కలు తేలికగా దొరకవు. అందుకనే ప్రపంచ బాంకు వాళ్ళు వాటిని తమ వార్షిక నివేదికలలో వెయ్యటం ఆపేశారు.

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

వాళ్ళు ప్రచురించిన (సోవియెట్) తాజా వివరాలు 1977కి సంబంధించినవి. అప్పుడు ఆ దేశం తలసరి ఆదాయం 3000 డాలరులు. అంటే అప్పటిలో సో.యూ. కన్నా బీద దేశం యూరోపులో ఒక్క అయర్‌లాండ్ మాత్రమేనన్నమాట.

ఆ సంవత్సరం అ.సం.రా. తలసరి ఆదాయం 8000 డాలరులు.

1977 తరువాత పరిస్థితులు ఎలాగ ఉన్నాయో వివరంగా తెలుసుకోవటం కష్టమే కాని రష్యా ఆర్థిక పరిస్థితి బాగు పడకపోగా చెడిపోతోందనటానికి సాక్ష్యం ఉంది. 1976-1980 కాలంలో అక్కడ అభివృద్ధి అంతకి ముందు అయిదు సంవత్సరాల అభివృద్ధిలో సగం ఉందని తెలుస్తోంది. సో.యూ.లో అభివృద్ధి భారత దేశంలో అభివృద్ధికన్నా తక్కువగా ఉంది. పోయిన (సోవియెట్) పంచవర్ష ప్రణాళికలో నిర్ధారించుకున్న లక్ష్యాలు అన్నీ బాగా తప్పిపోయాయి. తరువాతి 5 సంవత్సరాలలో సోవియెట్ యూనియన్ సాధించగలిగిన అభివృద్ధి (భారత దేశంలోలాగే) 2శాతం ఉండగలదని నిపుణులు అంచనాలు వేస్తున్నారు.

కమ్యూనిజమ్ వ్యవస్థలో కార్మికుడు వికసించలేడనిపిస్తుంది. మన పశ్చిమ బెంగాల్‌నే తీసుకోండి. ...డు సంవత్సరాలుగా అక్కడ ఎవరో ఒకరు కమ్యూనిస్టులే పరిపాలిస్తున్నారు. అంతకి ముందు కొం... కాలం కూడా మిశ్రమ ప్రభుత్వాలతో వీళ్ళు ఉండ... ఉన్నారు. స్థూలంగా చెప్పాలంటే 1967 నుంచి ప... బెంగాలులో కమ్యూనిస్టులు అధికారంలో ఉన్న కాలమే ఎక్కువ. అప్పటి నుంచీ ఆ రాష్ట్రం పతన... మొదలయింది. ఒకప్పుడు ప... బెంగాలు దేశంలో... పారిశ్రామిక రాష్ట్రాలలో ప్రథమ స్థానంలో ఉండేది 1947 తరువాత కొంత కాలం ఇలాగ ఉండేది అదంతా మారిపోయింది. ఇప్పుడు కొనసాగుతున్న ధోరణి మారకపోతే పశ్చిమ బెంగాల్ ఒక దశాబ్దంలో బంగళాదేష్ స్థాయికి దిగజారిపోతుందనటంలో సందేహం లేదు. కార్మికుల సంఖ్య తీసుకుంటే పశ్చిమ బెంగాల్ అగ్రస్థానంలో ఉంది; ఉత్పత్తి తీసుకుంటే ఈ రాష్ట్రం కన్నా మహారాష్ట్ర, గుజరాత్, పంజాబ్ హర్యానా, తమిళనాడు, కర్ణాటకలు ముందు ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లాంటి రాష్ట్రాలు కూడా బాగ పయికి వస్తున్నాయి. ఇలాంటి రాష్ట్రాలలో పారిశ్రామిక సంప్రదాయాలు తక్కువ. పరిశ్రమలకి కావలిసిన సహజ సంపద కూడా తక్కువే- పశ్చిమ బెంగాల్‌తో పోల్చి చూస్తే. విద్యుచ్ఛక్తి వాడకం పారిశ్రామికాభివృద్ధిని సూచించే ఒక ప్రమాణం కదా? ప్రస్తుతం ఈ విషయంలో పశ్చిమ బెంగాలూ, మధ్యప్రదేశూ ఒకే స్థాయిలో ఉన్నాయి. మ.ప్ర. ఒక అభివృద్ధి చెందిన రాష్ట్రమా?!

ఇంకొక దశాబ్ద కాలంలో పశ్చిమ బెంగాలు మొదటి 10 రాష్ట్రాలలో ఉండటమే కష్టం అని నా అనుమానం. దేశాల జాబితాలో సోవియెట్ యూనియన్‌కీ ఇదే గతి పట్టవచ్చు.

అశోకమిత్ర అంటే నాకు స్నేహభావం ఉంది. ఆయన ప్రతి పరిష్కారానికీ ఒక సమస్యని సృష్టించగలవారు. ఈ విషయంలో ఆయనకీ, జిన్నాకీ పోలికలు ఉన్నాయి. సరే, ఆయన పాడినపాటే ఎప్పుడూ పాడుతూ ఉంటారు. కేంద్రం తమ రాష్ట్రాన్ని నొక్కేస్తోందని ఈ రాష్ట్ర ఆర్థిక మంత్రిగారు అంటూ ఉంటారు. ఇది అర్థం లేని మాట.

(62వ పేజీ చూడండి)

# చీకటి

## వీరభద్రరావ్ పెమ్మి



"కెప్టెన్ సుబ్బరాజుగారి అబ్బాయి వస్తున్నాట్ట - అమెరికానుంచి." -

లైబ్రరీ అరుగుమీద కూర్చున్న బాంబురాజు అన్నాడు. అక్కడ కూర్చున్న వారంతా అతనికేసి చూశారు. వార్తలు బాంబుల్లా పేల్చడం అతని అలవాటు. ఆ విషయమ్మై అక్కడ కొంత సేపు చర్చ జరిగింది.

"అబ్బాయిగోరు ఇదేశాల్నుంచి వత్తన్నారంట కదా అయ్యా ఊళ్ళో అంతా సెప్పుకుంటున్నారండి." అరుగుమీద కూర్చున్న మహంకాళి కుర్చీలో కూర్చున్న కెప్టెన్ రాజుగార్ని అడిగాడు.

"అవున్రా – వస్తానని రాశాడు. ఎప్పు డొచ్చేదీ ఇంకా తెలియలేదు" సుబ్బరాజుగారు అన్నారు.

"కెప్టెన్‌గారి శేఖరం అమెరికా నుంచి వస్తున్నాట్ట."

ఆ రోజు రాత్రి శివాలయం అరుగుమీద చేరిన సభ్యులకి తెలియజేశాడు వెంకట్రాముడు.

"అక్కడే తను ఎవరో తెల్ల పిల్లని చేసుకున్నాడని ఆమధ్య చెప్పుకున్నారు. ఆ పిల్లతో సహా వస్తున్నాడంటావా?" తన ధర్మసందేహం వ్యక్త పరిచాడు చిట్టి కరణం.

"పెజలు రక రకాలుగా చెప్పుకుంటారు. అందులో నిజమేదో అబద్ధమేదో? శివాలయం అరుగుమీద కూర్చుని తెలిసీ తెలియని మాటలు అనుకోడం దేనికండీ కరణంగారూ!" రాఘవులు అన్నాడు

"అబ్బె – అది కాదు...." చిట్టి కరణం తికమక పడ్డాడు.

* * *

కెప్టెన్ సుబ్బరాజుగారి కుటుంబం తర తరాలుగా ఆ ఊళ్ళోనే ఉంది. ఆయన మిలిట్రీలో కెప్టెన్‌గా పని చేసిన వాడు కాదు అసలాయన చదువుకున్నదే తక్కువ. కాని ఆయన వయసులో ఉన్న రోజుల్లో గ్రామాల్లో బాడ్మింటన్ ఆడటం పెద్ద వ్యామోహం అయింది. ప్రతి ఊళ్ళోను కనీసం నాలు గైదు చోట్ల బాడ్మింటన్ కోర్టులు కట్టి ఆడుతుండేవారు అలాటి ఒక బాడ్మింటన్ టీంకి కెప్టెన్‌గా ఉన్నందు వల్ల ఆయనకి కెప్టెన్ సుబ్బరాజుగా పేరు స్థిరపడిపోయింది.

కెప్టెన్ రాజుగారికి తండ్రి నుంచి పదిహేనెకరాల ఒకటో రకం మాగాణి పొలం, ఇల్లు సంప్రాప్తించాయి..... ఆ రోజుల్లో ఎక్కువ చదువుకోలేకపోయానన్న బాధ ఉంది తన అడుగులో అడుగేసుకుంటూ నడిచొచ్చే పెళ్ళాం, రత్నాల్లాంటి ముగ్గురు పిల్లలు – ఆయనకి గర్వ కారణాలు.

తను ఎక్కువ చదువుకోలేకపోయానన్న బాధతో ఆయన పిల్లల్ని బాగా చదివించాలనుకున్నాడు. చిన్నప్పట్నుంచి వాళ్ళ దృష్టి చదువు వైపు మళ్ళించడానికి ప్రయత్నించాడు.

పెద్ద కొడుకు సూర్యం అనబడే సూర్య నారాయణరాజుకి చదువుమీద శ్రద్ధ లేదు ఏడో తరగతి చదువుతూ మానేసి తండ్రికి వ్యవసాయంలో తోడుగా ఉండటం మొదలెట్టాడు

రెండో సంతానం కూతురు వర్ధని, ఆమె స్కూల్ ఫైనల్ పాసయ్యాక కాలేజీ చదువులకి పంపడానికి- సుబ్బరాజు తల్లి ఒప్పుకోలేదు. మంచి సంబంధం చూసి పెళ్ళి చేసి పంపించాడు

ఇహ ఆఖరివాడు – రాజశేఖరం అనబడే శేఖరం

అతను తండ్రి ఆలోచనల్ని పుణికి పుచ్చుకున్నట్టుగా ఉంటాడు. చిన్నప్పట్నుంచి చదువుమీద శ్రద్ధ ఉన్నవాడు అతని శ్రద్ధకు తండ్రి సహకారం లభించింది. అంచ లంచలుగా మంచి మార్కులతో పాసయ్యాడు. ఇరవై ఏళ్ళు నిండే సరికి ఇంజనీరింగు పూర్తి చేసాడు. యూనివర్శిటీ లెవెల్లో రాంక్ కూడా సంపాయించాడు.

శేఖరం మంచి తెలివైన వాడు చురుకైన వాడు. రాంక్‌లో పాసైన అతనికి అమెరికా పై చదువులకి సీటు వచ్చింది. తండ్రి ఆనందానికి, కొడుకు ఉత్సాహానికి హద్దుల్లేవు. డబ్బుకి కొదువ లేదు.

శేఖరం అమెరికా వెళ్ళాడు. రెండేళ్ళు పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసాక రిసెర్చిలో సీటు వచ్చింది. అదీ పూర్తి చేశాడు. వెంటనే మంచి ఉద్యోగం దొరికింది. అందులో చేరాడు స్టూడెంటు షిప్ మీద చదువుకుంటూ ఉండడంవల్ల డబ్బుకి కాస్త ఇబ్బందిగా ఉండి, అప్పట్లో ఇండియాకి రాలేకపోయాడు. ఉద్యోగంలో చేరాక ఖాళీ దొరక్క, వీలు

శెలవు దొరక్క ఇండియా రాలేక పోయాడు.

ఏతా వాతా జరిగిందేవిటంటే అమెరికా వెళ్ళిన ఎనిమిది సంవత్సరాల తర్వాత అతను ఇండియా వస్తున్నాడు – అదీ నాలుగు నెలలు శెలవు తీసుకుని.

సుబ్బరాజుగారి కుటుంబపు ఆనందానికి అవధుల్లేవు. ఆ ఊళ్ళో వారి ఉత్సాహానికి హద్దు లేదు.

శేఖరం స్టేషన్లో దిగేసరికి తల్లి తండ్రి ఎదురొచ్చి కావలించుకున్నారు. అన్నగారికి తమ్ముణ్ణి చూడగానే కళ్ళ నీళ్ళు తిరిగాయి. అక్కగారు, బావగారు, వదినగారు అంతా మొహాలు చంద్ర బింబాలంత చేసుకుని అతనికి స్వాగతం-పలికారు.

టాక్సీల్లో తమ ఊరు వెళ్ళారు. పట్నానికి తమ ఊరికి మధ్యలో రోడ్డుకి రెండు వైపులా పంట పొలాలు. కొద్ది రోజుల్లో కోతకి సిద్ధమవుతున్న వరి పొలాలు. శేఖరం మనసు ఉల్లాసంతో గంతులు వేసింది. టాక్సీల్లోంచి చూస్తుంటే కను చూపు మేరలో, కంకుల బరువుని మేయలేక నేలకి వాలిపోయిన వరి మొక్కలు. వాటికి వెళ్ళాడుతున్న వరి గింజలు.... చూడ్డానికి ఎంతో ఆహ్లాదంగా ఉన్నాయి.

"ఇంకా ఎన్ని రోజుల్లో పొలాలు కోతకి వస్తాయి?" శేఖరం తండ్రిని అడిగాడు

"పదిసేను, ఇరవై రోజుల్లో కోసేస్తాం" తండ్రి సమాధానం చెప్పాడు.

"ఇప్పుడు పొలాలు బాగా పండుతున్నాయా నాన్నా!" – శేఖరం అడిగాడు.

"ఆ – పండుతున్నాయిరా – కొత్త రకం సాగుబడి జరుగుతోంది. రక రకాల కొత్త విత్తనాలు వచ్చాయి రక రకాల ఎరువులు, పురుగుల మందులు వచ్చాయి వ్యవసాయం పూర్వంలా లేదు. పూర్వం ఇరవై బస్తాలు పండితే అదే గొప్ప దిగుబడి అనుకునేవారు అలాంటి దిప్పుడు ముప్ఫై బస్తాలు పండిందంటే 'అంతేనా' అంటున్నారు పదేళ్ళలో వ్యవసాయ రంగంలో మార్పు వచ్చింది."

వివరంగా చెప్పాడు తండ్రి

"మన కిప్పుడు పొలం ఏమాత్రం ఉంటుంది?" అనడిగాడు తండ్రిని.

"నువ్వు అమెరికా వెళ్ళేనాటికి మనకి పాతి కెకరాలు ఉంది. తర్వాత మళ్ళీ మరో ఎనిమి దెకరాలు కొన్నాను. అంతే కాదు – ఇల్లు విప్పేసి మళ్ళీ కట్టాను. తూర్పు పొలం గట్టున దూళ్ళశాల కట్టించాను. ట్రాక్టర్ కొన్నాం – ఇవన్నీ చెయ్యగలిగామంటే ఆ భూదేవి చలవే!

అంతేకాదు – ఈ కష్టమంతా మీ అన్నయ్యదే – వాడికి వ్యవసాయం మీదున్న శ్రద్ధ ఇంతా అంతా కాదు వ్యవసాయం పనుల రోజుల్లో వాడు పెళ్ళాం పిల్లల్ని కూడామరిచిపోతాడు."

శేఖరం ముందు సీట్లో కూర్చున్న అన్నగారి కేసి ఎంతో మన్ననగా చూసాడు

తండ్రి చెప్పడం సాగించాడు –

"మా నాన్న అంటూండేవాడు ఒరేయ్ సుబ్బా నేల తల్లిని నమ్ముకోరా– నీపిల్లలతోటే అదీ పెరుగుతుంది" అని – ఆ తల్లినే నమ్ముకున్నాం – పెరిగాం.

భారతదేశం ముఖ్యంగా వ్యావసాయక దేశం కాబట్టి ఆ రంగంలో ఇంత ప్రగతి సాధించిందన్న విషయం తెల్సి శేఖరం ఎంతో మురిసి పోయాడు.

* * *

ఇంటి దగ్గర టాక్సీ దిగగానే శేఖరం దూరంగా నిలబడ్డ మహంకాళి దగ్గర కెళ్ళి"– బావున్నావా?" అన్నాడు.

"అయ్య బాబయ్య బాబోయ్ – సేకరం బాబుకి నే నింకా గ్యాపకం ఉన్నాను" అన్నాడు ఎన్నో ఏళ్ళుగా వాళ్ళ దగ్గరే పని చేస్తున్న మహంకాళి.

"అదేమిటి? చిన్నప్పుడు సీమ చింతకాయలు కోసిచ్చేవాడివి. ఎత్తుకుని తిప్పేవాడివి. నిన్నెలా మర్చిపోతాను" అన్నాడు శేఖరం.

ఇంట్లో అందరికీ రక రకాల ఖరీదైన బహుమతులు తెచ్చాడు. మహంకాళికి మూడు మంచి చొక్కాలిచ్చాడు.

"బాబూ ఇయ్యేసుకుంటే గూడెంలో జనం నవ్వుతారేమో!" అన్నాడు మహంకాళి.

శేఖరం వచ్చినప్పట్నుంచి ఆ ఇంట్లో ఏదో కొత్త ఆనందం, ఉత్సాహం వెల్లి విరుస్తోంది. అక్కగారు, బావగారు ఓ నెల్లాళ్ళు ఉండి వెళ్ళాలని వచ్చారు.

మరో పది రోజులకి మూథం వెళ్ళిపోతుంది. అప్పుడు శేఖరానికి వచ్చిన సంబంధాల ఆడ పిల్లల్ని చూడాలని సుబ్బరాజుగారు నిర్ణయించారు.

శేఖరానికి సాయంత్రాలు పొలం గట్టున కాలక్షేపం అవుతోంది. కూడా అన్నగారు గాని, మహంకాళి గాని ఉంటున్నారు. పొతకల్లాంటి గింజల్ని ధరించిన వరి కంకులు, వరి కంకుల బరువుకి తట్టుకోలేని వరి వంగడాలు ఒరిగి పోయిన దృశ్యం.... అతని కేదో ఆనందం, హాయి...

సూర్యం కోతల కోసం ప్రయత్నాలు సాగిస్తు-



న్నాడు. పొలం గట్టుకి వెళ్ళినప్పుడల్లా మహంకాళి కొబ్బరి బొండాలు తీసి తాగడానికి ఇస్తున్నాడు. శేఖరం తన కెమెరాతో ఎన్నో ఫోటోలు తీసాడు.

మరి కొద్ది రోజులు పోయాక – ఓ రాత్రి భోజనాలయ్యాక అన్నగారి గదిలో కెళ్ళాడు శేఖరం. అన్నగారు రేడియోలో పాటలు వింటున్నాడు. వదినగారు ఓ పక్కన కూర్చుని చేతికి గోరింటాకు పెట్టుకుంటోంది.

కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడ్డం పూర్తయ్యాక –

"నాన్న పొలం వాటాలు వేస్తానంటున్నారు. నువ్వొచ్చే ముందు చెప్పారు. అలాంటప్పుడు నీ పొలం వేరే ఎవరికీ కౌలుకి ఇవ్వొద్దు – ఊరు బాగా లేదు. నా పొలంతో పాటే నేను చూసి పెడతాను" అన్నాడు సూర్యం.

నాన్న నాతో కూడా ఆ విషయం చెప్పారు. నేను తర్వాత మాట్లాడదాం– అన్నాను. అయినా నేనా విషయంలో ఓ నిర్ణయాని కొచ్చేసాను."

శేఖరం మాటలకిబిత్తర పోయి చూసాడు సూర్యం. అతని భార్య రివ్వున తలెత్తి చూసింది.

"నాకు పొలంలో వాటావద్దు– ఓ అయిదెకరాలు అక్కకిచ్చి మిగిలినదంతా నీకే ఇచ్చెయ్యమని చెప్తాను...."

"అది కాదురా..."

"నేను అమెరికాలో బోలడు సంపాయిస్తున్నాను. ఇంకా సంపాయిస్తాను. నాకు లోటులేదు. ఇన్నేళ్ళుగా దాన్ని నమ్ముకుని రెక్కలు ముక్కలు చేసుకుంటున్న వాడివి నువ్వు– అది నీకే దక్కాలి..." అన్నాడు.

తమ్ముడి మాటలు విన్న సూర్యం అచేతనుడై పోయాడు. తన తమ్ముడు ఎంత ఎదిగిపోయాడోనని ఆశ్చర్యపడ్డాడు. అసలు వాటాల విషయం ప్రస్తావనకు వచ్చినందుకు సిగ్గుపడ్డాడు

కొద్ది రోజులకే కోతల పనులు మొదలయ్యాయి. అన్నగారితో పాటు శేఖరం కూడా రోజూ పొలం వెళుతున్నాడు. లేదా భోజనం సమయానికి అన్నగారికి తీసికెళ్ళేవాడు. అతనికల్లా అన్నగారికి పొలం పనుల్లో సాయపడటం ఎంతో ముచ్చటగా ఉంది.

కోత పనులు పూర్తయ్యాయి– తర్వాత పని రెండు పెద్దగట్ల మీదకి చేరవేసి కుప్పలుగా వేశారు. ఒక్క ట్రాక్టరు చాలదని మరో ట్రాక్టరు అద్దెకు తీసుకుని కుప్ప నూర్పులు మొదలెట్టారు.. కూలీలు రాత్రి పగలు జట్లు జట్లుగా పని చేస్తున్నారు. పను రోజులవడంవల్ల కూలి రేటు హెచ్చుగానే ఉంది

నూర్పులయ్యాక కళ్ళంలో ఎగరబోత కార్యక్రమం మొదలైంది. కోతలప్పుడు కుప్పలేసినప్పుడు. నూర్పులప్పుడు. ఎగబోతలప్పుడు కూలీలుఆడ మగ పాటలు పాడుకుంటూ ఉత్సాహంగా, ఉల్లాసంగా పని చేసారు. శేఖరం రోజూ పొలం వెళ్ళి జరుగుతున్న పనులన్నీ గమనించేవాడు. సాయంత్రం కాగానే కూలీలకి డబ్బు ఇస్తున్నపుడు వాళ్ళ కళ్ళల్లో వెన్నెల వెలుగు చూసేవాడు.

ధాన్యం రాసిపోసారు... ధాన్యం రేటు ఎక్కువగా లేదని, మరో రెండు నెలలాగితే ధర బాగా పలుకుతుందని అంత వరకు నిల్వ చేయడానికి నిర్ణయించాడు సూర్యం... కూలీలు ధాన్యం సంచుల్లోకెత్తి కాటాకెత్తి ఇంటికి చేరవేశారు. ఇంటి ముందున్న ఖాళీ స్థలంలో మూడు పెద్ద పురిలు కట్టి ధాన్యం అందులో నిల్వ చేసారు.ఎకరం నలభై రెండు బస్తాల చొప్పున పండింది. కొప్పెన్ రాజుగారికి, కుటుంబానికి ఎంతో ఆనందంగా ఉంది.

ఇది జరిగిన వెంటనే శేఖరం అక్కగారింటి కెళ్ళి వారం రోజులుండి వచ్చాడు. తిరిగి వచ్చిన రోజున తను ఇంత క్రితం వెళ్ళని ఉత్తర పొలం వైపు వెళ్ళాడు. కూడా మహంకాళి ఉన్నాడు. ఉత్తర పొలం వెళ్ళాలంటే గూడెం మీదుగా వెళ్ళాలి. గూడెం నిండా వ్యవసాయ కూలీలు గుడిసెల్లో కాపుర ముంటారు. వాళ్ళు ఇళ్ళ మీదుగా నడిచి వెడుతుంటే శేఖరానికి ఏదో బాధ కలిగింది....




వాళ్ళ గుడిసెల దగ్గర దరిద్రం తాండవిస్తోంది. అపరిశుభ్రతలో, లేమిలో, జ్ఞానంలో, నిరక్షరాస్యతలో అమాయకత్వంలో దుర్భరంగా బతుకుతున్నారు. అన్నిటికీ మించి ఆడవాళ్ళు మూడు రాళ్ళ పొయ్యి మీద వంట చెస్తుంటే, మగాళ్ళంతా దాడి ఆట, బచ్చాలాట, పేకాట ఆడుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. ఆచ్ఛాదన లేని ఎండిన శరీరాలతో పిల్లలు మట్టిలో దొర్లుతున్నారు. కొందరు మగాళ్ళు చుట్టలు కాలుస్తూ రోడ్ కిరు పక్కల గొంతుక్కూర్చుని ఉన్నారు....

ఉత్తర పొలం చేరుకున్నాక "బొండాలు కొట్టిమ్మంటారా బాబూ!" అన్నాడు మహంకాళి.

"వదులే!" అన్నాడు శేఖరం.

కోతలు పూర్తయిన పొలం బోసిగా, కళా విహీనమై ఉంది. శేఖరం మనసులో ఎన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. మనసంతా కకావికాలంగా ఉంది.

ఏదో వేదన.... ఏదోఆవేదన....

అంతులేని ఆలోచన.... అందులోంచి వేధన....

"మహంకాళీ! మొన్నటిదాకా మన పనుల్లోకి వచ్చిన కూలీలకి ఇంక పనులుండవా?"

శేఖరం ఎందుకలా అడిగాడో మహంకాళికి అర్థం కాలేదు.

"ఉండవండి. దాళ్వా లేదంటున్నారు. ఉంటే ఊడ్పులప్పుడు పది రోజులు పన్లుంటాయండి. మళ్ళీ కోతలప్పుడే పనులు –

అప్పటిదాకా బచ్చా లాడుకుంటూ, మొన్న సంపాయించుకున్న ధాంతో గంజి కాసుకుంటూ. సాలకఅప్పులు జేసుకుంటూ బతుకుతారండి" అన్నాడు మహంకాళి.

శేఖరానికి కడుపులో ఏదో దేవినట్టుగా అనిపించింది. ఉన్న శ్రమ శక్తిని ఉపయోగించుకోలేని దేశం.... చేస్తానంటే పని దొరకని దేశం....

కష్టపడ్డానికి సిద్ధ పడ్డా – పని దొరక్క – కడుపు నిండని చిత్ర విచిత్ర పరిస్థితి....

"మహంకాళి నువ్వెళ్ళిపో – నేను వెనకాల వస్తాను" అన్నాడు శేఖరం.

"సీకటడింది. పురుగు పుట్ర ఉంటాయి. ఎల్లిపోదాం బాబూ...." అన్నాడు మహంకాళి.

"ఫరవాలేదు. నా దగ్గర టార్చి లైటు ఉంది. నువ్వెళ్ళు."

"జాగ్రత్త సేకరం బాబూ!" అని మహంకాళి వెళ్ళిపోయాడు.

శేఖరం ఒక్కడూ పొలం గట్టు మీద కొబ్బరి మొదట్లో కూర్చున్నాడు

చుట్టూ చీకటి – కటిక చీకటి – దరిద్రమంత నల్లటి చీకటి. అతనికి గుండెల్లోంచి బాధ దూసుకొచ్చింది. మోకాళ్ళమీద తలెట్టుకుని శేఖరం ఘొల్లుమన్నాడు.

అతని ఏడుపు చూసి చీకటి నవ్వుతోంది.

పకపక నవ్వుతోంది. □

MCA/NTC/102/TEL

# ఎన్‌టైస్®

## మి జీవితాలను వెలిగిస్తుంది

సూటింగులు
పాలియెస్టర్,
పాలియెస్టర్ బ్లెండ్
మరియు కాటన్




ఇండెంటింగ్ ఏజెంట్లు :- ఆంధ్రప్రదేశ్ : బాలాజీ టెక్స్‌టైల్ ఏజన్సీస్, 3-4-394, టొబాకో బజార్, సికిందరాబాద్ 500 003, స్టాక్-కం-సేల్స్ డిపో : ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్స్,
3-4-394 టొబాకో బజార్, సికిందరాబాద్ 500 003.

కొత్త సీరియల్ ప్రారంభం!

# ఎదవీణ మ్రోగిన వేళ



# ఆశ్రమం ప్రశాంతంగా ఉంది....

## కొన్ని ఎకరాల విశాలమైన ఆవరణలో రాజప్రాసాదం వంటి పెద్ద బంగళా...

ఆవరణ నిండుగా జామ, సపోటా, మామిడి వంటి రక రకాల పండ్ల చెట్లతో పాటు, రక రకాల పుష్ప జాతులు చోటు చేసుకున్నాయి....




సువిశాలమైన ఆ బంగళాలోని పెద్ద హాల్లో "భజన" కార్యక్రమం హృద్యంగా సాగుతూంది....

"గౌరీ నందన గజాననా, గిరిజా నందన నిరంజనా,

పార్వతీ నందన శుభాననా పాహి ప్రభో మాం

పాహి ప్రసన్న... గౌరీ నందన గజాననా..."

భక్తులు తన్మయత్వంతో ఊగుతూ భగవన్నామ స్మరణలో పారవశ్యం చెందుతున్నారు....

గదిలో ఎత్తైన వేదికమీద పద్మాసనంలో కూర్చున్న "వితలానందస్వామి వారు ధ్యానంలో ఉన్నారు.

సామి వారి సేవల నిమిత్తం ఇద్దరు ప్రధాన శిష్యురాండ్రు ఆయనకు దిగువగా చెరి యొక వైపూ కూర్చున్నారు భక్తిగా

స్వామి వారి సందర్శనార్థం వచ్చిన భక్తులు, బాధితులు కొందరు భజన కార్యక్రమంలో పాల్గొనగా మరి కొందరు బారులు తీర్చి మౌనంగా, భక్తిగా కూర్చున్నారు.

స్వామి సందర్శనార్థం వేచి ఉన్న వారిలో ఎక్కువ శాతం స్త్రీలే :.

కార్లలో కాలు కందకుండా వచ్చి పట్టు చీరలు నలిగి పోకుండా జాగ్రత్త పడుతూ కూర్చునే వాళ్ళూ....

ప్రపంచంలోని కష్టాలన్నీ కేవలం తమమీదే పడ్డంత బరువుగా భారంగా, రిక్షాల్లో ఆశ్రమాన్ని చేరే మధ్య తరగతి గృహిణులూ,

దూరాభారం నుండి అనేక ప్రయాసలకోర్చి భక్తి ప్రపత్తులతో స్వామీజీని వెదుక్కుంటూ వచ్చే మధ్య తరగతి కంటే స్థాయి తగ్గిన స్త్రీలూ.... ఇలా అన్ని వర్గాల వారికీ ఆశ్రమం కేంద్రం.... పురుషులలో కంటే కూడా, అజ్ఞానం, మూఢత్వం స్త్రీలలోనే అధికశాతం అనే స్టేట్‌మెంట్‌ను ఋజువు చేస్తున్నట్టుగా ఉంది ఆశ్రమం.

పురుషులలో మాత్రం ఎక్కువ మంది ఉన్నత వర్గాలకు చెందినవారే. ధనవంతులే. ..

పెద్ద పెద్ద పదవుల్లో ఉన్న అధికారులూ, రాజకీయ నాయకులూ, పోలీస్ ఆఫీసర్లూ, డాక్టర్లూ, లాయర్లూ, కాంట్రాక్టర్లూ, ప్రొడ్యూసర్లూ, సినిమా స్టారులూ.. .

అందరూ స్వామి వారి భక్తకోటిలోని వారే... శిష్య పరమాణువులే...

స్వామీ వితలానంద సామి వారికి దేశ దేశాలలో శిష్యు లున్నారు. వారి కీర్తి ప్రతిష్ఠలు అంతర్జాతీయ స్థాయిలోనివి.

తమ తమ వృత్తి పరంగా సంఘంలో ఎంతటి ఉన్నత స్థితిలో ఉన్నవారైనా, ఎంతటి మేధావులైనా, తలలు పండిన వారైనా స్వామి వారి ముందు వినమ్రులే.... అల్పులే . అజ్ఞానులే.... పసివారే....

స్వామి వారికి అందరూ సమానులే... పుత్రసములే.... వారి దయకు అందరూ పాత్రులే....

స్వామిజీ ఆధ్వర్యంలో నాలుగు ఉన్నత పాఠశాలలూ, రెండు గురు కుల పాఠశాలలూ, రెండు మఠాలూ, మరో రెండు దేవాలయాలూ నడపబడుతున్నాయి....

భక్తులు సమర్పించిన తృణమో – పణమో పుణ్య కార్యాల నిమిత్తం వెచ్చిస్తుంటారు స్వామి విఠలానంద స్వామి వారు.

ఒక నిస్వార్థ యోగి, ఒక ప్రజా సేవా తత్పరుడు.... కామనలేని మోక్ష కామిగా పత్రికలు వారిని ప్రస్తుతిస్తుంటాయి....

భక్తుల బాధలు స్వామి వారికి తెలుసు....

ఎవరి కష్టాలు వారివి....

ఎవరి బాధలు వారివి...

ఎవరి కన్నీళ్ళ వెనుక గాధలు వారికే తెలుసు.... కాగా పోగా స్వామి వారికి తెలుసు...

సంతు లేక సమాజంలో గొడ్రాలుగాముద్ర వేసుకుని, అత్త మామల, భర్త నిరాదరణకు గురియౌతూ క్షణ క్షణం కన్నీళ్ళు కార్చే అభాగినులూ....

దీర్ఘ వ్యాధులతో చావలేక, బ్రతకలేక, బ్రతుకులు ఈడుస్తున్న దురదృష్టవంతులు....

తమకున్న వ్యాధి ఏదో కూడా గుర్తించలేక చేతబడీ, భూతాలూ, దయ్యాలూ తమను పట్టి పీడిస్తున్నాయని భ్రమ పడుతూ, మూఢ నమ్మకాల కోరల్లో చిక్కిన పీడితులూ....

వెండి పళ్ళెం పోయింది.... పని మనిషేమయినా తీసిందేమో.... కనుక్కో వచ్చిన సువాసినీ....

మా ఇంట్లో బందిపోటు దొంగతనం జరిగింది....' మా సొమ్ము మాకు దొరుకుతుందా...? అని తెలుసుకో గోరే నల్ల డబ్బుదారూ.....

## ఎద వీణ మ్రోగిన వేళ.....

అమ్మాయికి మంచి సంబంధం తక్కువ కట్నంలో దొరుకుతుందా....? అని తెలుసుకోవాలని వచ్చే మధ్య తరగతి ఆడ పిల్లలు గల కుటుంబరావులూ.... ఇలా – ఎందరో... ఎందరో....

అందరి విశ్వాసం ఒకటే....

"స్వామి విఠలానంద స్వామి" అలౌకిక శక్తి సంపన్నుడు.... మహిమాన్వితుడు.... సాక్షాత్తూ దైవాంశ సంభూతుడు....

స్వామీజీ కరుణ వలన తమ కష్టాలు గట్టెక్కుతాయి.... తమ బాధలు అదృశ్యమవుతాయి...

తమ కన్నీటికి చెలియలి కట్ట పడుతుంది....

స్వామీజీ ధ్యానం పూర్తయింది.

కళ్ళు విప్పి చూశారు.

దానికోసమే వేచి ఉన్న భక్తుల ముఖాలు సంతోషంతో వెలిగిపోయాయి.

స్వామీజీ ఉపదేశామృతాన్ని గ్రోలే నిమిత్తం భక్తులు, శిష్యులు సద్దుమణిగారు

స్వామిజీ విఠలానందుల వారి ముఖతా వ్యాస విరచిత గీతోపదేశం మృదువుగా, గంభీరంగా, మధురంగా వెలువడుతోంది....

వారి మధుర స్వరానికి మంత్ర ముగ్ధులయినట్లుగా చెవులు అప్పగించారు భక్త కోటి....

"కర్మ విషయములలో అహంకారములు లేనివాడై కర్మ ఫలముల యందాసక్తి రహితుడైన వాడు కర్మ బద్ధుడు కాడు....

కర్మ విధులు జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాతయని మూడు విధములై యుండును. కర్మయును ఆ మూడింటి నపేక్షించి కరణము కర్మ, కర్తయని మూడు రూపములుగా సంగ్రహించబడి యుండును.

ఆత్మ యనెడి భావ పదార్థము బేధములు గల వస్తువుల యందుండి-నను, దానిని సర్వ భూతముల యందును అవిభక్తముగాను, వికార రహితముగాను, జ్ఞానైక కారణము గలదిగాను, ఏ జ్ఞాని చూచునో, ఆ జ్ఞానము సాత్త్వికజ్ఞానమని ఎరుంగుము.

ఏ సుఖము యోగాభ్యాస కాలమందు మొదట విషమువలె తోచినదై, పిదప పరిపాక కాలమందు అమృత తుల్యమైనదిగా దోచునో, ఆత్మ జ్ఞాన నైర్మల్యముల వలన జనించిన యా సుఖము సాత్త్విక సుఖ మనబడును.

విషయములు, ఇంద్రియములు ఇవి కలిసి యుండుటచేత ఏ సుఖము మొట్ట మొదట అమృతముగా దోచి పిదప అంత్యమందు విషముగా దోచునో ఆ సుఖము రాజస మనం బఱగును...

మరికొంత సేపటి కానాటి జ్ఞానోపదేశ కార్యక్రమం ముగిసింది.... స్వామీ ఖిలానంద స్వామి వారు ఆర్తులకు స్వాస్థ్యం చేకూర్చే కార్యక్రమం ప్రారంభమైంది....

భక్తుల్లో కొద్దిపాటి కలకలం ప్రారంభమైంది.

ఎవరికి వారికే ఆతృత.. .. ఆరాటం....

ఎవరికి వారికే ముందుగా తామే స్వామి వారి దర్శనం చేసుకుని తమ కష్టాన్నుండి విముక్తి పొందాలనే తాపత్రయం....

శిష్యులు కలుగ చేసుకుని భక్తులను క్రమంలో ఉంచి, నిశ్శబ్దంగా ఉండమని హెచ్చరిక చేశారు

కలకలం సద్దు మణిగింది

ప్రధాన శిష్యురాండ్రు స్త్రీల వైపు నుండి ఒక్కొక్కరినే స్వామి వారి దర్శనార్థం తీసుకెడుతున్నారు ...

స్వామి వారి ముందు వెండితో చేసిన పెద్ద హుండీ ఉంది ... భక్తులు తాము పట్టుకెళ్ళిన డబ్బు భక్తితో హుండీలో వేస్తున్నారు.... బంగారు ఆభరణాలు.... పట్టు బట్టలు.... టెంకాయలు.... పండ్లూ.. .. పువ్వులూ, పసుపూ – కుంకుమా, ఇతరత్రా విలువైన కానుకలూ స్వామి వారి పాదాల ముందుంచి తమ తమ కష్టాలు విన్నవించుకుంటున్నారు.

స్వామి వారి ఒకటి రెండు మాటలే వారిని ఓదారుస్తున్నాయి ...

కళకళలాడే ముఖాలతో, సంతృప్తి చెందిన హృదయాలతో తిరిగి వెడుతున్నారు.

స్వామీజీ చేతినుండి తాయెత్తూ – విబూదీ అందుకున్న దీర్ఘ రోగులు అప్పటి కప్పుడే తమ వ్యాధులు పటాపంచలైనట్టుగా తేలికగా, సంతోషంగా, తృప్తిగా బయటికి వస్తున్నారు.

విశ్వాసం, ఆత్మ సంతృప్తిని మించిన ఔషధం ప్రపంచంలో మరొకటి లేదేమో....

"సాకేత"కు ఇదంతా చాలా విచిత్రంగా ఉంది ...

తను.... తన తండ్రి పెంపకంలో పెరిగిన తను.... ఇలా.... బాబాలూ.... అమ్మలూ.... స్వామీజీలను దర్శించేందుకు.... ఆశ్రమాల వెంటా దర్గాల వెంటా తిరుగుతుంది..... ఎంత విచిత్రం....

ఈ విషయం తన తండ్రికి తెలిస్తే..... ఏమంటారు.. ..?"తల్లీ! నేను నీకు అందించిన విజ్ఞానం అంతా మా ఇంట్లోనే వదిలేశావామ్మా...." అంటారేమో....

ఎవరినీ ఎదిరించలేని తన అశక్తత... . ఎవరికీ తన గుండె విప్పి చెప్పుకో-లేని మూగతనం....తన దురదృష్టం.... తన నిలా తిప్పుతూంది....

ఆ ఉదయం ఇంట్లో జరిగిన సంఘటన కళ్ళ ముందు కదిలింది సాకేతకు.

"సత్యా.... వంట త్వరగా పూర్తి చేసి, తలారా స్నానం చేసి తయా-రవ్వు...."

"ఎక్కడికమ్మా....?"

పాపకు పాలు ఇస్తూ కూర్చున్న స్వాతి అడిగింది.

"ఊ.... తప్పదుగా.... ఎక్కడికో అక్కడికి తీసుకెళ్ళక...."

స్వాతి మాట్లాడలేదు....

ఆమెకు తల్లి అలా డొంక తిరుగుడుగా మాట్లాడ్డం చిరాకు.

సాకేతకు అర్థం అయ్యింది.

మళ్ళా ఏ దర్గాకో.... బాబా దగ్గరికో సాయేబు గారి మఠానికో.... తాయెత్తు కట్టించడానికే..... అయి ఉంటుంది.

ఈ నరకం సంవత్సరంగా తను భరిస్తూంది.

తన బాధ వినాలనే ఆలోచన ఉండదు.... అత్తగారికి.

తన గుండె విప్పి చెప్పుకోగల స్నేహం లేదు స్వాతి దగ్గర.

ఇక భరించక చేయగలిగిం దేముంది.....?

కోడలూ, కూతురూ మౌనంగా ఉండిపోవడంతో జానకమ్మ తిరిగి అంది. "శ్రీరామ్ నగర్ దగ్గర ఆశ్రమంలో స్వామీజీ చాలా మహత్తు ఉన్నవారట.... జరిగి పోయినవీ, జరగబోయేవీ కూడా అంజనంవేసి చెప్పగలరట.... సీతమత్త చెప్పింది. .."

"అయితే....?" నొసలు ముడిచి అడిగింది స్వాతి, పాపను మంచంమీద పడుకో బెడుతూ.

"సంతానం లేని వాళ్ళకు కూడా చాలా మందికి సంతానం కలిగిందట... ఏమో..... ఏ పుట్టలో ఏ పాముందో.... ఒక్కసారి మీ ఒదిన్ని కూడా తీసుకు వెడితే...."

"ఫో మ్మా..... నీదంతా ఛాదస్తం.... మంత్రాలకు చింత కాయలు రాల-తాయా....? ఏ డాక్టరు దగ్గరికేనా వెళ్ళొస్తే మంచిది కానీ.... ఇలా తాయెత్తులకూ బాబాలకూ పిల్లలు పుడతారా....?"

నవ్వింది స్వాతి.

జానకమ్మ ముఖం గంటు పెట్టుకుని అంది, "స్వాతీ నీకు తెలీదు.... నువ్వు నోరు మూసుకో.... తనతో పాటు పెళ్ళయిన పిల్లవు.... ఏ డాక్టరుతో పరీక్ష చేయించుకుని కన్నావు పిల్లను... ఏదయినా కీడు ఉంటే తొలగి పోతుంది...."

స్వాతి మరి మాట్లాడలేదు....

వదినగారికంటే ముందుగా తను తల్లి కావడం తన క్రెడిట్‌గా భావిస్తుంది స్వాతి.

తల్లి ఆమె అభిప్రాయాన్ని బలపరుస్తూంటుంది ప్రతి మాటలోనూ....

"అత్తయ్యా.... స్వాతి చెప్పినట్టుగా నేనూ మీ అబ్బాయీ ఒకసారి డాక్టరు దగ్గరకు...."

సాకేత మాటలు ఇంకా పూర్తి కాకుండానే పెద్దగా చీత్కరిస్తూ అంది జానకమ్మ, "కనలేని వాళ్ళకు కనేందుకు సాయం చెయ్య గలరేమో గానీ, అసలు కనని వాళ్ళను కనిపించ లేరుగా డాక్టర్లు...."

ఆమె శ్లేష అర్థమైన సాకేతకు కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి....

తను...."గొడ్రాలు"

ప్రయత్నం మీద కన్నీటిని అణచుకుంది సాకేత....



# వగపెందుకే నీకు

ఓ చిన్న దీపమా! వగపెందుకే నీకు
నీ వెల్గు అల్పమని నీ వ్యాప్తి స్వల్పమని;
నీ కాంతి రేఖచే నీ శిఖా క్రాంతిచే
పెద్ద పెద్ద దీపాలు వెలిగింపబడ్డాయి

ఓ చిన్న పవనమా! వగపెందుకే నీకు
నీ విసురు అల్పమని నీ ముసురు స్వల్పమని
నీ కులుకు నడకచే, నీ చల్లదనముచే
నిట్టూర్పు గుండియలు నిర్వృతిని పొందాయి

ఓ పొన్న కుసుమమా! వగపెందుకే నీకు
నీ వలపు అల్పమని నీ పొలుపు స్వల్పమని;
నీ గంధ లహరిలో, నీ మధువు సరసిలో
ఉన్మత్త భృంగాలు లలి నోల లాడేను

ఓ స్విన్న దేహమా! వగపెందుకే నీకు
నీ శ్రమము నమ్మనీ లాభమ్ము లేదనీ;
నీ ఘర్మ జలముచే నీ కండ బలముచే
నీ దేశ భాగ్యమ్ము నిండారు చుండేను

ఓ శాంత హృదయమా! వగపెందుకే నీకు
నీ మాట నెవ్వారు నిర్ధరణి వినరనీ;
నీ సహన గుణముచే, నీ శాంతి పథముచే
నీ కీర్తి వల్లికలు ఇలనెల్ల ప్రాకేను

— కనమలూరు వెంకట శివయ్య

## ఎదవీణ మోగిన వేళ.....

ఇంత దూరం వచ్చిన తరువాత ఇక అత్తగారికి నిజం తెలీడమే మంచిది....

"అత్తయ్యా మీ అబ్బాయితో ఒకసారి మాట్లాడండి...."

సాకేత మాట పూర్తి కాకముందే "గయ్...."మని అందుకుంది జానకమ్మ.

"ఏమోనమ్మా..... ఆడది సిగ్గూ, బిడియం విడిచి బరి తెగించిపోతే ఏం చెయ్యగలం.... మొగుడూ పెళ్ళాం అన్నాక గుట్టూ, మట్టూ ఉండాలి.

ఇడిచేసిన ఆడదానిలా అలా బరి తెగించిపోతే ఇక ఆ బతు కెందుకూ. ఏ గంపకు పోసిన ఒడ్లు ఆ గంపనే ఎండాలే కానీ....

పరువూ – మర్యాదా ఒదులుకుని రచ్చ కెక్కితే.... అది ఇంక ఆడదా? గాడిదా....?"

జానకమ్మగారి వాక్ప్రవాహం సాగిపోతూనే ఉంది....

జానకమ్మను చూస్తే సాకేతకు అందుకే భయం....

సాధించ దలుచుకుంటే చాలు – ఏ చిన్న విషయానికైనా సరే.... అన్న మాట అనకుండా వరుసగా పది రోజులైనా సాధించగల నేర్పు ఉంది.

ఒక మాటకూ మరొక మాటకూ సంబంధం లేకుండా సాగుతున్న అత్తగారి సాధింపు వింటూ గుడ్లప్పగించి మౌనంగా ఉండి పోయింది సాకేత.

"గొడ్రాలుగా" ముద్ర పడుతూ నవ్వుల పాలవుతున్న తన బ్రతుకు గురించి తీవ్రంగా ఆలోచిస్తూనే వంట పూర్తి చేసింది.

అత్తగారు ప్రయాణం హడావిడిలో బాత్ రూంలో తలంటు-కుంటూంది....

ఈ ప్రయాణం ఎలాగయినా ఆపాలి....

బాబాల వెంటా, మశీదుల వెంటా, స్వామీజీల వెంటా తిరుగుతూ తన బ్రతుకు నవ్వుల పాలు చేసుకోలేదు....

స్వాతి అప్పుడే భోజనానికి కూర్చుంది.

గబగబా బెడ్ రూం లోకి వెళ్ళింది సాకేత.

బెడ్‌మీద పడుకుని పేపరు చదువుకుంటున్న మాధవ్, తలుపులు తెరుచుకుని లోపలికి వచ్చి తిరిగి తలుపులు వేస్తున్న భార్య వంక విస్మ-యంగా చూశాడు.

ఆవేళప్పుడు ఆమె ఎప్పుడూ గదిలోకి రాదు.

ఒక్క క్షణం భార్య వంక చూసి చూపులు తిప్పుకున్నాడు.

సాకేత మొహం, కళ్ళు కందిపోయి ఉన్నాయి. బలవంతంగా ఏడుపు ఆపుకుంటున్నట్టుగా మునిపంట పెదవిని నొక్కి పట్టింది.

రేగిన జుట్టూ..... అలంకరణలో అశ్రద్ధా.... జీవితం మీది విరక్తి ఆమెలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

మోయలేక మోస్తున్న జీవితపు బరువుకు క్రుంగి పోయినట్టుగా, అలసి పోయినట్టుగా ఉంది సాకేత.....

మంచం దగ్గరగా నిలబడి పోయింది ముని పంట పెదవి నొక్కు-కుంటూ.... క్షణాలు గడిచాయి.

భర్త పలకరించడని తెలుసు....

తానలా ఎన్ని గంటలు నిలబడ్డా అతను తనంత తానుగా పెదవి విప్పడు. మూడేళ్ళ వైవాహిక జీవితంలో సాకేత తెలుసుకున్న సత్యం అది.

"ఏవండీ ..."

"ఊఁ. ."

"మీ అమ్మగారు నన్ను స్వామీజీ ఆశ్రమానికి తీసుకు వెడతారట...."

.. .....

"ఎందుకో తెలుసా....? నాకు పిల్లలు కలగలేదనిట...."

........

"ఇదెక్కడి న్యాయమండీ....?"

..........

"మీకు.... మీకు.... నేనంటే ఇష్టం లేదా....?"

...... ....

"ఇష్టం లేకుండా ఈ పెళ్ళి ఎందుకు చేసుకున్నారు.... నన్నెందుకిలా హింసిస్తున్నారు...."

ఆపుకున్నా ఆగని కన్నీరు సాకేత బుగ్గల మీదుగా జారి గుండెలను తడుపుతోంది....

"మాట్లాడరేమండీ.... పెళ్ళయి మూడేళ్ళవుతూంది.... కనీసం మనస్సు విప్పి మాట్లాడ రెందుకని....?"

..........

సాకేతలో క్రమంగా ఆవేశం పెరిగి పోతోంది.

అతని మౌనంతో ఆమె గుండెలో నిచ్చిచ్చి అంటుకుంది....

## ఎదవీణ మ్రోగిన వేళ....

సాకేత అతని దగ్గరగా నడిచింది....

భుజాలు రెండూ గట్టిగా పట్టుకుని కుదుపుతూ, ఆగ్రహావేశాలతో నిలువెల్లా ఒణికిపోతూ అడిగింది, "చెప్పండి.... నన్నెందు కిలా హింసిస్తున్నారు?"

ఆమె చేతులను తన భుజాల మీద నుండి తొలగించడానికి ప్రయత్నిస్తూ, "సా- కే - తా...." అన్నాడు అస్పష్టంగా మాధవ్.

"అవును.... సాకేతనే.... మీ భార్యనే అడుగుతున్నాను చెప్పండి.... నాకు సమాధానం కావాలి. నేనంటే ఇష్టం లేకుండా నన్నెందుకు చేసుకున్నారు...? మీ అమ్మగారు నన్నిలా బాధ పెడుతుంటే.... లోకం.... లోకం నాకు గొడ్డుబోతుగా ముద్ర వేస్తుంటే.... మీరు.... మీ రెందుకు నోరు విప్పరు .. ?

"వదులు . వదులు.... సాకేతా...." ఆమె నుండి విడిపించుకునేందుకు తీవ్రంగా ప్రయత్నించాడు మాధవ్. .

"చెప్పండి..."

"ఏమిటి చెప్పాలి.. ?"

"నేనంటే మీకు ఇష్టం లేదా .. ?"

"లేదు.. లేదు.. లేదు . సరేనా .. ?"

దెబ్బ తిన్నట్లు చూసింది సాకేత.

"మరి నన్నెందుకు చేసుకున్నారు....?"

... ...

"ఎవర్నైనా ప్రేమించారా... ?"

"లేదు .. ఔను.... ఔను. .. ఇకనైనా నన్ను ఒదుల్తావా. . ?"

"వదల్ను . ఈ రోజు నాకు సమాధానం కావాలి.... నాకు సమాధానం కావాలి ... ఈ నరకం నేను భరించలేను...."

హిస్టీరియా పేషంట్‌లా ఊగిపోతోంది సాకేత.

బాధతో, దుఃఖంతో నిలువెల్లా కంపించిపోతూ అతని గుండెల దగ్గర షర్టును గుప్పిళ్ళతో పట్టుకుని గుంజింది ఉద్రేకంతో...

"చెప్పండి.... నాకు సమాధానం చెప్పండి...."

మాధవ్ షర్టు పీలికయ్యింది.

మరి సహించలేని మాధవ్ ఆమె చెంప మీద బలంగా కొట్టాడు...

సాకేత కళ్ళ ముందు చుక్కలు మెరిశాయి....

అతని షర్టును పట్టుకున్న అమె చేతులు ఒదులయ్యాయి.

బేలగా, అయోమయంగా అతని వంక చూస్తుండి పోయింది కొన్ని క్షణాలు.

సూటిగా ఆమె కేసి చూడలేని మాధవ్ చూపులు తిప్పుకున్నాడు.

సాకేతకు హఠాత్తుగా దుఃఖం ముంచుకు వచ్చింది.

నెమ్మదిగా జారి అతని పాదాలను చుట్ట వేస్తూ వెక్కి వెక్కి ఏడ్చింది. ఎన్నాళ్ళుగానో గుండెల్లో గూడు కట్టుకున్న దుఃఖం కరిగి కన్నీళ్ళుగా మారేలా పొగిలి – పొగిలి ఏడ్చింది.

ఏడుస్తూనే అంది, "గొడ్రాలు అనే ఈ నింద నేను.... నేను భరించలేనండీ.... ప్లీజ్.... నాకీ ఒక్క వరం ఇవ్వండి. . ప్లీజ్ నాకీ.... ఒక్క... వరం ఇవ్వరూ.....!"

అతని పాదాలను కన్నీటితో అభిషేకిస్తూ ప్రార్థించింది సాకేత.

మాధవ్ వంగి తన పాదాలను చుట్టిన భార్య చేతులు విడదీసుకుని మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు.

ఏడుస్తూ సొమ్మసిల్లినట్టు నేలమీద ఉండిపోయింది సాకేత.

* * * * *

"సత్యా.... సత్యా ..."

అత్తగారి పిలుపుకు ఉలిక్కి పడింది సాకేత.

"పదమ్మా .... స్వామీజీని దర్శించుకుందాం.

చుట్టూ చూసింది సాకేత.

తమ ముందు కూర్చున్న భక్తులంతా స్వామీజీని దర్శించుకుని వెళ్ళి-పోయారన్నమాట .

ఇప్పుడు తమ వంతు –

"సత్యా... "

"ఊఁ... "

"స్వామీజీ చాలా మహత్తు గలవారటమ్మా.. . భక్తిగా సేవించుకుంటే నీ కష్టాలు తీరతాయి... "

నిర్లిప్తంగా వింటూ ఉండిపోయింది సాకేత

"ఏం....? నేను చెప్పేది అర్థం అవుతుందా ?"

"ఊఁ .."

స్వామి వారి ముందు కోడలు ఎక్కడ అవిధేయత ప్రదర్శిస్తుందోనని ఆమెకు భయం పట్టుకుంది. ...

ఉదయం కోడలు కొడుకుతో మాట్లాడిన తీరు చాటుగా ఉండి చూసింది జానకమ్మ.

అంత గుండె గల జానకమ్మా సాకేత ఉగ్రరూపం చూసి బెదిరి పోయింది క్షణ కాలం. ..

ఇంత కాలం నోట్లో నాలుకలేని పిల్ల, ముంగి ముచ్చు అనుకుందే కానీ అంత ధైర్యం చేస్తుందనుకోలేదామె

అప్పట్నుంచీ కోడలు అంటే కొంచెం భయం కూడా పట్టుకుంది..

అందుకే లో గొంతులో కోడల్ని హెచ్చరిస్తూ చెయ్యి పట్టుకుని ప్రధాన శిష్యు-రాండ్ర వెంట లో పలికి నడిచింది.

ఎత్తయిన వేదికమీద పద్మాసనంలో కూర్చున్నారు స్వామీజీ. . తెల్లటి ఒంటిపై పచ్చగామెరిసి పోతున్న కాషాయాంబరాలు.... మెడలో రుద్రాక్షలు.... స్వామి వారు ఆజానుబాహులు.... దృఢమైన ఆరోగ్యవంతమైన శరీరం....

మంచి వర్చస్సు కలిగిన ముఖ మండలంలో విశాలమైన ఫాల భాగం ... సమున్నతమైన నాసిక. .. కరుణ చిలికే ఆకర్ణాంతములైన నేత్రాలూ... పాయలు పాయలుగా భుజాలమీద పడుతున్న నల్లని కేశపాశం... పొడవుగా పెంచిన గడ్డం.... అతని సుందరమైన రూపాన్ని మరింత సుందరతరం చేస్తోంది...

స్వామివారి మూర్తిమత్వం ముందు ఎంతటివాడైనా ప్రథమ దర్శనం-లోనే వినమ్రుడై సాగిలపడి మ్రొక్కాల్సిందే.. .

స్వామివారి వర్చస్సు అలాంటిది. .

జానకమ్మ – స్వామివారికి భక్తిగా సాగిలపడి మ్రొక్కింది ... కోడలినీ అలాగే చేయమని కంటి సైగతో నే హెచ్చరించింది

సాకేత చేతులు జోడించింది.

స్వామీజీ మృదువుగా మందహాసం చేస్తూ ఇరువురినీ కూర్చో మన్నట్లుగా కళ్ళతో నే చెప్పారు.

ఆయన మృదుభాషి .. మిత భాషి. స్వామీజీ నోటినుండి వచ్చే ఒక్క మాటా భక్తుల పాలిటి బంగారు మూట....

స్వామీజీ కరుణా కటాక్షం తమమీద పడితే చాలు .. తమ కష్టాలు కరిగి పోతాయి....

స్వామీజీ పెదవి విప్పితే చాలు. తమ కలలు ఫలిస్తాయి... కోరికలు ఈడేరుతాయి..

జానకమ్మ తెచ్చిన విలువైన కానుకలు స్వామి వారి పాదాల ముందుంచి ఆయన పాదాలనంటి భక్తిగా నమస్కరించి క్రింద పరచి ఉన్న తివాచీమీద కూర్చుంటూ కోడలిని కూర్చోమని చెప్పింది.

స్వామీజీ కళ్ళు విచ్చి సూటిగా చూశారు సాకేత వంక

ఇరువురి చూపులూ చిక్కు పడ్డాయి ...

ఆ చూపులు..... కళ్ళల్లో నుండి దూసుకు వెళ్ళి తన మెదడులోని భావాలను చదువుతున్నట్లుగా నిలువెల్లా కంపించి పోయింది సాకేత అతని దృష్టిలో నుండి తన దృష్టిని తప్పించుకుని కళ్ళు వాల్చుకుని తివాచీ వంక చూస్తూ కూర్చుంది సాకేత ...

స్వామీజీ వలుచగా చిరునవ్వు నవ్వారు

"ఏమిటి.. బాధ... .?"

సాకేత వంక పరిశీలనగా చూస్తూ మృదువుగా అడిగారు.

సాకేత నేల వంక చూస్తూ మౌనంగా ఉండిపోయింది.

"సమయం చాలా విలువైనది ."

"స్వామీ.. . ఆ పిల్ల నా కోడలు . పెళ్ళయి మూడేళ్ళయింది.. . ఇంతవరకూ సంతు అందలేదు మీరు అనుగ్రహిస్తే మా వంశం నిలబడు-తుంది స్వామీ...."

జానకమ్మ తిరిగి సాగిల పడుతూ చెప్పింది

సాకేత సిగ్గుతో చితికి పోయింది.

నడి బజారులో నిలబెట్టి బట్టలూడదీసినట్లుగా కుచించుకు పోయింది. అవమాన భారంతో ఆమె శిరస్సు ఒంగి పోయింది.

కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి...

"బాధ పడకు... నీకు సంతానయోగం ఉంది....."

"ఎంత చల్లని మాట చెప్పారు స్వామి "

జానకమ్మ సంతోషంతో తల మునకలౌతూ పదీ పదీ దండాలు పెట్టింది.... ఆమెను ఆశీర్వదించి స్వామీజీ కళ్ళు మూసుకున్నారు....

అంటే ఇకపైన వాళ్ళతో ఒక్క మాట కూడా మాట్లాడ రన్నమాట. ముఖ్య శిష్యురాండ్రిద్దరూ జానకమ్మనూ, సాకేతనూ బయటికి తీసుకెళ్ళారు....

(ఇంకా ఉంది)






## వ్యక్తిగతం



శాంతా [illegible] పార్కులో ఇటీవల పెచ్చు లాటకి దిగి అనాగరికంగా చెయ్యి చేసుకొన్న కారణంగా విక్టర్ ఫిమియా అనే వ్యక్తిని సోనోమా చెరశాలలో పెట్టారు. మొరటుగా కనిపించే ఫిమియా కోట్లకు పడగలెత్తిన వాడన్న, శాన్ జోస్‌కు చెందిన ఏడు సంవత్సరాల తప్పిపోయిన ఒక వ్యక్తి వల్ల తెలిసిందట. ఫిమియా తండ్రి మరణిస్తూ ఇతనికి కొన్ని మిలియన్‌ల డాలర్‌లను అప్పజెప్పాడట.... □



జింబాబ్వే సమాచార శాఖ డెప్యూటీమంత్రిగా ఉన్న డాక్టర్ నావో మెన్హా వతివా దక్షిణ ఆఫ్రికా, నమిబియా దేశాల్లో కొనసాగుతున్న జాతి విచక్షణని నిర్ద్వందంగా ఖండిస్తున్న మానవతావాది. ఈమె ఒక బానిస కుటుంబంలో నించి పైకి వచ్చిన వ్యక్తి. బానిసత్వం పోవాలని, స్వేచ్ఛ, శాంతి, మానవత్వం పెంపొందాలన్న ఆకాంక్ష గల ఈమెకి తటస్థ దేశాల అధినేత అయిన భారత ప్రధాని శ్రీమతి గాంధి విధానాలపై అచంచల విశ్వాసం ఉన్నది. దక్షిణ ఆఫ్రికా బంగారం, వజ్రాలు, యురేనియమ్, ప్లాటినమ్ వంటి ఎన్నో విలువైన ఖనిజ సంపదలున్నా అంతర్గతంగా ఉన్న సంఘర్షణల కారణంగా అవి మరుగున పడి ఉన్నాయని ఆమె అన్నారు....... □



నాటకాలు, చలన చిత్రాలద్వారా ప్రసిద్ధి పొందిన శ్రీమతి జెన్నిఫర్ కెండాల్ (50) ఉదర సంబంధమైన కాన్సర్ కారణంగా ఇటీవల లండన్‌లో మరణించారు. ఈమె ప్రముఖ హిందీ నటుడు శశికపూర్ భార్య. ఇద్దరు కుమారులలో ఒకరు కునాల్‌కపూర్ హిందీ సినిమాలలో నటిస్తున్నాడు "36 చేరంఘీ లేన్"లో అసాధారణమైన నటనని ప్రదర్శించిన జెన్నిఫర్ ప్రపంచంలో అందరి ప్రశంసలని అందుకున్నారు. బాంబే టాకీస్, జునూన్ హిందీ చిత్రాలలో నటించారు. సత్యజిత్‌రే దర్శకత్వం వహించిన 'గరె బయిరె' బెంగాలీ చిత్రంలో ఈమె నటన పరాకాష్ఠని అందుకున్నది. బ్రిటీష్ కుటుంబానికి చెందిన [illegible]

## వారఫలం

### 26-10-1984 శుక్రవారం మొదలు 1-11-1984 గురువారం వరకు

★ **మేషం :** ఏమి జరుగ బోతుంది యధా ప్రకారమే అని నిరాశ చెందవద్దు. వ్యాపారరీత్యా, రాజకీయ రంగాన మీకు ఏదో మేలు చేకూర నున్నది. కళా ప్రీతి, రచనా విధానం మీకు లాభదాయకం. స్త్రీలకు : ఉత్తమ ఫల దాయక వారం. నూతన వస్తు సేకరణకు అవకాశం.

★ **వృషభం :** గాయకులకు, సాహితీవేత్తలకు, ఖనిజ వ్యాపారమందు చేయి తిరిగిన వారికి, రాజకీయ పరిజ్ఞానం గల వారికి ధనాదాయ మున్నది. చాలా మంది ఏదో ఒక మిషతో ప్రయాణించ నున్నారు. సాగించి క్రయ విక్రయానుకూలత నంద గలరు. స్త్రీలకు · నూతనోద్యోగ ప్రాప్తి.

★ **మిధునం :** అయినవారితో గాని, పరిచితులతో గాని మీకు మాట పట్టింపులు రాగల సన్నివేశాలుంటాయి నూతన వ్యాపారం ఆరంభించుటే-గాని, దానిని పెంపుగావించే మార్గం లేక పోతుంది. రచయితలకు సదవకాశాలు లభ్యం కాగలవు. స్త్రీలకు : వృత్తియందు పెంపు. పది మందిలో ప్రతిష్ఠ లభింప గల వారం.

★ **కర్కాటకం :** చేసిన పనే మరలా చేయవలసి వస్తుంది అనవసరంగా బంధువులతో పేచీలు రాగల సన్నివేశాలుంటాయి. వ్యాపార రీత్యా కూడా పెద్దగామేలు సంభవించినట్లు గ్రహింపరు. చాలాకాలం తెచ్చిన అప్పులవారి గొడవ అధికం కావచ్చు. స్త్రీలకు : ఇంట శుభ కార్యముల గూర్చి చర్చలుండగలవు.

★ **సింహం :** ఎంతో కాలంగా చేతికి అందవలసిన పైకం అందక పోవటంతో చికాకు కలుగుతుంది. మీరు చెల్లించవలసిన పైకానికి వత్తిడి రాగలదు. చేసే వ్యాపారం లాభదాయకం కావటం గమనించ దగిన అంశం. స్త్రీలకు : వృత్తియందు యిబ్బంది ఉద్యోగమంధు కొంత తృప్తి లభించగలవారం.

★ **కన్య :** నూతనాంశాలు గ్రహిస్తారు. వ్యాపారమందుగాని, వ్యవహార మందుగాని, రాజకీయమందుగాని మీకు అనుకూలత సంభవిస్తుంది. ఇతరుల నుండి రావలసిన ద్రవ్యం సమయానికి అందటం గ్రహింప దగిన అంశం. స్త్రీలకు : సాహిత్య రంగాన మేలు. రాజకీయంగా అనుకూలత, వృత్తిరీత్యా ఆనందం చేకూరుట

★ **తుల :** సుఖశాంతులకు లోపం వస్తుంది. ఏదో చేయాలని ఆశించి ఏదో చేస్తారు. వయోవృద్ధులకు ఆరోగ్య లోపం ఏర్పడుతుంది జాగ్రత్త వహించాలి. సాహితీ రంగంలో కూడా అనుకున్న విధాన జరగదు. స్త్రీలకు · ఉద్యోగమందు అనానుకూలత, ఆరోగ్య భంగం.

★ **వృశ్చికం :** నూతనాంశాలు గ్రహింపునకు రాగలవు క్రొత్త స్నేహితులు చేర నున్నారు. ప్రతిభ రాణించే అవకాశాలున్నాయి. మీకు రచనా విధానంలో ప్రజ్ఞ ఉంటే రాణింపునకు రాగలదు. పత్రికా విలేఖరులకు ధనాదాయమున్నది. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు ప్రోత్సాహం లభించటం, స్వల్పంగా ధనాదాయం చేకూరటం చెప్పదగిన అంశాలు.

★ **ధనుస్సు :** రాజకీయంగా మీరు అనుకున్న దొకటి, ఆచరించినది మరొకటి, తద్వారా యిబ్బందులు రాగలవు. చాలా మందికి ఆరోగ్య భంగం చెప్పదగిన అంశం. గృహోపకరణములు సమకూర్చుకో గలుగుతారు. స్త్రీలకు . కుటుంబానందం, నగల సేరణకు అవకాశం లభించి,వారమంతా ఉత్సాహ జనకంగా ఉంటుంది.

★ **మకరం :** అయిన వారితో గాని, పరాయి వారితో గాని, హితులతో గాని, యజమానులతో గాని భేదాభిప్రాయాలు రాగల సన్నివేశాలుంటాయి. మీ వలన మేలు పొందినవారు, మీకు మేలు చేయ సంకల్పించారని గ్రహించి ఆనందిస్తారు. స్త్రీలకు రాజకీయంగా మేలు, మనశ్శాంతికి ఆకరమైన వారం.

★ **కుంభం ;** వారాంతం సుప్రసిద్ధ మైనదిగ కనిపిస్తుంది. మీకు గల రాజకీయ పరిజ్ఞానం అనుకూల దాయకం. సాహితీ రంగాన కొందరకు మేలు చెప్ప దగిన సమయం. విరోధివర్గాన్ని గమనించాల్సిన అగత్య మెంతైనా ఉన్నది. స్త్రీలకు : ముఖ్య బంధువులను కలిసికోవటం, శుభ ప్రస్తావనకు అవకాశం.

★ **మీనం :** ఎంతో కాలంగా కలలు గన్న ఒకానొక విషయం మీకు ఈ వారంతో శుభ సుందరంగా నెరవేరగలదు. మీకు గల రాజకీయ పరిజ్ఞానం వికాసమొంది లాభదాయకం కానున్నది. స్త్రీలకు : ఇంట శుభ ప్రస్తావన లుండటం, అధిక వ్యయం సంభవించటం గమనించ గలుగుతారు.




# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యిక

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

1 కి.గ్రా. ప్యాక్‌లో
కూడా దొరుకుతుంది.
దీని లోపల ఉంది ఉచితంగా
లభించే
మగ్.

పెరిగే వయస్సులోని పిల్లలు మరే మాల్టెడ్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఝామ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసీ కాదు. ఉంది అందులో మరేదో. ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు

క్యాడ్‌బరీస్

# బోర్న్‌విటా

పిల్లలు సరిగ్గా పెరగడం,



# ఆలోచనకు ఇవతలి వైపు

విశ్వనాథ గణపతి రావు

ఆ మలుపు తిరిగాడు నరసింహులు

తిరగగానే ప్రక్క వీధి వచ్చింది ఆ వీధిలో ఉన్న అడ్రసులు తన చేతిలో ఉన్నాయోమోనని చూసుకున్నాడు. చేతిలో ఉన్న కవర్ల కట్టలో నుండి ఒకే ఒక కవరు బయట పడింది. దానిమీద అడ్రసు చూసాడు.

ఆ అడ్రసు తను ప్రతీ రోజూ చూస్తున్నదే!

యధాలాపంగా అల్లంత దూరంలో ఉన్న ఆ అడ్రసు గల ఇంటి వైపు చూసాడు

గుమ్మానికి చేరబడి ఆ అమ్మాయి నిలుచుని అంది. ఆ అమ్మాయి ప్రతి రోజూ ఈ వేళకు అక్కడే నిలుచునే ఉంటుంది. అది ఆమెకు దిన చర్య.

ఆమెకు ఉత్తరం అందించడం తనకూ దిన చర్యే అయిపోయింది- అని అనుకున్నాడు నరసింహులు అనుకుని ఈ కవరు పట్టుకుని ముందుకు నడిచాడు

నల్లని తారు రోడ్డు మీద నడుస్తున్న అతనికి ఎందుకనో ఈ రోజు ఆలోచించాలనిపిస్తుంది, తను ప్రతీ రోజూ అందించే ఈ కవర్లకోసం, వాటి కోసం నిరీక్షించే ఆ అమ్మాయి కోసం .

ఆలోచిస్తుంటే అన్నీ ప్రశ్నలే ఎదురవ్వ సాగాయి.

అసలు ప్రతి రోజూ ఈ అమ్మాయికి లెటర్ వ్రాసె వాళ్ళెవరూ?.. .

బంధువులా? బంధువులైతే ప్రతీ రోజూ రాస్తారా? కాదు కాదు ఇదేదో ప్రేమ వ్యవహారమే అయ్యి ఉంటుంది అటువంటిది కాకపోతే ఒక్క రోజు కూడా తప్పకుండా రాస్తారా?

ఆ ప్రేమించే వాడెవడో డైరెక్టుగావచ్చి ఈ అమ్మాయి తల్లి దండ్రులతో మాట్లాడొచ్చుకదా?.... ధైర్యం లేకనా? అంత ధైర్యం లేనివాడు ప్రేమించడం ఎందుకూ?

ఒకవేళ ఇది మోసమేమో! . మాయ మాటలకు ప్రేమ అనే రంగు పూసి అందంగా పొందు పరచి రాసే ఈ లెటర్స్ ద్వారా ఆమెను మభ్య పరచి, వంచించాలని చూస్తున్నాడేమో?!

"ఛీ! ఛీ! ఈ కుర్రకారు ఎందుకిలా తయారవుతున్నారు? ప్రేమించుకోవడం తప్పు కాదు! కాని దాని పేరు చెప్పి వంచించుకోవడం పాపం కాదూ?

ఆ పాపానికి బలై పోబోతున్న ఈ అమ్మాయిని చూస్తుంటే తనకు బాధనిపిస్తుంది.

తన కెందుకు బాధ?

ఆమె తన కేమవుతుందని?

ఏమీ కాకపోయినా ఈ అమ్మాయి ఇంచు మించు తన కూతురు ఈడుదే! .. అందుకే ఈ ప్రేమ వ్యవహారాన్ని, ఈ వంచనని తెలివిగా తప్పించాలి!

అంటే తను ఏం చెయ్యాలి? ..

ఈ రోజు వచ్చిన కవర్ని ఈ అమ్మాయి కివ్వకుండా, ఆమె తల్లి దండ్రులకి అందేలా చెయ్యాలి! తరువాత జరిగే పరిణామం ఎలా ఉంటుందో చూడాలి.

అవును! ఇదే సరైన పద్ధతి!

ఒకవేళ తను విపరీతంగా ఆలోచించి, కూడని పని చెయ్యడంలేదు కదా? ...

కాదు, కాదు ఇది కూడని పని కాదు. ఓ అమాయకజీవి కల్యాణ పీఠమని తలచి బలిపీఠాన్ని ఎక్కబోతుంటే నేర్పుగా తప్పించాలని చేస్తున్న ప్రయత్నం మాత్రమే!

ఈ ఆలోచనలు ఎంతటి విపరీతాన్ని సృష్టిస్తుందో అతను గ్రహించలేకపోయాడు అందుకే ఇంతసేపు ఆలోచించ గలిగాడు.

"క్లింగ్! క్లింగ్!" మని సైకిల్ బెల్ వినిపించగానే ఉలిక్కిపడి ఆలోచననుండి తేరుకున్నాడు నరసింహులు. తేరుకుని తను ఎక్కడున్నాడో చూసుకున్నాడు అనుకోకుండా ఆ అమ్మాయి నిలుచునిఉన్న ఇంటి ముందుకే వచ్చేసాడు. వెను తిరిగి చూసాడు.

ఎవరో కుర్రాడు సైకిల్‌మీద కూర్చుని ఒక కాలు నేల మీదకు ఆనించి నిలుచున్నాడు

"ఎ-270 ఇంటికి ఉత్తరాలేమైనా ఉన్నాయండి, పోస్టుమన్‌గారు?" అని అడిగాడు

"లేవు!" అని టక్కున సమాధాన మిచ్చాడు నరసింహులు ఎందుకంటే, ఆ ఇంటి నెంబరు ఈ వీధిలోనే ఉంది. ఈ వీధిలో ఆ అమ్మాయికి ఇవ్వవలసిన కవరకు తప్ప మరొకటి తన దగ్గర లేదు కనుక

గబుక్కున తల ఎత్తి అటు చూసాడు. ఆ అమ్మాయి తన వేపే చూస్తుంది. నిన్నను తను ఇచ్చిన కవరులోని వివరాలకూ, ఇప్పటికీ ఒక్క రోజు కాలం గడిచినా, ఒక యుగం నుండి వార్తలు అందక ఆందోళనగా చూసే చూపులా ఉంది ఆమె చూపు!

ఒక్క క్షణం తత్తర పడ్డాడు. 'కవరు ఇచ్చేద్దామా' అనుకున్నాడు ఇచ్చేస్తే, ఇంతసేపూ తను ఆలోచించిన దానికి అర్థ మేముంటుంది? అని అనుకుంటూ ఒక్క అడుగు ముందుకు వేసి, ఎందుకనో మరోసారి ఆమె వైపు చూసాడు ఆమె ముఖంలో ఆశ్చర్యం, ఆందోళనా కనిపించాయి వాటిని గ్రహించినా తన నిర్ణయం ప్రకారం వడి వడిగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

వీధి చివరికి వెళ్ళి ఒక్కసారి వెను తిరిగి చూశాడు ఆమె అతనివైపు చూస్తూనే ఉంది. కాని ఆమె ముఖంలో భావాలు స్పష్టంగా కనిపించడం లేదు అతనికి

మలుపు తిరిగి మరో వీధిలోకి వెళ్ళిపోయాడు మిగతా కవర్లు ఇవ్వడానికి!

* * *

కవర్లన్నీ ఇచ్చేసి మిగిలి ఉన్న ఒక్క కవరు పట్టుకుని మళ్ళీ ఈ వీధికే వచ్చాడు నరసింహులు వస్తూ మలుపు తిరిగి ఆ ఇంటి వైపు చూశాడు అక్కడ ఆ అమ్మాయి నిలుచుని లేదు వడి వడిగా అడుగలు వేస్తూ అక్కడికి వచ్చాడు

ఇంటికి తాళం వేసి ఉంది.

ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు నరసింహులు

'ఆ అమ్మాయి తప్ప వాళ్ళు వాళ్ళెవరూ ఇంట్లో లేరన్నమాట అందుకే ఎక్కడికో వెళుతూ తాళం వేసుకుని వెళ్ళిపోయింది '

తలుపు క్రింద నుంచి లోపటికి వేసేస్తే! నో!',

వద్దు! మరలా ఆ అమ్మాయే వచ్చి తీసుకుంటుంది. ఇందాక ఇవ్వని కవరు ఇప్పుడు ఎలా ఇచ్చాడూ?' అని తనమీద అనుమానం కూడా పడవచ్చు! అందుకని

రేపు రాబోయే కవరూ, ఇదీ కలిపి రేపే వాళ్ళ తల్లి దండ్రులకు అందించేస్తే సరిపోతుంది! అని మనసు ఆదేశించగా, ఆ కవరును బుజానికి వ్రేళాడుతున్న ఖాకీ రంగు సంచిలో పడేసుకున్నాడు

అక్కడనుండి తిన్నగా పోష్టాఫీసుకి వెళ్ళి అక్కడ ఆఫీసు పనులు చూసుకుని తరువాత ఇంటికి బయలు దేరాడు

* * *

లావణ్య చనిపోయింది

ఆత్మహత్య చేసుకొని చనిపోయింది

ఉరి పోసుకుని చనిపోయింది

మతి పోయింది చాలా మందికి, ఈ వార్త తెలిసిన తరువాత ఎన్నో అనుకున్నారు తర్వాత! .

ఇంత అఘాయిత్యం ఎందుకు చేసుకుంది?

ఉరి పోసుకుని చనిపోవల్సిన కష్టమేమొచ్చి పడింది? ఇక పెళ్ళి కాదేమోనని భయపడిందా?....

అప్పుడే ఎందుకంత భయం? ఇంకా పదహారేళ్ళ వయసు కూడా పూర్తిగా నిండలేదే!.... తండ్రి ఏమైనా అన్నాడా?

తప్పు, తప్పు!... ఆయన్ని అనుకుంటే పాపం చుట్టుకుంటుంది. కూతుర్ని పల్లెత్తు మాట ఏనాడూ ఉని ఎరుగడు భార్య పోయిన తరువాత, అన్నాళ్ళూ కళ్ళలో పెట్టుకుని పెంచుకున్నాడు...!. పాపం!. . అసహాయుడ్ని చేసి పోయింది. ఎంత పని చేసింది!... అసలెందుకు చేసిందింత పని ఇంత విరక్తి ఆమెకు ఎందుకు కలిగింది

ఇంతటి తెగింపు చేయడానికి ముఖ్యమైన కారణ-మేమైనా ఉందా? ... ఉండే ఉండి ఉంటుంది. లేక-పోతే బ్రతుకును ముగించుకునే తెగింపు చేయదు కదా?! ... కారణం ఏమయుంటుంది?,

ప్రేమలో గాని పడిందా? దానివల్ల మోస-పోయిందా? లేదు! లేదు! . . లావణ్య అటువంటిది కాదు. ఏనాడూ ఏ యువకుడితోనూ కనీసం మాట్లాడినట్టు కూడా చూడలేదు.

చూడకపోయినా అటువంటి దేదో ఉండి ఉంటుంది ప్రేమలూ, మోసాలూ జరగకుండా ఇలాంటి అఘాయిత్యానికి ఏ అమ్మాయి కూడా తలపడదు!

పోయింది ఎలాగా చనిపోయింది గాని, పాపం ఆ తండ్రి బాధను చూడలేక పోతున్నాం! కన్నీరు, మున్నీరుగా ఏడుస్తున్నాడు. అది కన్నీరు కాదు. రక్తమే!

రక్తానికి రక్తంగా ఏడుస్తున్నాడు

ఏమైపోతాడో పాపం!

"చూడు నరసింహులూ .."

చూసాడతను. ఎదురుగా పోస్టు మాష్టారుగారు నిలుచుని ఉన్నారు చాపమీదనుంచి గబుక్కున లేవబోయిన నరసింహులుని భుజం మీద చేయి వేసి కూర్చోబెట్టి, తనూ ప్రక్కనే కూర్చున్నారు మాష్టారు-గారు

"చూడు నరసింహులు! జరిగి పోయిందేదో జరిగి పోయింది. నువ్విలా బాధ పడుతూ ఉన్నంత మాత్రాన, చనిపోయిన నీ కూతురు బ్రతికి రాదు. ఈ రెండు రోజులకే నీవు సగం మనిషివై పోయావు. నా మాట విని రేపట్నుంచి ఆఫీసుకి వచ్చేయ్! అలాగైనా కాస్త బాధను మరచిపో గలుగుతావు" అని అనగానే నరసింహులు గొల్లున ఏడ్చేసాడు ఏడుస్తూనే అన్నాడు-

"అసలు నేనేం పాపం చేసాను సార్? ఆ భగ-వంతుడు నాకీ అన్యాయం చేసాడు!"

"అన్యాయం చేసింది భగవంతుడు కాదురా! నీ కూతురు చేసింది!" అని అనలేకపోయారు మాష్టారు-గారు మరో మాట చెప్పి సమాధాన పరచనూ లేకపోయారు నరసింహులి బాధ చూసి అతని గుండె కూడా బరువెక్కిపోయి, కళ్ళలో సన్నని నీటి



పొర ఏర్పడింది. ఇంతలో నరసింహులు గబుక్కున లేచి వెళ్ళి గోడ బీరువాలో నుండి చిన్న చెక్క పెట్టి తీసుకొని వచ్చి తెరిచి చూపించాడు.

అందులో కొన్ని బంగారు వస్తువులున్నాయి.

"చూడండిసార్! నా కూతురికోసం చేయించి దాచి ఉంచిన వస్తువులు వీటిలో వాళ్ళమ్మవి కూడా ఉన్నాయి. ఆ బీరువాలో ఉన్న స్టీలు, ఇత్తడి వస్తువులూ దాని కోసమే ఉంచాను. ఆ మూల ఉన్న ట్రంకు పెట్టిలో ఉన్న బట్టలన్నీ దానివే సార్!. . 'ఈ వస్తువులన్నీ నీ కోసమేనమ్మా' అంటే 'ఇవి నా కెందుకు నాన్నా' అనేది నా బంగారు తల్లి. దానికి అర్థం ఆనాడు నాకు తెలియక పోయినా ఈ బంగారం విడిచిపెట్టి నా బంగారు తల్లి వెళ్ళి-పోయిన రోజున తెలుసుకున్నాను. ఎంత పని చేసిందో చూడండి సార్!... ఇప్పుడు వీటిని నేనేం చేసుకోవాలి?...." అంటూ తల బాదుకుని ఏడవ సాగాడు చేతిలో పెట్టి నేల మీద పడి వస్తువులన్నీ చెల్లా చెదురై పోయాయి వాటి నన్నిటినీ ఏరి పెట్టిలో పెట్టి దానిని తీసుకెళ్ళి బీరువాలో పెట్టారు మాష్టారు-గారు. జేబులో నుండి రుమాలు తీసి కళ్ళొత్తు-కుంటూ వెలుపలికి నడిచారు. మరిక ఆ ఉద్వేగాన్ని భరించలేక!

* * *

నరసింహులు ఏడుస్తున్నాడు. గొల్లున ఏడు-స్తున్నాడు

ఆ మూల వెలుగుతున్న చిరు దీపం వైపు చూస్తూ

చింకి చాప మీద కూర్చుని ఏడుస్తున్నాడు.

చిరు దీపం చిట్లి పోయింది. చిరు దివ్వె ఆరి పోయింది. తన బ్రతుకు చింకి చాపలా మారి పోయింది.

జుట్టు పీక్కున్నాడు నరసింహులు. మూడు రోజులుగా కన్నీళ్ళు కారుస్తున్న అతని కళ్ళు గాజు కళ్ళలా మారి పోయాయి. మొహం పాలిపోయింది. గొంతు పెరిగి పోయింది.

జవసత్వాలుడిగిన వాడిలా గోడకు చేరబడి ఏడుస్తున్నాడు. కన్నీరు ఏరులా పారుతుంది. పారుతున్న కన్నీటిని ఎవరు ఎన్ని విధాలుగా ప్రయత్నించినా ఆపలేక పోతున్నారు. ఆ కళ్ళు శాశ్వతంగా మూసుకున్ననాడే అది సాధ్యమని ఊహిం చారు కొందరు.

ఊహలన్నీ నిజాలయితే విధిని, విధాతన్నూ నమ్మే వాళ్ళెవరూ?....

ఎవరో, దగ్గరగా వేసి ఉన్న తలుపులను తోసుకుని లోపలికి వచ్చారు.

నరసింహులు మెల్లగా తలఎత్తి చూసాడు. కన్నీటి తెరలలోంచి ఎదురుగా నిలుచుని ఉన్న అమ్మాయి అలుక్కు పోయినట్టు కనిపించింది. చేతి మండతో రెండు కళ్ళూ తుడుచుకుని చూసాడు.

ఆ అమ్మాయే!....

తను మూడు రోజుల క్రితం వరకూ ప్రతీ రోజూ ఒక కవరు అందించే అమ్మాయే!

ఎందుకొచ్చింది?....

ఆమె కవరు తన దగ్గర ఉండిపోయింది కదూ? ఆ కవరు కోసమేనేమో?! ..

ఉండిపోయిందని ఎలా తెలుసూ?....

ఎందుకు తెలియదూ?.... తరువాత వచ్చే కవరులో, తను ఇవ్వకుండా ఉంచేసిన కవరులోని వివరాలు కొన్నైనా రాసే ఉంటాడు కదా? ఆ రోజు కవరు అందిందో లేదోనని వ్రాస్తాడుకదా!.... ఆ కవరు కోసమే వచ్చి ఉంటుంది.... అసలు తను ఇల్లు ఎలా తెలుసుకుంది?.... ఎలాగో తెలుసుకుని ఉంటుంది. అందుకేరాగలిగింది.

కవరు ఉంచేసినందుకు క్షమాపన చెప్పుకోవాలి!

"ఏం కావాలమ్మా!"

అతని గొంతు బొంగురు పోయి ఉంది.

"నా పేరు శారద...." అని చెప్పి ఆగిపోయింది. ఆమెకు మాట్లాడం అంటే భయంతో గొంతు తడారి పోతుంది.

"కూర్చో అమ్మా!" అన్నాడు నరసింహులు.

గబుక్కున చాప మీద కూర్చుండి పోయింది, మరిక నిలువలేనట్టు. గొంతు లాలాజలంతో తడుపుకుంది మాట్లాడాలని.

"నేను.... నేను మీ అమ్మాయిస్నేహితురాల్ని! మీరు ప్రతీ రోజూ నాకు ఇచ్చే కవరు తీసుకొచ్చి మీ లావణ్యకే ఇచ్చేదాన్ని. అవి చదువుకుని అందులో వివరాలు నాకు ప్రతీ రోజూ చెప్పేది....' నిద్రలో మాట్లాడుతున్నట్టు చెప్పుకు పోతుంది శారద.

## ఆశ – నిరాశ

మనిషిని
చైతన్యంతో
కడవరకు
బ్రతికించేది ఆశ!
మనిషిని
సజీవంగా
దహనం
చేయగలిగేది నిరాశ!!

– వలి

## ఆలోచనకు ఇవతలి వైపు

పిచ్చివాడిలా చూస్తున్నాడు నరసింహులు ఆమె వైపు!

"....ఆ రోజు మా స్నేహితురాలు సుభాషిణి పెళ్ళి శివాలయంలో జరుగుతుంటే లావణ్య, నేనూ వెళ్ళాం! అక్కడ అనుకోకుండా ఒక రచయితతో మన లావణ్యకు పరిచయం కలిగింది. అతనిది రాజమండ్రి. సుభాషిణి వాళ్ళ పెద నాన్నగారి అబ్బాయట.... అతని రచనలంటే తనక ఇష్టమని ఆ రోజు నుండీ చెబుతూ ఉండేది నాతో. ఆ చెప్పే తీరు చూసి ఓ రోజు నాకు అనుమానం వచ్చి, "నీకు అతని రచనలంటే ఇష్టమా? లేక అతనంటే ఇష్టమా?' అని అడిగాను. నవ్వి ఊరుకుంది. ఆ తరువాత అతనినుండి నా అడ్రస్సుకి ఉత్తరాలు రావటం మొదలయ్యాయి. అప్పుడు నాకు అర్థమయింది. పరిచయాలు కాస్తా ప్రేమలుగా మారాయని.... లావణ్య నా దగ్గర ఏ విషయం దాచేదికాదు. అతనంటే ఎంత ఇష్టమో చెప్పి మురిసి పోయేది. ఒక్కొక్క రోజు వచ్చిన లిటర్సులో పెళ్ళంటూ జరిగితే తనతోనే జరుగుతుందని రాసేవాడు. అప్పుడప్పుడూ నిరాశగా రాసేవాడు. తన తల్లి దండ్రులు ఒప్పుకోలేదనో, లేక తన అన్నయ్య ఇష్టపడలేదనో రాసేవాడు. అప్పుడు లావణ్య డీలాపడి పోయేది! ఆ సమయంలో దాన్ని చూస్తుంటే నా గుండె తరుక్కు పోయేది! ఆ మరుసటి రోజే ఆనందకరమైన వార్త చెప్పేది. ఇలా ఆరు నెలలుగా తను తీపి చేదులు చవి చూస్తూ, నాకూ చూపించేది. కాని పది రోజుల నుంచి వచ్చే ప్రతి ఉత్తరం నిరాశను సృష్టిస్తూ వచ్చాయి. తనకు వేరే పెళ్ళి సంబంధం చూపించటానికి బలవంతంగా తీసుకెళుతున్నారని, అన్నయ్య, తండ్రి తిట్టారని, ఆదర్శంతో రాసిన తన కథలను కించ పరిచారని.... ఆదర్శాలు కథలలో వ్రాయడానికేగాని, ఆచరించడానికి కాదన్నారనీ – ఇలా రాస్తూ వచ్చాడు. లావణ్య నన్ను వాటేసుకుని గొల్లున ఏడ్చేది. దాన్ని ఓదార్చడం నాశక్తికి మించిన పనయ్యేది. మరో రోజు తను ఆత్మహత్య చేసుకోవడానికి ప్రయత్నించి దొరికి పోయానని, అప్పటినుండి తనతో ఇంట్లో వాళ్ళెవరూ మాట్లాడం లేదని వ్రాసాడు. ఆ రోజు లావణ్య తల బాదుకుని ఏడ్చింది.

ఆరోజు – అదే, లావణ్య చనిపోయిన రోజుకు ముందు రోజు వచ్చిన లెటర్‌లో రేపు రాయబోయేదే చివరి లేఖ. ఇది నీకు నేను రాయలేకపోతే నేను లేననుకో! రెండో ఆత్మహత్యా ప్రయత్నంలో ఈ లోకాన్ని విడిచి, మరో లోకంలో నీ కోసం వేచి ఉంటాను. లిటర్ రాసానంటే మనం ఒకటయి పోయినట్టే!....' అని ఉంది. – అందుకే ఆ రోజు మీరు వీధి చివరికి వెళ్ళేవరకూ చూస్తూ ఉండిపోయాను. మీరు మలుపు తిరిగిన తరువాత ఇంటికి తాళం వేసి ఇక్కడికి వచ్చి లావణ్యతో చెప్పాను. బాధ పడుతున్న దానిని ఓదార్చాను. కాని ఇంత పని చేసుకుంటుందని ఊహ మాత్రంగానైనా నేననుకోలేక పోయాను...."

చెపుతున్న శారద కళ్ళలో నీళ్ళు నిండు కున్నాయి. అంతావిన్న నరసింహులు దిగ్గున తల పైకెత్తాడు. గోడకు కొట్టి ఉన్న మేకుకు వ్రేలాడుతున్న ఖాకీ రంగు సంచి, ఉరి పోసుకున్న లావణ్యలా అటూ, ఇటూ ఊగుతుంది. కిటికీలో నుంచి వస్తున్న గాలికి.... గబుక్కున లేచి సంచి అందుకుని మరలా కూలబడి పోయాడు నరసింహులు. అందులో ఉన్న కవరు తీసి చించాడు.

డియర్ లావణ్య,

ఈరోజు లిటర్ కోసం నీవు వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తూ ఉంటావని నాకు తెలుసు. అంతేకాదు ఈ లిటర్ చదివి నువ్వు ఎగిరి గంతేస్తావని కూడా నాకు తెలుసు. ఎగిరిన దానివి కాస్తా మెల్లగా ఎగురు. మరీ పైకి ఎగిరావంటే పై లోకానికి వెళ్ళిపోతావు. నిన్నందుకోవడానికి నే నక్కడ ఉండేవాడినే గాని మా వాళ్ళు మన పెళ్ళికి అంగీకరించారు గనుక నేను ఈ లోకంలోనే ఉన్నాను. కనుక నీవూ ఇక్కడే ఉండాలి.... తరువాత జంటగా సుందర మధుర స్వప్న లోకాలలోకి తేలిపోదాము.

ఇక అసలు విషయం మా వాళ్ళందరితో కలసి మరో వారం రోజుల్లో మీ ఇంటికి వస్తున్నాం. మిగతా విషయాలన్నీ మీ ఇంటి దగ్గరే మాట్లాడుకుందాము.

ఇట్లు
నీ మధు

నరసింహులు ఉత్తరం చదివి నవ్వాడు. పిచ్చి వాడిలా నవ్వాడు. తన కూతురి తలపై విధి వ్రాసిన చక్కని రాతను తనే కావాలని చెరిపేసినందుకు జుట్టు పీక్కుని నవ్వాడు.

ఆ నవ్వులో ఉన్న ప్రేమను, బాధను శారద భరించలేక పోయింది.

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును






జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783




**ఎ. కె. – తిరుపతి**

మా పెద్దబ్బాయి వయస్సు 4 సం.లు. చాలా బలహీనంగా ఉంటే ఈ మధ్య ఎక్స్‌-రే, రక్త-మూత్ర పరీక్షలు చేయించాము. ఇస్నోఫీలియా ఉందన్నారు. ఈ వ్యాధి భయంకరమైనదా? నివారణకు ఏ జాగ్రత్తలు తీసుకోవాలి?

★ ఈస్నోఫీలియా అన్నది అసలు రోగం కాదు. రోగ లక్షణం. శరీరంలో అలర్జీ ఏర్పడినప్పుడు ఇస్నోఫీల్స్ అనే తెల్ల రక్త కణాల సంఖ్య అధికం అవుతుంది. దీనికి కారణం కనుగొని చికిత్స చేయవలసి ఉంటుంది. ఫిజీషియన్నకి చూపించి, ఛాతీ ఎక్స్‌-రే, మల పరీక్ష మొదలయినవి చేయించి ఫలితాల ప్రకారం వైద్యం చేయించుకోవాలి. మామూలుగా, హెట్రజాన్, యూని కార్బన్ వంటి మందులతో ఈ రోగం తగ్గిపోతుంది.

**బి. ఆర్. – బిట్రగుంట**

నాకు గత 7, 8 నెలల నుండి వంటిపై సన్నటి పొక్కులువలె లేచినవి. చాలా దురదగా వున్నవి. అవి మాడినా దురద పోవటం లేదు. మచ్చలు ఏర్పడుచున్నవి. మందులు వాడినా లాభం కనిపించలేదు.

★ మీరు లోనికి యాంటీబయాటిక్ మాత్రలను వైద్యుల సలహా మేరకు వాడవలసి ఉంటుంది. వాటితో బాటుగా విటమిన్-సి-మాత్రలను రోజుకి 500 మి.గ్రా. వంతున వరుసగా నెల రోజులు వాడండి. దురద తగ్గటానికి పిరిటాన్, అవిల్ వంటి మందులు వాడటం మంచిది. మల పరీక్ష చేయించి అందులో పురుగులు ఉన్నదీ లేనిదీ తీర్మానించవలసి ఉంటుంది.

**వై. స్ – తెనాలి**

నాకు పచ్చకామెర్లు వచ్చినవి. తరువాత మూత్రము పరీక్ష చేయించుకున్నాను. ఏమీ లేదన్నారు. అయినా ఇప్పటికీ మూత్రము పసుపుగా పోవుచున్నది. ఇలా ఎందువలన జరుగుతుంది?

★ ఇన్ఫెక్టివ్ హెపటైటిస్ (పచ్చ కామెర్లు) వచ్చి తగ్గిన తర్వాత కొన్ని రోజులపాటు మూత్రం పసుపుగా పోవటం సహజమే! కాని, అందులో బైల్‌సాల్ట్స్, బైల్ పిగ్మెంట్ యూరో బిలినోజెన్ అనేవి లేవని తీర్మానించుకోవలసి ఉంటుంది. కొన్ని సందర్భాలలో వాడబడిన మాత్రలవల్ల ఇలా పసుపుగా పోయే అవకాశం ఉంటుంది. □

జయకృష్ణ



వసుంధర ఎంటర్‌ప్రైజెస్

J L MEMORIAL
GOVT. HOSPITAL

EXPRESS

Ⓐ

# 5 లక్షలు

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
రాజభరత్

నిర్వహణ: ప్రశాంత్

నిర్మాత
జగదీష్

సీరియల్

# దేదీప్య

## కంచుమర్తి వెంకటేశ్వరరావు

ఆరో తరగతిలో చేరాను.

మా ఇంట్లోనే అత్తా, మామయ్య వాళ్ల పిల్లలూ ఉండేవారు. మామయ్య మిరపకాయల వ్యాపారం చేసేవాడు. అతనికి ఇద్దరబ్బాయిలు. పెద్ద కొడుకు పట్నంలో ఉద్యోగం. ఆ సంవత్సరం వ్యాపారంలో విపరీతంగా నష్టం రావడంతో మామయ్య కృంగిపోయాడు. ఆ ఊరులో ఉండడానికి ఇష్టంలేక భార్యాపిల్లలతో పెద్ద కొడుకు దగ్గరకు వెళ్ళిపోయాడు. పట్నంలో ఏదో ఒక వ్యాపారం చేద్దామని నాన్న దగ్గర డబ్బు అప్పుగా తీసుకుని వెళ్ళారు. ఏ వ్యాపారం చేసినా నష్టమే తప్ప లాభం ఎరుగడు మామయ్య. అయితే ఎప్పటికప్పుడు మా నాన్న సహాయం చేస్తుండేవారు.

రోజులు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి.

ఏదన్నా పనుంటే అత్తా, మామయ్య వచ్చేవారు తప్ప పిల్లలు మా యింటికి వచ్చేవారు కాదు. పిల్లలను ఎప్పుడు తీసుకురమ్మన్నా చదువు పాడవుతుందని చెప్పేవారు.

నేను పదో తరగతిలోకి వచ్చాను.

ఆ సంవత్సరం మా నాన్నమ్మ అందరూ వెళుతున్నారని టూరిస్టు బస్సులో కాశీవెళ్ళింది. కాశీనుండి వచ్చింతర్వాత అసలు గొడవ మొదలు పెట్టింది. నా పెళ్ళి వెంటనే చెయ్యాలని. నా పెళ్ళి చూసి చచ్చిపోతానంది.

అప్పుడు నా వయస్సు పధ్నాలుగేళ్ళు.

పల్లెలలో చిన్నప్పుడే పెళ్ళిళ్ళు చెయ్యడం మామూలే అయినా నేను ఒప్పుకోలేదు. అయితే ఒప్పుకోక తప్పింది కాదు.

''నువ్వు పెద్దయితే నీ అందాన్ని చూసి ఏ రాజకుమారుడూ నీ కోసం పరుగెత్తుకుని రాడు'' అంది అమ్మ.

(గత సంచిక తరువాయి)

నిజమే...

అందం లేదు నాకు.

ఎవరు పెళ్ళి చేసుకుంటారు నన్ను...

ఆ రోజు మా నాన్న పట్నం వెళ్ళారు మామయ్య దగ్గరకు. వాళ్ళను మా నాన్న ఎలా ఒప్పించారో తెలియదు గానీ ముహూర్తాలు పెట్టించుకుని వచ్చారు.

బావ అప్పటికే కాలేజీలో చదువుతున్నాడని తెలిసింది. నాతో పెళ్లికి బావ ఒప్పుకున్నాడంటే అందరూ ఆశ్చర్యపోయారు. నాకు మరీను. ఎందుకంటె బావ తెల్లగా అందంగా ఉంటాడు. నేనంటే బావకు అసహ్యం అనుకున్నాను. అలా నేను ఊహించడానికి నా చిన్నప్పుడు జరిగిన ఒక సంఘటన చెబుతాను.

అప్పుడు నా వయస్సు ఆరేళ్లు. బావ నాకంటె రెండేళ్లు పెద్ద.

**జరిగిన కథ—3 :** బలరాం, పార్వతమ్మల రెండవ కూతురు దేదీప్య. స్కూల్లో అక్క పోలికలతో ఉన్న పాపను చూస్తుంది దేదీప్య. ఏడేళ్ళ క్రిందట ఇల్లువదిలిన అక్క అవంతిని గురించి తెలుసుకోవాలనే ఆశతో శిరీషకు ట్యూషన్ చెప్పను అంగీకరిస్తుందామె. శిరీష అవంతి కూతురా! కాదా! అని తెలుసుకోవాలని తహతహలాడుతోంది దేదీప్య. స్నేహితురాలు సరళతో సినిమాకెళ్లిన దేదీప్యకు సినిమా హాల్లో శిరీష, శివప్రసాద్‌లు కలుస్తారు. శిరీష తల్లి పేరు ప్రతిమ అని తెలుసుకున్న దేదీప్య అయోమయంలో పడుతుంది. సరళ తన కథను దేదీప్యకు చెప్పసాగింది.

వరండాలో కూర్చుని బావ పెరుగన్నం తింటున్నాడు. నేను పొరపాటున ఆడుకుంటూ వెళ్ళి బావ కంచం ముట్టుకున్నాను. అంతే బావ అన్నం వదిలేసి చేతులు కడుక్కున్నాడు.

''అదేంట్రా రాఘవా, అన్నం వదిలేసి వెళ్ళిపోతున్నావా'' అమ్మ అడిగింది.

''కాకి ముట్టుకుంది. నేను తినను.'' అన్నాడు బావ.

ఆరోజు బావ అన్న మాటకు ఆ చిన్న వయసులో నాకు అర్థం కాలేదు. అమ్మా, నాన్న అప్పుడప్పుడు ఈ సంఘటన చెప్పుకుని నవ్వుకునే వారు.

తర్వాత తర్వాత ఆ మాటకు అర్థం తెలుసుకున్నాను. నేనంటే బావకు అంత అసహ్యం. అటువంటి బావ నాతో పెళ్లికి ఒప్పుకున్నాడంటే నేను ముందు ఆశ్చర్యపోయాను. తర్వాత నా అదృష్టానికి మురిసిపోయాను.

''పెళ్లి మాత్రమే ఇప్పుడు జరిగేది. అబ్బాయి చదువయింతర్వాత కార్యం జరిపించాల''ని మామయ్య అన్నాడట.

పెళ్ళి రాత్రనగా ఆరోజు ఉదయం వచ్చారు మామయ్య, అత్తయ్య.

పెళ్ళిపీటల మీద బావను చూసాను.

తెల్లగా పొడవుగా ఉన్నాడు. ఎప్పుడో చిన్నప్పుడు చూసాను. బావ బాగా పొడుగయ్యాడు. నేను బావ అందాన్ని చూసి పొంగిపోయాను. అందంగాలేని నాకు అందమైన భర్త. ఆ భావనే నాకెంతో సంతోషాన్నిచ్చింది.

మా జంటని చూసి అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకున్నారు.

కాకి ముక్కుకు దొండపండన్నారు.

సాధారణంగా ప్రతి మగవాడు అందమైన భార్య కావాలనికోరుకుంటాడు. పెళ్లివిషయంలో ఆడవాళ్ళకు కూడా అందమైన భర్త కావాలని కోరుకున్నా ఏ కొందరి విషయంలో నో తప్ప అది జరగదు. మగవాడు సంపాదిస్తే చాలు అందంతో పని లేదు అని పెద్దలు చెప్పి అందమైన భర్త కావాలని కోరుకునే అందమైన అమ్మాయి, అందంగా లేని మగవాడికి భార్య అవుతుంది. తర్వాత బ్రతుకులో సులభంగా రాజీ పడి ఆ మగవాడిలోని మనసును ప్రేమిస్తూ సంసారాన్ని హాయిగా చేసుకుంటుంది. కానీ మగవాడు పెళ్ళి చూపులలో చూసేది అమ్మాయి అందం. అందమైన అమ్మాయి కావాలి. అందమైన అమ్మాయి కనబడేవరకు ఎన్ని పెళ్ళి చూపులకైనా సిద్ధపడతాడు. తిరుగుతాడు.

నా విషయంలో అంతా తారుమారైంది. అందమైన బావ అందంగా లేని నాకు భర్త కాబోతున్నాడు. ఈ విధంగా నా అదృష్టానికి మురిసిపోతూ కలలు కంటున్న నేను వాస్తవానికి వచ్చాను.

పెళ్ళిపీటలమీద కూర్చున్న బావను పరిశీలనగా చూసాను. ఏదో పోగొట్టుకున్న వాడిలా

కూర్చున్న బావను చూసేసరికి నా ఆనందం అంతా నీరుగారిపోయింది.

పెళ్ళి తతంగమంతా జరుగుతుంది. బావ ఏ చర్య కూడా మనస్ఫూర్తిగా సంతోషంగా చేయడంలేదు.

నా మెడలో తాళికడుతున్నప్పుడు ఓరకంట బావను చూశాను. నా చూపులతో బావచూపులు కలుపుతాడని, అందమైన నవ్వు విసురుతాడని నా ఊహ. కానీ బావ ఆ క్షణంలో కూడా నవ్వలేదు.

బావ ఎందుకిలా ప్రవర్తిస్తున్నాడు.

కొన్ని క్షణాల క్రితం మగవాడు— అందం గురించి తను అనుకున్నదంతా నిజమేనా... అందంగాలేని నన్ను బావ చేసుకోవడంతో త్యాగ పురుషుడనుకున్నాను. బావ ప్రవర్తనతో అతను కూడా సాధారణ మగవాడేనా అనిపించింది.

బావప్రవర్తన నాకు కన్నీటిని తెప్పించింది.

పెళ్ళయింది.

వారం రోజులకు బావను తీసుకుని వెళ్ళి పోయారు.

పెళ్ళితో నా చదువు ఆగిపోయింది.

చదువుతానన్నా ఎవరూ ఒప్పుకోలేదు.

రోజులు గడుస్తున్నాయి.

ఉగాది వచ్చింది. బావ వస్తాడని ఎదురు చూసాను. బావను తీసుకుని రావడానికి మా నాన్న వెళ్ళారు.

బావ వస్తాడు...

బావతో మాట్లాడాలి ...

ఎన్నో ఆశలు...

కానీ బావ రాలేదు. పరీక్షలట రానని చెప్పాడట...

నాకు ఏడుపు వచ్చింది.

కనీసం ఒక్క లెటరు కూడా వ్రాసేవాడు కాదు.

స్నేహితులంతా ఏడిపించేవారు.

మీ బావ లెటర్లు వ్రాస్తాడా...

ఏమని వ్రాస్తాడు.

ప్రేమలేఖలు వ్రాస్తాడా...

నువ్వేం జవాబులు వ్రాస్తావు ?

ఏం సమాధానం చెప్పగలను ?

నువ్వు నిజంగా అదృష్టవంతురాలివి. అందమైన బావ మొగుడయ్యాడు—

అనేవారు. ఆ మాటకే గర్వంతో మురిసి పోయేదాన్ని.

పండగలు తొందరగావస్తే బాగున్ను.

బావ వస్తాడనే ఆశ, ఆత్రుత.

నా కన్నులను వెలుగులతో నింపడానికి ... చీకటి గుండెలో వెన్నెల కురిపించడానికి... ఆశల దివ్వెలు వెలిగించడానికి నాకోసమే వచ్చినట్లు దీపావళి వచ్చింది. బావ వచ్చాడు. తలుపు చాటు నుండి బావను చూసాను. నూనూగు మీసాల బావ వైట్ డ్రెస్‌లో మన్మథుడిలా ఉన్నాడు.

పదహారేళ్ళ ప్రాయం నాది.

ఊహల ఊయలలూగే వయసది.

ఏవో భావనలు, ఎన్నో ఆశలు.

అన్నీ నాకు చేరువయ్యాయి.

బావకు భోజనం వడ్డించమని చెప్పింది అమ్మ. నేను భయపడుతూ బావ గదిలోకి వెళ్ళాను. కుర్చీలో కూర్చుని పుస్తకం చదువు తున్నాడు.

బావ నన్ను చిలిపిగా చూస్తాడు.

బావ మాట్లాడుతాడు ...

ఏం మాట్లాడాలి...

వోణీ కొసలు నలుపుతూ నిలబడ్డాను.

ఎంతసేపటికి బావనన్ను చూడలేదు.

చిలిపిగా బావ చేతిలోని పుస్తకంలాక్కోవా లనిపించింది...

అమ్మో... కోపం వస్తే... ఆ పని చేయ లేకపోయాను.

"బావా."

నా నోట్లోంచి ఆ వొక్కముక్కే వచ్చింది.

బావ నన్ను చూసి మళ్ళీ పుస్తకంలో తల దూర్చేడు.

బావ చూపులో ప్రేమ భావం లేదు. ఏ చిలిపితనం ఆ చూపులో కనిపించలేదు.

'భోజనం వడ్డించాను.'

అని మరిక అక్కడ ఉండలేక బయటకు వచ్చేసాను.

బావ నాతో మాట్లాడతాడని ఎన్నెన్నో ఊహించుకున్నాను. రెండు రోజులున్నా బావ మాట్లాడలేదు. మూడోరోజు వెళతానని బయలు దేరాడు. వెళ్ళేముందు నాతో మాట్లాడతాడని



బావకు ఎదురయ్యాను చాలాసార్లు. కానీ బావ నావైపు అసలు చూసేవాడు కాదు.

'వెళ్ళొస్తాను.'

ఏ గోడకో చెబుతున్నట్లుగా నా వైపు చూడకుండానే ఆ ఒక్కమాట అనేసి వెళ్ళిపోయాడు. ఆ రోజు నేను కుమిలి కుమిలి ఏడ్చాను.

బావ ఎందుకిలా ప్రవర్తిస్తున్నాడు.

నేనంటే ఇష్టంలేదా... ఏమో ...

ఇటువంటి ఆలోచనలవైపు మనసుపోనిచ్చి బెంగపడుతూ బాధపడకూడదని నాన్ననుఒప్పించి పదో తరగతి పరీక్షకు ఫీజు కట్టి చదువువైపు దృష్టిని కేంద్రీకరించాను.

ఆ సంవత్సరం నాన్నమ్మ చనిపోయింది. ఇంట్లో చాలా మార్పులు జరిగాయి. అంతవరకు మాతోనే కలిసి ఉంటున్న చిన్నాన్న ఆస్తులు పంచమని గొడవ పెట్టాడు. ఫలితం పొలం ముక్కలైంది. ఇంటిలో అడ్డుగోడలు వచ్చాయి. వచ్చిన పంట భాగాలైంది.

నా వయసు పెరుగుతోంది.

## 13

కార్యం జరిపించడానికి నాన్న మామయ్యను అడగడానికి వెళ్ళారు. నాన్న వెళ్ళివచ్చిన రెండ్రోజులకు మామయ్య లెటరు వ్రాసాడు మంచి రోజు చూసి లెటరు వ్రాయమని. నాన్న ముహూర్తం చూపించి లెటరు వ్రాసారు.

నా ఆనందం వర్ణనాతీతం.

నా కలలు రూపు దిద్దుకుంటున్నాయి.

నా ఆశలు పురివిప్పి ఆడాయి.

ఆరోజు రానే వచ్చింది.

నేను అందంగా ఉండకపోవచ్చు కానీ వయసు తెచ్చిన పరువాలు...ఆ పరువాల పరదాల వెనుక పడగ విప్పిన కోరికలు, ఆ కోరికల వాడి, వేడి నాలో ఆశలను రేకెత్తించాయి.

బావకు చేరువవుతాను.

తన కలలు నిజమవుతాయి.

ఎన్నో ఆకాశ హర్మ్యాలు ...

నన్ను గదిలోకి పంపించారు.

బావ మంచం మీద ఉన్నాడు.

బావ దగ్గరకు వస్తాడు.

చేతిలోని పాలగ్లాసు తీసుకుంటాడు.

దగ్గరకు తీసుకుంటాడు.

బలమైన చేతులతో బంధిస్తాడు.

ఉక్కిరిబిక్కిరి చేస్తాడు.

ఆ కౌగిలిలో కరిగిపోతాను.

నా ఊహలు పిచ్చిగా బావ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

బావ నాదగ్గరకు రాలేదు.

నేనే సిగ్గుపడుతూ బావ దగ్గరకు వెళ్ళాను. నన్నుచూసి బావ మంచంమించి లేచి నా దగ్గరకు వచ్చి నా చేతిలోని పాలగ్లాసును అందుకుని టేబులుమీద పెట్టాడు.

''సరళా...''

అది బావ పిలుపు

మొదటి పిలుపు

ఆ ఒక్క పిలుపు...

నాలో కోటి వీణలు మ్రోగాయి.

ఆ ఒక్క పిలుపు...

తనువును పులకరింప జేసింది.

ఆ ఒక్క పిలుపు...

తలపులు హృదయ తలుపులను తెరుచుకుని వెళ్ళాయి.

ఆ ఒక్క పిలుపు...

కోయిలమ్మ తీయని పాటలా...

నెమలికన్నె ఆటలా...

తెల్లని వెన్నెలలా...

చల్లని మల్లెలలా...

కమ్మని తేనెలా...

చిరుగాలి తరగలా...

సెలయేటి వాగులా...

మురళి రవళిలా...

మువ్వల సందడిలా...

అనురాగ రాగంలా ...

అమర నాదంలా...

హాయిగా, ఆనందంగా ఉంది. తాదాత్మ్యం చెందింది.

తలెత్తి చూసాను.

బావ చూపులు నా చూపులతో క్షణం కలుసుకున్నాయి.

ఆ ఒక్క క్షణం ఆ చూపులు నాలో వేయి కాంతులు నింపాయి.

బావ చూపులు మరల్చాడు.

బావ చేతిలో ఒక కవరు.

''సరళా... ఇది చదివి నన్ను అర్థం చేసుకుంటే క్షమించు. నీ మనసు అంగీకరించకపోతే నువ్వేమన్నా సహిస్తాను.''

బావ మాటలు అర్థం కాలేదు. మొదటి రాత్రి భార్యాభర్తల సంభాషణ ఇలాగే మొదలవుతుందా .. సంశయిస్తూనే కవరు తెరిచాను. చాలా కాగితాలు.

''సరళా''

జీవితం అంటే ఏమిటో తెలియని వయసులో మనకు తెలియకుండానే సమస్యలు ఎదురైనప్పుడు, ఏంచేస్తే ఎలా మలుపు తిరుగుతుందో ఊహించలేం. అసలు తెలియని వయసులో ఎందుకు వస్తాయి ? రావలసిన అవసరం ఏముంది ? సమస్య ఎవరిదో అయితే ఫరవాలేదు. అది మనకే వచ్చింది. మన పెళ్ళి జరిగింది.

పెళ్ళి మీద నిర్దిష్టమైన అభిప్రాయాలు ఆ వయసులో లేకపోయినా ఇలా జరిగితే బాగుంటుంది అన్నది మాత్రమే నాకు తెలుసు. నేను ఆరోజు కాలేజీ నుండి వచ్చేసరికి ఇంట్లో మామయ్య అంటే మీ నాన్న మా నాన్నతో మాట్లాడుతూ కనిపించారు. పెద్దల మధ్య ఎందుకని వంటగదిలోకి వెళ్ళి వదిన ఇచ్చిన కాఫీ త్రాగుతూ కూర్చున్నాను.

వదిన, అమ్మ ముభావంగా ఉన్నారు.

ఇంతలో నాన్న నన్ను పిలిచాడు.

''రాఘవా నీకు పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాం. నీ అభిప్రాయం ఏమిటి. ''

నాన్న అడగగానే నేను ఆశ్చర్యపోయాను. నాకు పెళ్ళా ఈ వయసులో.

''నాన్నా చదువైతేగానీ పెళ్ళి గురించి ఆలోచించదలచుకోలేదు.'' ఖచ్చితంగా చెప్పేసి మరిక అక్కడ ఉండలేక గదిలోకి వచ్చేసాను. బయట నుండి నాన్న, మామయ్యా మాటలు వినబడుతున్నాయి.

''అమ్మ కాశీలో మొక్కుకుందట మనుమరాలు పెళ్ళి జరిపిస్తానని. ఇంటికి వచ్చి ఒకటే పోరు. పెళ్ళి చూసి చచ్చిపోతానని. ఈ ఆఖరి దశలో ఆమె కోరిన చిన్న కోరిక తీర్చవలసిన బాధ్యత అందరికీ ఉంది.''

మామయ్య మాటలకు నాన్న ఏమంటాడో నని నేను చెవులు రిక్కించుకుని విన్నాను.

''అదికాదు బావగారూ అబ్బాయి చదువు మధ్యదశలో ఉంది. ఇప్పుడే పెళ్ళిచేసి చదువుకు ఆటంకం కలిగించడం మన అభిమతం కాదు. ఆలోచించండి.''

నేను సంతోషించాను.

''చూడండిబావగారూ...అబ్బాయిచదువుకు అడ్డురాదు ఈ పెళ్ళి. కేవలం పెళ్ళి మాత్రమే. మిగిలిన కార్యక్రమాలు అబ్బాయి చదువయింతర్వాతే మీ ఇష్టప్రకారం జరుగుతుంది. నేను మీకెంతో సహాయం చేసాను. దానికి ప్రతిఫలంగా అడగటంలేదు. మన మధ్య వున్న బంధుత్వాన్ని ఆసరాగా తీసుకుని అమ్మ కోరికపై అడుగుతున్నాను.''

మామయ్య మాటలు మరి వినడానికి ఇష్టంలేక ఫ్రెండ్సు దగ్గరకు వెడుతున్నానని చెప్పి బయటకు వచ్చేశాను. రాత్రి ఎనిమిదిగంటలైంది ఇంటికి వచ్చేటప్పటికి. భోజనం చేసి పుస్తకాల దగ్గర కూర్చుంటే అన్నయ్య వచ్చాడు నా దగ్గరకు.

''చూడు రాఘవా...వ్యాపారంలో ప్రతిసారి నష్టం వచ్చినప్పుడు నాన్నకు మామయ్య ఎంతో సహాయం చేసేవాడు. మామయ్య ఆదుకోకపోతే







మనం ఈ రోజు ఈ స్థితిలో ఉండేవాళ్ళంకాదు. నువ్వే ఆలోచించు.

అదీగాక... ఇప్పుడు ఈ పెళ్ళి జరగకపోతే మన కుంటుంబాల మధ్యనున్న బంధుత్వం ఉండదని చెబుతున్నాడు మామయ్య. అలా జరిగితే చేసిన మేలు మరచే కృతఘ్నులుగా లోకం మనల్ని ఎత్తిపొడుస్తుంది.''

అన్నయ్య మాటలకు నా కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

కుటుంబాల ఐక్యతకోసం నా యిష్టా యిష్టాలను చంపుకోవాలా? ఈఐక్యతకోసంనేను ఎరగా వీళ్ళకు ఉండాలా...

సరళా... సూటిగా చెబుతున్నానని ఏమీ అనుకోవద్దు. నల్లగా ఉన్న నిన్ను భార్యగా ఊహించలేకపోతున్నాను. ఆ మాటే అన్నయ్యకు చెప్పాను. ఏమీ మాట్లాడలేదు.

మర్నాడే ముహూర్తాలు పెట్టి మరీ వెళ్ళి పోయాడు మీ నాన్న.

ఏం చెయ్యాలో తోచలేదు నాకు. ఎక్కడికైనా వెళ్ళిపోవాలనుకున్నాను. ఎక్కడకు వెళ్ళాలి ?

పెద్ద చదువులు చదవాలని నా ఆశ. ఇప్పుడు చదువు మధ్య ఆపేస్తే భవిష్యత్తులో మరి చదవలేను చదువుకోసమైనా ఇంట్లో ఉండాలి. ఇంట్లో ఉంటే ఈ పెళ్ళి చేసుకోవాలి.

పెళ్ళి ఏర్పాట్లు జరిగిపోయాయి.

బలవంతంగా మీ ఊరు వచ్చాను.

పెళ్ళి ఎలా జరిగిందో నీకు తెలుసు. పెళ్ళిలో నా ప్రవర్తన నీవు గమనించే ఉంటావు. నా అయిష్టత కొంతలో కొంత స్పష్టమయే ఉంటుంది.

పెళ్ళి గురించి ఎన్నెన్నో ఊహించుకున్నాను. అందమైన, చదువుకున్న అమ్మాయి భార్యగా రావాలని కలలు కన్నాను.

జరిగినది మరచి చదువులో పడ్డాను. ప్రతి పండుగకు రమ్మని మీనాన్న వచ్చేవాడు. ఎన్నాళ్ళు తప్పించుకుంటాను. వచ్చిన ప్రతిసారీ నాతో మాట్లాడాలని నువ్వు చేసే ప్రయత్నాలన్నీ ఓ కంట గమనిస్తూనే ఉన్నాను. అయితే నీతో మాట్లాడటానికి నా మనసు పూర్తిగా వ్యతిరేకిస్తుంది.

అప్పుడప్పుడు నీమీద జాలి కలిగేది. నాతో మాట్లాడాలని నువ్వు వచ్చేటప్పుడు నేను మాట్లాడకపోతే నీలో చెలరేగే భావాలు గ్రహించేవాడిని కానీ నా యిష్టాయిష్టాలతో సంబంధం లేకుండా, బంధుత్వాలు తెగిపోతాయని బెదిరించి నాచేత బలవంతంగా ఒప్పించి పెళ్ళి చేసిన మీ నాన్న గుర్తుకొచ్చినప్పుడల్లా ఆ బాధలో నిన్ను మరీ దూరంగా ఉంచడానికి ప్రయత్నించేవాడిని.

ఎన్నాళ్ళిలా ఈ నాటకం.

డిగ్రీ పాసయింతర్వాత కార్యం ఏర్పాటు చేయాలని మీ నాన్న మా ఇంటికి వచ్చి పట్టు పట్టేడు. నేను ఒప్పుకోలేదు. ఉద్యోగం రావాలన్నాను. అయినా మీ నాన్న పట్టువిడువలేదు.

''చూడు రాఘవా... నువ్వు మగాడివి. కానీ సరళ అమ్మాయి. వైవాహిత జీవితం మీద నీ కంటే ఎన్నో ఆశలు పెంచుకుంది. ఏ వయసులో జరగవలసింది ఆ వయసులో జరిగితేనే అందం. సరళ ఎన్నో కలలు కంటుంది. ఆ కలలలో నీ ప్రతిరూపం తలచుకుని మురిసిపోతుంది. వయసులో ఉన్న అమ్మాయిని కలల్లో ఉంచకూడదు.

ప్రతి విషయానికి మనం వాయిదాలు వేస్తుంటే లోకం రకరకాలుగా చెప్పుకుంటుంది. ఆ అవకాశం వాళ్ళకు మనం ఇవ్వకూడదు. ఉద్యోగం గురించి నువ్వు బాధ పడవద్దు. నువ్వు ఉద్యోగం చేసి భార్యను పోషించవలసిన అవసరం అప్పుడే నీకు రాలేదు. అన్నిటికి మేమున్నాం'' అన్నయ్య వివరించాడు. ఇష్టం లేకపోయినా అంగీకరించాను.

కానీ ఇన్నాళ్ళూ జరిగింది ఒక ఎత్తు. ఇప్పుడు జరగబోయేది... మనసు మనసు కలవాలి. నా మనసు నీవైపు మళ్ళించలేకపోతున్నాను. ఈ విషయం నీకు ఎలా చెప్పాలి. ఎలా ? ఒక నిర్ణయానికి వచ్చాను.

నా మనసు నీ వైపు మళ్ళినప్పుడే నిన్ను దగ్గరకు తీసుకుంటానని చెప్పాలనుకున్నాను. సూటిగా చెప్పే ధైర్యంలేక ఈ లెటరు ద్వారా చెబుతున్నాను. ఆరోజు కోసం నేను నిరీక్షిస్తుంటాను. నువ్వు కూడా సహకరిస్తావను కుంటున్నాను.

నిర్మొహమాటంగా ఈ విషయం చెప్పినందుకు క్షమించు.

బావ

రాఘవ.

అది చదివిన తర్వాత కుమిలి కుమిలి ఏడ్చాను.

బావకు నేనంటే అసహ్యం.

నాతో పెళ్ళి బావకు ఇష్టంలేదు.

ఈ భావనలు భయంకరంగా తోచాయి.

మూడురోజులూ గడిచాయి. ప్రపంచానికి మేమిద్దరం భార్యాభర్తలం. నాలుగ్గోడల మధ్య మా ఇద్దరి మధ్య ఉన్న నిశ్శబ్దంగాని, దూరం గాని, ఎవరికీ తెలియదు.

ఎన్నో కోరికలు

ఎన్నెన్నో ఆశలు

కలలు కల్లలుకాగా ఆకాశహర్మ్యాలు నేల కూలాయి.

బావకు అందమైన, చదువుకున్న భార్య కావాలి. ఆ రెండూ నా దగ్గర లేవు. బావ మనసు నావైపు ఎప్పుడు మళ్ళిస్తాడు. ఆరోజు ఎప్పుడు, ఆ ఆశతోనే జీవించాలనుకున్నాను.

పదవతరగతి పాసయింతర్వాత ప్రైవేటుగా పి.యు.సి.కి కట్టేను. ఈ రెండు సంవత్సరాల్లో అప్పుడప్పుడు బావ వచ్చి వెళ్ళేవాడు.

**(ఇంకా ఉంది)**




### సి. హెచ్. ఎన్. – నిడదవోలు

పెళ్ళికి వచ్చిన చుట్టాలు గ్రూపులై పాతవీ కొత్తవీ గొడవలు చెప్పుకుంటారెందుకు? పెళ్ళి సంగతి వారివి!

★ అదే తమాషా. మళ్ళీ అవకాశం రాదేమోనన్నట్లు చెప్పుకుంటారు. కొత్త పేచీలు పెట్టుకుంటారు. మానవ బలహీనత అవి. వచ్చిన అవకాశం జారవిడుచుకో బుద్ధి కాదు

### ఎం. ఎస్. ఆర్. – ధర్మవరం

రామలక్ష్మిగారూ, కట్నా లిచ్చే పిల్ల తండ్రు లున్నారు. కట్నాలు పుచ్చుకొనే పిల్లాడి తండ్రులున్నారు. మధ్యన మీ రెందుకండీ?

★ మరి మీ కెందుకు కార్డు వ్రాసే శ్రమ?!.... అన్యాయానికి, అక్రమానికి, అవమానానికి చలించని మనిషి మనిషికాడు. దారిన శవం పోతూంటే దారే పోయే మీరు అయ్యో పాపం అనుకోరా ఎప్పుడూ?!

### పి. బి. ఆర్. – పెంచుకలపాడు

మన దేశ సంప్రదాయాన్నీ మన గౌరవాన్నీ మంట కలిపిన రామారావు ఆడిక్ గారిపై మీ అభిప్రాయం?

★ పావం! బయట పడ్డాడు కనుక దొరికి పోయి తిట్లు తిన్నాడు! అంతకుమించి అసభ్యంగా అసహ్యంగా నీతిబాహ్యంగా చరించే ఎం.పి. లు, ఎం. ఎల్. ఏ. లు, మినిస్టర్లు – ఎందరున్నారో తెలిస్తే మీరు హడలిపోతారు!.... అంచేత ఒక్కడిని వేలెత్తి చూపడం దండగ. అధికార మదంతో తామేం చేసినా చెల్లుతుందనుకునే వీరికి బుద్ధి చెప్పే వారు ప్రజలే – కాని మూర్ఖులు. మేధావులు పట్టించుకోరు – రోత పుట్టి. మంద – వెంట పడి ఏదో ఆశతో ఓట్లు వేస్తుంది. అదే వారి ధైర్యం.

### ఎం. జి. ఆర్. – ఆళ్ళగడ్డ

నవలని ఫైర్ చేయడం అంటే ఎలాగ? నేను కథలు రాశాను.

★ ఎవరి నవలేనానా? మీ నవలేనా? ఫైర్ చేయడం?! ఉన్నది చూసి తప్పులూ కొట్టివేతలూ రాకుండా తిరిగి రాయడమే – ఫైర్ చేయడం. దీనికి బుర్రక్కర లేదు. జబ్బ శక్తి, ఓర్పు కావాలి. అంతే.

### జి. వి. ఎల్. ఎస్. ఎస్. – బరంపురం

ఎలు గుమ్మరించి కూతురి పెళ్ళి చేశాను. వచ్చిన కట్నాలు అన్నీ నా ముఖం చూసి వచ్చినవే – వధువు కట్నాలు మావే. కాని అత్తవారు వారి వంటున్నారు.

★ వినడానికే అసహ్యంగా వుందీ సొద. అయినా పెళ్ళికి వేలు కర్చెందుకు చేయాలి? ఎందుకిలా కొట్లాడుకోవాలి.... ఒకొక్కప్పుడు నా కూతురు అన్నదే సరి అనిపిస్తుంది! పెళ్ళి లీగలే అవాలి – దాని కిద్దరు పెద్ద మనుషులు చాలరా?' అని.... అస లింక పిల్ల తండ్రులు మారరా???

### కె. ఆర్. జి. – విజయ నగరం

ప్రేమించి పెళ్ళి చేసుకోవడం మంచిదా, పెళ్ళి చేసుకుని ప్రేమించడం మంచిదా? మీరు దేనితో ఏకీభవిస్తారు?

★ రెండూ మంచివే – ఒకొరిపై ఒకరికి గౌరవం, అభిమానం పోకుండా చూసుకుంటున్నంత కాలం.

ఎ. ఎస్. ఆర్. పై మీ అభిప్రాయం ఏమిటి?

★ ఏవుందీ! అరవై వచ్చినా యిరవైలా వుంటాననో ఏమో – ఏ ఆడదన్నా ముసలిదానిలా కనపడుతుందాయిన కళ్లకి!!

### బి. ఏ. ఆర్. – కొత్తపట్నం

విత్తు ముందా? చెట్టు ముందా?

★ ఏదీ ముందు కాదు – వెనుక కాదు – ఒక దానినుండి ఒకటి – సృష్టికి తుది మొదలు ఏమిటి?

### పి. యు. – కాశీబుగ్గ

అక్కయ్యా, మీరు పాఠకుల కిచ్చే జవాబులు చదువుతూంటే నాకు రిలాక్సు కలుగుతుంది. నమ్మకలరా?

★ ఎలా? కొందరికి బి. పి. ఎక్కి పోతోందంటూంటే?

మీ పిల్లల సమస్యలు మీరే తీరుస్తారా? అలా అయితే వాళ్ళు అదృష్టవంతులంటాను. మీరు?

★ ఇంటి చెట్టు మందు కాదన్న సంగతి వినలేదా! "మా గొడవ మమ్మల్ని పడనీ మమ్మీ. నీ కెందుకీ తలనొప్పి?" అంటారు వాళ్ళు! □






## పూర్ణచంద్రరావు నాలుగు చిత్రాలు!

హిందీలో విజయవంతంగా నడుస్తున్న 'ఆజ్‌కీ ఆవాజ్' చిత్రాన్ని దక్షిణాది భాషల్లో పునర్నిర్మించడానికి లక్ష్మీ ప్రొడక్షన్స్ అధినేత శ్రీ ఏ పూర్ణ చంద్రరావు హక్కులు తీసుకొన్నారు తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ, భాషల్లోదాదాపు ఏప్రిల్ నాటికి పూర్తి అవుతాయని, నాలుగు చిత్రాలకు నలుగురు దర్శకత్వం వహిస్తారని పూర్ణచంద్రరావు చెప్పారు తెలుగు చిత్రంలో శోభన్‌బాబు నాయకుడు తమిళ చిత్రంలో రజనీకాంత్, అంబిక, కన్నడంలో శంకర్‌నాగ్, లక్ష్మి, మళయాళంలో మంబట్టియాన్, సుహాసిని ప్రధాన పాత్రధారులు తెలుగు చిత్రానికి ఇటీవల విడుదలై విజయ వంతంగా నడుస్తున్న 'రారాజు' చిత్రానికి దర్శకత్వం వహించిన జి రామమోహనరావు, తమిళ చిత్రానికి యస్ ఎ చంద్రశేఖర్ దర్శకత్వం వహిస్తారు

ఈ నాలుగు చిత్రాలకి మూలమైన హిందీ చిత్రం 'ఆజ్‌కి ఆవాజ్'ని ప్రముఖ దర్శక నిర్మాత బి ఆర్ చోప్రా నిర్మించారు ఆయన కుమారుడు రవి చోప్రా దర్శకత్వం వహించారు

## నెరవేరుతున్న కోరిక!

"ఈ చిత్రాన్ని ఏక కాలంలో ఇన్ని భాషల్లో తీయాలని ఎందుకు అనుకున్నారు?" అని మేము అడిగిన ఒక ప్రశ్నకు శ్రీ పూర్ణ చంద్రరావు సమాధానం చెబుతూ" ఏక కాలంలో అంటే కొంచెం ఇంచుమించుగా అన్ని భాషల షూటింగ్‌లూ కాల్షీట్స్‌ని బట్టి ప్రారంభమవుతాయి. అన్నీ ఏప్రిల్ నాటికి సిద్ధమవుతాయి. ఈ చిత్ర కథలో కోర్టు రూమ్ డ్రామాలో కొత్తదనం వుంది. అది నన్ను ఎంతో ఆకర్షించింది నాకు చాలా కాలంగా ఒక కోరిక వుంది. అది తెలుగుతో పాటు తమిళ, కన్నడ, మళయాళ, బెంగాలీ భాషల్లో కూడా చిత్రాలు నిర్మించాలని, ఆ కోరికకు తగినట్లు యిపుడు చక్కని సబ్జెక్ట్ దొరికింది అందుకే ప్రారంభిస్తున్నాను. బెంగాలీ భాషలో కూడా ఒకచిత్రం నిర్మిస్తే నా కోరిక నెరవేరుతుంది." అన్నారు.

## రెండు హిందీ చిత్రాలు!

ఆయన అమితాబ్, కమలహాసన్, శ్రీదేవి, జయప్రదలతో – శ్రీ తాతినేని రామారావు దర్శకత్వంలో ఒక హిందీ చిత్రం ఆరంభించారు అది సగానికి పైగా పూర్తయింది ఈ లోగా అమితాబ్ బచన్‌కి మైసథేనియా గ్రేవిస్ అనే జబ్బు రావడం వల్ల – ఆ చిత్ర నిర్మాణం కుంటుపడింది ఇపుడు రజనీకాంత్, రతి, అగ్నిహోత్రి, మున్ మున్ సేన్‌లతో శ్రీ తాతినేని రామారావు దర్శకత్వంలో 'జాన్ జానీ జనార్ధన్' అనే చిత్ర నిర్మాణం ప్రారంభించడం పూర్తి కావడంకూడా జరిగాయి. దీపావళికి యీ చిత్రాన్ని విడుదల చేయాలనే సన్నాహంలో వున్నారు పూర్ణచంద్రరావ్

## కృష్ణ దర్శకత్వం : ముగ్గురు నాయికలు

పద్మాలయా స్టూడియోస్ పతాకంపై నిర్మిస్తున్న రెండవది తెలుగు చిత్రం ఈ చిత్రంలో
కృష్ణ నాయకుడుగా
నటిస్తూ, దర్శకత్వం నెరపడం ఒక విశేషమైతే, ఇందులో ఆయన పక్కన ముగ్గురు ప్రముఖ హీరోయిన్లు నాయికలుగా నటించడం మరొక విశేషం! ఆ ముగ్గురూ జయప్రద, జయసుధ, రాధ వీరితో పాటు యీ చిత్రంలో, పరిశ్రమలోని అగ్రశ్రేణి సపోర్టింగ్ నటీ నటులందరూ పాల్గొంటారు

త్రిపురనేని మహారథి రచన చేస్తున్న యీ చిత్రం షూటింగ్ కార్య క్రమాలు ఏప్రిల్‌లో ప్రారంభం అవుతాయి ఏప్రిల్‌లో ప్రారంభమై జూలై నాటికి నిర్మాణం పూర్తి అవుతుంది అయితే ఇది ఏ తరహా చిత్రం? అనే ప్రశ్న చాలా మందికి కలుగవచ్చును ఇదొక భారీ జానపద చిత్రం చక్కని కథతో లార్జిస్కేల్ సెట్స్ కాస్ట్యూమ్స్‌తో నిర్మించబడే యీ చిత్రానికి ఏ యస్ ఆర్ స్వామి ఛాయాగ్రాహకుడు గడచిన సంవత్సరాలలో అనేక చిత్రాలకు హిట్ మ్యూజిక్ అందించిన ఒక ప్రముఖ సంగీత దర్శకుడు యీ చిత్రానికి సంగీత దర్శకత్వం వహిస్తారు

కృష్ణగారిలో ఒక దశాబ్దం క్రిందట దర్శకుడు కావాలనే మొలకెత్తిన కోరిక ఇప్పుడు యీడేరుతున్నది ఆయన యీ చిత్రం స్క్రిప్టు మీద ఎంతో కాన్‌సన్ ట్రేట్ చేసి అన్ని విషయాలను పకడ్బందీగా చూసుకొంటున్నారు ఆయన దర్శకత్వంలో వచ్చే యీ చిత్రం ఒక పెద్ద సంచలనాన్ని సృష్టిస్తుందని ఆశించవచ్చు

## అక్కినేనితో చిత్రం

రామానాయుడు దాసరి దర్శకత్వంలో డాక్టర్. అక్కినేని నాయకుడుగా మరో చిత్రం కొత్త సంవత్సరంలో నిర్మించ తలపెట్టారు హైదరాబాదులో తమ స్టూడియో నిర్మాణ కార్య క్రమాలు చురుకుగా కొనసాగుతున్నట్లు కూడా రామానాయుడు చెప్పారు ఈ సంవత్సరం ఆయన రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించిన 'తోఫా', బాపయ్య దర్శకత్వంలో రూపొందించిన 'మక్సద్ హిందీ చిత్రాలు సూపర్ హిట్ అయ్యాయి

"ఇల్లాలే దేవత" ఎ. ఎన్. ఆర్; భానుప్రియ



## పద్మాలయా రెండు చిత్రాలు

పద్మాలయా స్టూడియోస్ పతాకంపై హీరో కృష్ణ-ఆయన సోదరులు హనుమంతరావు, ఆదిశేషగిరిరావు రెండు చిత్రాల నిర్మాణం తలపెట్టారు. అందులో-ఒకటి హిందీ, మరొకటి తెలుగు.

గత ముప్ఫయి అయిదు సంవత్సరాలుగా ప్రదర్శింపబడుతున్న 'పాతాళ భైరవి' చిత్రాన్ని హిందీలో పునర్నిర్మించడానికి పద్మాలయా తరఫున శ్రీ జి. హనుమంతరావు హక్కులు కొన్నారు. అక్టోబర్ 30 నుంచి షూటింగ్ ప్రారంభం అయ్యే యీ చిత్రంలో తోట రాముడు (యన్. టి. ఆర్) వేషాన్ని జితేంద్ర, ఆయన సరసన నాయికగా తెలుగులో మాలతి వేసిన వేషాన్ని జయప్రద, మాంత్రికుడుగా యస్. వి. రంగారావు పోషించిన పాత్రను కాదర్‌ఖాన్ వేస్తారు. 'కాదర్‌ఖాన్‌కి మేకప్ టెస్ట్ తీశాం. చాలా చక్కగా వున్నాడాయన ఆ గెటప్‌లో మాకు సంతృప్తి కలిగించింది." అన్నారు. హనుమంతరావు. ప్రాణ్, బిందు, అరుణా ఇరాని, శక్తికపూర్, అస్రాని, సిల్క్ స్మిత తక్కిన ముఖ్య భూమికలలో వున్నారు. జి. ఆదిశేషగిరిరావు నిర్వహణలో జి. హనుమంతరావు నిర్మించే యీ చిత్రానికి బప్పీలహరి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణం నెరపుతారు. దర్శకత్వం : కె. బాపయ్య.

"పాతాళ భైరవి" చిత్రాన్ని అలా యధాతధంగా తీస్తున్నారా? లేక మార్పులు ఏమైనా చేస్తున్నారా?" అన్న ప్రశ్నకు శ్రీ జి. హనుమంతరావు సమాధానం చెబుతూ "యధాతధంగా కాదు, కొన్నిమార్పులు చేశాం" అన్నారు.

పద్మాలయా కార్యాలయంలో యీ చిత్రానికి సంబంధించిన నిర్మాణ కార్య క్రమాలు ఆరంభమయ్యాయి. కళా దర్శకుడు భాస్కరరాజు యీ చిత్రానికి సంబంధించిన కాస్ట్యూమ్స్ స్కెచెస్ వేయడం, రోజూ ఇరవై మంది కాస్ట్యూమర్స్ ఆ దుస్తుల తయారీలో నిమగ్నులు కావడం జరుగుతూ వారి కార్యాలయం అంతా ఎంతో సందడిగా వుంది.

## రామానాయుడు మూడు చిత్రాలు

సురేష్ ప్రొడక్షన్స్ అధినేత డి. రామానాయుడు యిపుడు మూడు చిత్రాలనునిర్మిస్తున్నారు. ఆ మూడూ నిర్మాణంలో వున్నాయి. అందులో ఒకటి పరుచూరి బ్రదర్స్ రచన, దర్శకత్వంలో నిర్మిస్తున్న 'శ్రీ కట్న లీలలు' రెండవది : నందమూరి బాలకృష్ణ నాయకుడుగా నటిస్తున్న 'కథా నాయకుడు. మూడవది శోభన్‌బాబు నాయకుడుగా యిటీవల ప్రారంభించిన చిత్రం.

శ్రీ కట్న లీలలు గురించి మాట్లాడుతూ శ్రీ రామానాయుడు 'ఈ సబ్జక్ట్ నా కెంతో నచ్చింది. చిత్రం ఆద్యంతం ఎంతో ఇంట్రెస్టింగ్‌గా వుంటుంది. ఇందులో నటించింది చిన్నతారలైనా చక్కని



"దొంగలు బాబోయ్ దొంగలు"లో ఓ సన్నివేశం

విషయం వుంది." అన్నారు. బాలకృష్ణ కథా నాయకుడులోచాలా బాగా చేశాడనీ. మంచి కమ్మర్షియల్ ఎలిమెంట్స్ వున్న చిత్రమని-దీన్ని త్వరలో విడుదల చేయబోతున్నామని రామానాయుడు చెప్పారు. కె. మురళీ మోహనరావు (సంఘర్షణ) దర్శకత్వంలో రూపొందిన యీ చిత్రం 'మంగమ్మగారి మనవడు' తర్వాత బాలకృష్ణ అభిమానులకు పెద్ద ఆశాజనకమని చెప్పవచ్చు.

—మోహన్ కుమార్. □

బాలకృష్ణ, శారద, చంద్రమోహన్, "కథానాయకుడు"






బాబు, రంగనాథ్, జీవా, సిలోన్ మనోహర్, పెమ్మసాని రామకృష్ణ, వేలు, వీరభద్రరావు, వనితశ్రీ, సిల్క్ స్మిత, అనూరాధ, జయమాలిని, జ్యోతి లక్ష్మి, సునీత వగైరా నట వర్గం. కుమార్ ఎ. జె. రాసిన కథకు యడవల్లి సంభాషణల కర్త. సత్యం సంగీతం, కొండవనేని రామలింగేశ్వరరావు శిల్పం, సి. గోపాల్ ఛాయ, జాపల్లి కృష్ణకుమార్ సారథ్యంలో జి. బాల సుబ్బా నాయుడు సమర్పించే ఈ చిత్రానికి కడియం సత్యనారాయణ నిర్మాత.

## "అనగా అనగా ఒక హీరో"

"భానుచందర్, సరిత జంటతో తయారయ్యే మొదటి చిత్రం" అన్నారు లోగడ 'ధాఖు' చిత్ర నిర్మాతలలో ఒకరైన సత్యారెడ్డి. ఇప్పుడు ఈయన





చిరంజీవి, అనూరాధ "నాగు"

## అక్టోబర్ 2వ వారంలో ఎ. వి. ఎం. "నాగు"

"సెప్టెంబర్ 17 నుంచి 20 వరకు రీరికార్డింగ్-పూర్తి చేశాం," అన్నారు కె. షణ్ముగం. ఈయన తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో నిర్మించిన ఎ. వి. ఎం. వారి "నాగు" చిత్రంలో చిరంజీవి, రాధ, జగ్గయ్య, సత్యనారాయణ, గౌరి, అన్నపూర్ణ ముఖ్య భూమికలు నిర్వహించారు. పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతం, దేవరాజ్ ఛాయతో ఎం. కుమరన్ సమర్పిస్తారీ చిత్రాన్ని.

## డైరెక్టర్ ప్రసాదరావు చిత్రాలు

ప్రస్తుతం "సుమన్" చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న ప్రసాదరావు నవంబర్ నుంచి సుమన్, భానుప్రియతో ఎం. ఎస్. ప్రసాద్ నిర్మించే సుచిత్రా వారి చిత్రానికి, సుమన్ హీరోగా ఎం. రామకృష్ణారెడ్డి నవంబర్ నుంచి నిర్మించే రామ కృష్ణా ఫిలిమ్సు చిత్రానికి, భానుచందర్‌తో ఫిబ్రవరి నుంచి అట్లూరి సీతా రామారావు నిర్మించే కృష్ణకాంత్ ఆర్ట్సు చిత్రానికి, కృష్ణంరాజుతో సారథి నిర్మించే నాగార్జున పిక్చర్స్ చిత్రానికి దర్శకత్వం వహించనున్నారు.

## "సూర్య నేత్రం"

"ఆగస్ట్ 30 నుంచి సెప్టెంబర్ 6 వరకు రెండవ షెడ్యూల్‌ను పూర్తి చేశాం. తదుపరి షెడ్యూల్ తలకోనలో. దాంతో షూటింగ్ పూర్తయినట్లే" అన్నారు లోగడ పలు చిత్రాలకు ఎడిటర్‌గా పని చేసిన పి. సి. మోహన్. ఈయన తొలి సారిగా దర్శకత్వం వహించే సత్య సాయి ఆర్ట్ క్రియేషన్స్ వారి పై చిత్రంలో శరత్-

# విశేషాలు

కథ, సమర్పణలో సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో మొత్తం షూటింగ్ పూర్తయ్యే జయలక్ష్మి అసోసియేట్స్ వారి "అనగనగా ఒక హీరో" చిత్రానికి "సంతానం" చిత్రం ద్వారా డైరెక్టర్‌గా పరిచయమైన శ్రీ త్రిపురనేని వరప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. కొంపెల్ల విశ్వం మాటలు, జి. వి. రాఘవులు సంగీతం, దివాకర్ ఛాయ, తోటయాదు శిల్పం, రాజారాం నిర్వహణతో సి. సుకుమార్‌రెడ్డి నిర్మాత.

## "ఆడపడుచులు – అర్ధ మొగుళ్ళు"

"పాత కొత్త నటీనటుల సమ్మేళనం." అన్నారు లోగడ ఎన్. ఎ. టి., డి. వి. ఎస్. సంస్థలలోనూ,





డైరెక్టర్లు కె. విశ్వనాథ్, పి. సాంబశివరావు ల వద్ద పలు చిత్రాలలో కూడా సహకార దర్శకుడుగా అనుభవం గడించిన వి. వి. రాజు. ఈయన తొలిసారిగా దర్శకత్వం నెరపే ఎస్. ఎమ్. ఎస్. ఆర్. పిక్చర్స్ వారిపై చిత్రానికి అక్టోబర్‌లో పాటలు రికార్డ్ చేయబడతాయని నిర్మాత మాదాలశివానందకుమార్ తెలియజేశారు. దాసం గోపాలకృష్ణ రచన, జి. వి. రాఘవులు సంగీతం, పి. లక్ష్మణ్ ఛాయ, కె. రవీంద్రబాబు కూర్పుతో ఎస్. వినోద్ నిర్వహణ బాధ్యతలు వహిస్తారు.

## ఎం. ఎస్. మూవీస్ "వస్తాద్"

'గుండె బలంతో కండ బలాన్ని జయించిన 'వస్తాద్' బిరుదు పొందిన ఓ యువ కవి జీవితంలో కొన్ని సంఘటనలవల్ల అనూహ్యమైన మార్పు వస్తుంది.... కరాటే, కుంగ్‌ఫ్యూ, జూడో, బాక్సింగ్‌లకు ఎంతో ప్రాముఖ్యం ఉన్న చిత్రం' అన్నారు ఎస్. రామచంద్రరావు. ఈయన దర్శకత్వం వహించే ఎం. ఎస్. మూవీస్ వారి 'వస్తాద్' చిత్రంలో భానుచందర్, గిరిబాబు, శరత్ బాబు, నూతన్ ప్రసాద్, జీ వా, సాక్షి రంగారావు, తులసి, పూర్ణిమ, స్మిత పాల్గొంటున్నారు. సాయినాథ్ మాటలు రాశారు. సత్యం స్వర కల్పనలో మల్లెమాల గీతాలు విశేషాకర్షణ. ప్రసాద్ బాబు ఛాయ, సూర్య కుమార్ శిల్పం, గౌతమ్‌రాజు కూర్పు, నాయుడు ప్రొడక్షన్స్‌తో ఈ చిత్రాన్ని నిర్మించే పి. జనార్ధనరెడ్డి, ఎం. శ్యామ్ ప్రసాద్ రెడ్డి సెప్టెంబర్ 18 నుంచి అక్టోబర్ 8, అక్టోబర్ 15 నుంచి 19; నవంబర్ 11 నుంచి 19 వరకు మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుందని తెలిపారు. కథ, స్క్రీన్‌ప్లేను కూడా దర్శకుడే సమకూర్చారు.



"సంపూర్ణ ప్రేమాయణం"లో జయప్రద, శోభన్‌బాబు



"పాపి కొండలు"లో మోహన్‌బాబు

## సుమన్ హీరోగా ప్రసాదరావు దర్శకత్వంలో "సుమన్"

"యాక్షన్‌తో పాటు సెంటిమెంట్ మేళవించిన వెరైటీ అయిన ఇతి వృత్తం" అన్నారు ఎ. సారథి. ఈయన సారధ్యంలో బి. తిరుపతి లక్ష్మి సమర్పించే జి. వి. ఆర్. ప్రొడక్షన్స్ "సుమన్" చిత్రం షూటింగ్ సెప్టెంబర్ 15 న మొదలైంది. సుమన్, సుమలత, గొల్లపూడి, జీవా, ౦, వీరభద్రరావు, శివరంజని, స్మిత, జయమాలిని నటిస్తున్నారు. సత్యమూర్తి రచయిత. సత్యం స్వర కల్పనలో సి. నారాయణరెడ్డి, గోపి, సత్యమూర్తి, గీతాలు రాశారు. కబీర్ లాల్ ఛాయ, కృష్ణ శిల్పం, మురళి కూర్పు, బండారు భాస్కర్ ౦జా నిర్వహణ, ఆర్. బాలకృష్ణ ప్రొడక్షన్, చిల్లర భారతి కల్యాణ్ - మూగి సుబ్రహణ్యం సహకార దర్శకత్వంతో బి. నారాయణరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్, గాలి వెంకట్రావు, అట్లూరి సీతా రామారావు నిర్మాతలు.

భానుప్రియ "పల్నాటి పులి"



## "కుటుంబ గౌరవం"

"షూటింగ్ పూర్తయింది. అక్టోబర్ నెలాఖరున విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం" అన్నారు కిశోర్. ఈయన నిర్మాణ సారథ్యంలో మురళీ మోహన్ సమర్పిస్తూ, ప్రధాన పాత్రను అత్యద్భుతంగా పోషించిన జయభేరి ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో విజయశాంతి నాయిక. రంగనాథ్, సత్యనారాయణ అన్న దమ్ములుగా, వారి భార్యలుగా దీప, అన్నపూర్ణ, కామెడీ విలన్స్‌గా గిరిబాబు, గొల్లపూడి మారుతీరావు, ఇంకా రావి కొండలరావు, అత్తిలి లక్ష్మి, టి. జి. కమలాదేవి ఇతర పాత్రధారులని నిర్మాత మాగంటి వెంకటేశ్వరరావు తెలియ జేశారు. గణేశ్ పాత్రో, కాశీ. విశ్వనాథ్ మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి, ఛాయ రంగారావు, శిల్పం, అమరేశ్వరరావు సహకార దర్శకత్వం, తార నృత్యాలు, సాహుల్ సాహసాలు, సుబ్బారావు ప్రొడక్షన్స్. డి. రాజగోపాల్ కూర్పుతో రాజా చంద్ర దర్శకుడు.

"మహా సంగ్రామం"లో ఓ హాస్య సన్నివేశం



"ముద్దుల చెల్లెలు"లో రంగనాథ్, తులసి, మురళీమోహన్



## పద్మావతి సూర్య నారాయణ బాబు చిత్రాలు

మోహన్ బాబు హీరోగా కంచర్ల పూర్ణచంద్రరావు దర్శకత్వంలో "సంచలనం" చిత్రం షూటింగ్ పూర్తి చేసిన పద్మావతి కంబైన్స్ అధినేతయు. సూర్యనారాయణ బాబు జనవరి 1నుండి హీరో కృష్ణతో ఓ భారీ చిత్రాన్ని నిర్మిస్తారు. ఇందులో రాధ, సత్యనారాయణ, రావు గోపాలరావు, గిరిబాబు, వేలు, వీరభద్రరావు ఆదిగా గల వారు పాల్గొంటారు. ఎ. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణంతో ఎ. కోదండ రామిరెడ్డి దర్శకుడు. మార్చికి షూటింగ్ ముగుస్తుంది. ఈలోగా "మేరీ అదాలత్" అనంతరం కృష్ణ ఆర్ట్ పిక్చర్స్ బానర్‌లో అక్టోబర్ 11 నుండి నిర్మించే హిందీ చిత్రంలో రజనీకాంత్, మీనాక్షి శేషాద్రి నాయకానాయికలు. దీనికి ఎస్. ఎస్. రవి చంద్ర దర్శకుడు. నవంబర్ నుంచి "నా ఇల్లు – నా వాళ్ళు" చిత్రాన్ని కన్నడంలో రాజాచంద్ర దర్శకత్వంలో నిర్మిస్తారు. 1985 మేలో ప్రారంభమయ్యే తమిళ చిత్రంలో రజనీకాంత్ హీరో.



"రామరాజ్యం వచ్చింది"లో చంద్రమోహన్, ప్రభ

## వంశీ దర్శకత్వంలో రామ్‌కుమార్ ప్రొడక్షన్స్ చిత్రం

"దట్టమైన అరణ్య ప్రాంతాలలో అక్టోబర్ 20 నుంచి నవంబర్ 20 వరకు ఒకే షెడ్యూల్లో చిత్రీకరణ ముగుస్తుంది" అన్నారు వంశీ. ఈయన స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో కామినేని ప్రసాద్ ని ంచే చిత్రానికి ఆగస్ట్ 30 న పాటల రికార్డింగ్‌తో ారంభోత్సవం జరిగింది. మురళి, భానుప్రియ, సత్యా నారాయణ, శరత్ బాబు, రాళ్ళపల్లి, శుభలేఖ సుధాకర్, అన్నపూర్ణ వగైరా నట వర్గం. యండమూరి వీరేంద్రనాథ్ కథకు సాయినాథ్ సంభాషణల కర్త. ఇళయరాజా సంగీతం, ఎం. వి. రఘు ఛాయ, తరణి శిల్పం, అనిల్ మల్నాడ్ కూర్పు, జగన్ మోహన్‌రావు ప్రొడక్షన్, కె. ఎస్. కె. చంద్ నిర్వహణలో తయారయ్యే ఈ చిత్రాన్ని కె. చిన్ని సమర్పిస్తారు.



యమదూతలు"లో సిల్క్ స్మిత



స్వప్న, "కాంచన గంగ"

## సినిమా

### "కాంచనగంగ"లో ఆశ్రయం

లక్ష్మీపుత్రుడైన ప్రభాకర్ (చంద్రమోహన్) ఇంట్లో వాళ్లకు చెప్పకుండా గంగ (స్వప్న)ను పెళ్లాడాడు దాంతో అతనికి లక్ష్మి దూరమైంది ఇల్లు వది-లెయ్యాల్సి వచ్చింది ఉద్యోగం చెయ్యాల్సిన పరి-స్థితి ఏర్పడింది ఉద్యోగాన్ని ఇస్తానన్న చిన్ననాటి స్నేహితుడు మోహన్ (ప్రతాప్ పోతన్) ఉండటానికి ఓ ఇల్లూ ఇస్తానన్నాడు ఆదునిక సౌకర్యాలన్నీ అమర్చిన అందాల భవంతి అది దాన్ని చూసి గంగ ఆశ్చర్యపోయింది భర్తను పక్కకు తీసుకెళ్ళి, "ఈ ఇంట్లో మనం ఉండేది టెంపరరీయా లేక ? అంది

ఏమిటి ఏమిటి?" అడిగాడు మోహన్ ప్రభాకర్ తన భార్య సందేహాన్ని తెలియజేశాడు

"ఈ ఇంట్లో మీరు ఎన్నాళ్ళు ఉంటారన్నది మీ మీదనే ఆధారపడి ఉంటుంది మీ అంతట మీరు వెళ్ళితే తప్ప – ఇక్కడ మిమ్మల్ని వెళ్లమనేవారు ఎవ్వరూ లేరు," అంటూ అభయమిచ్చాడు మోహన్

"నీ అంతట నువ్వు పొమ్మంటే తప్ప – నిన్నూ, నీ కంపెనీనీ విడిచిపోనురా . ఐ ప్రామిస్," అంటూ ప్రభాకర్, మోహన్ చేతిలో చెయ్యి వేశాడు

శ్రీ వారికి ప్రేమలేఖ, సుందరీ – సుబ్బారావు లాంటి జనరంజకమైన హాస్య కథా చిత్రాలను అందించిన ఉషాకిరణ్ మూవీస్ వారు రూపొం-దిస్తున్న ప్రేమకథాచిత్రం "కాంచన గంగ" ఇందులో ఇంకా శరత్‌బాబు, సరిత, రమణమూర్తి, అన్న-పూర్ణ, శంకర్ మొదలైనవారు కూడా ఉన్నారు యద్దనపూడి సులోచనారాణి అందించిన కథకు డి. వి నరసరాజు సంభాషణలు సమకూర్చారు చక్రవర్తి సంగీతం, ఎస్ గోపాలరెడ్డి ఛాయతో వి మధుసూధనరావు దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రానికి అట్లూరి రామారావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు రామోజీరావు నిర్మాత

"ఓ డాన్సు సీను కోసం ఈ కాస్త గుడ్డతో హీరోయిన్‌కి లంగా, జాకెట్ కుట్టాలని డైరెక్టరుగారు చెప్పారు!"




### కె. బాబూరావు దర్శకత్వంలో నరేష్

"సెప్టెంబర్ నెలాఖరులోగా పాటలన్నీ రికార్డ్ చేస్తాం. అక్టోబర్ 4 న విజయ దశమినాడు షూటింగ్ ప్రారంభించి రెండు షెడ్యూల్స్‌లో నవంబర్‌కి ముగిస్తాం" అన్నారు గతంలో రామ విజేతా వారి

"తల్లి దండ్రులు, రామాలయం, జరిగిన కథ, తులసి" లాంటి చక్కని చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం వహించిన కె బాబూరావు ఈయన కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో కె రమాదేవి, ఎం శ్యామల నిర్మించే రామ విజేతా మురళీ కృష్ణా కంబైన్స్ చిత్రంలో నరేష్ హీరో డి వి నరసరాజు సంభా-షణలు, రమేష్ నాయుడు సంగీతం, ఎం- వి. రఘు ఛాయతో తన్నీరు రామారావు నిర్మాణ సారథి

త్వరలో!

ఐదుగురు చెల్లెళ్ల పెళ్లి కోసం
ఓ అన్న వేసిన ఐదు సూత్రాల పథకం

శ్రీసారథీ స్టూడియోస్ సమర్పించు

ప్రవీణ్ ఫిలిం సర్క్యూట్

# అమ్మాయిలూ! ప్రేమించండి!

కె. భాగ్యరాజ్
ఆత్రేయ
ఇళయరాజా



నవయుగ



SUDHA ADS ✤ BALAZI 3

సీరియల్

# ఒక అమ్మ కథ: అన్నపూర్ణ

**తమ** ఊళ్ళో ఉదయం ఫస్ట్‌బస్ ఎక్కింది అమృత. బస్ దగ్గిరికి మధు స్వయంగా వచ్చి కొంత డబ్బున్న పర్సు ఆమె చేతిలో పెట్టాడు.

ఆనంద్ ఊరు, అడ్రసు అన్నీ తెలుసు అమృతకు. మధులా అతడు మానసికంగా బలహీనుడు కాడనీ తెలుసు. అలా అని తను ఇప్పుడే వాళ్ళ ఊరు వెళితే జరగబోయేది ఏమిటి? వయసులో ఉన్న తనని చూసి ఊళ్ళోవాళ్ళతో పాటు అతడి తల్లిదండ్రులూ అనుమానించవచ్చు. ఆత్మలు అంతఃకరణలూ ఈ లోకానికి అంత సులభంగా అర్థంకావు. తనిప్పుడు అక్కడికి వెళ్ళటం మూలాన ఆనంద్ ఆత్మస్థయిర్యం కోల్పోయే పరిస్థితి రావచ్చు. అతడి తల్లిదండ్రులకు ఇదొక పరీక్షగా మారవచ్చు. లేదు. ఇతరులను ఇబ్బందుల పాలు చేయకూడదు. తన బ్రతుకు తనది. ఈ బ్రతుక్కి గమ్యం వెతుక్కోవలసిన బాధ్యత తనదే. అలా అనుకొనే మధు చెప్పినట్లు ఆనంద్ వాళ్ళ ఊరు వెళ్ళకుండా వచ్చి ఈ ట్రెయిన్ ఎక్కింది.

## 23

ఏదో స్టేషన్‌లో ట్రెయిన్ ఆగి కదిలింది. ఆ కంపార్టుమెంట్‌లోని జనం కొందరు దిగారు. ఇంతసేపూ అమృత వైపే పరిశీలనగా చూస్తూ కూర్చున్న యువకుడు బెంచీ ఖాళీ అవగానే ప్రక్కకు జరిగాడు. ఇప్పుడు అమృత, అతడు ఎదురుబొదురుగా కూర్చొని ఉన్నారు సరిగ్గా.

**(గత సంచిక తరువాయి)**

''ఏవండి ! మీరు ఎందాకా వెళ్ళాలి ? ''

ట్రెయిన్ కదిలినతర్వాత అతడే చొరవ తీసుకొని అడిగాడు.

''ఆ'' అంటూ కిటికీలోంచి బయటికి చూస్తున్న అమృత తల త్రిప్పింది. కానీ అతడికి వెంటనే సమాధానం చెప్పలేదు.

''ఏంలేదండీ, మీరు ఎందాకా వెళ్తున్నారని అడిగాను'' అన్నాడు అతడు ధైర్యంగా.

''హైద్రాబాద్'' టక్కున చెప్పేసింది.

''ఏదైనా ఉద్యోగ ప్రయత్నమా ?''

''లేదు.''

''బంధువుల ఇంటికా ?''

''కాదు.''

ఆమె మాటలకు పెద్ద ఆలోచనలో పడ్డాడు అతడు.

అమృత తమ ఊరి నుంచీ బయలుదేరబోయేముందు మధు చూస్తూండగానే నుదుట బొట్టు పెట్టుకొంది. చేతులకు గాజులు వేసుకొంది. తలలో పువ్వులు తురిమింది. కాదనలేదు అతడు.

ఇప్పుడు ఆ యువకుడికి అమృత ఓ కన్నెపిల్లలా కనిపించసాగింది. విశాలమైన నేత్రాలతో చాలా అందంగా కూడా ఉంది. ఎవరిమీదో అలిగి ఇంట్లో వాళ్ళకు చెప్పకుండా బయలుదేరి వచ్చేసిన బాపతు కావచ్చు. ఈమెను వప్పించి తనతోపాటే తీసుకువెళ్తే ? రొట్టె విరిగి నేతిలో పడ్డట్లే !

''ఇంతకూ. మీ పేరు ? ''

''అమృత.''

''నా పేరు జగన్ మోహన్, మాది విజయవాడ. ముక్కు మొహం ఎరగని మీరు హైద్రాబాద్ వెళ్తే చాలా ఇబ్బంది పడతారు ఒంటరిగా. ఎలాంటి అభ్యంతరం లేదనుకొంటే మీరు నాతోపాటు మా ఇంటికి వచ్చేయండి.''

అతణ్ణి పరిశీలనగా చూసింది అమృత. 'చదువుకున్నవాడిలా ఉన్నాడు. మాటలూ సంస్కారయుతంగానే ఉన్నాయ్. వేషభాషలను బట్టి ఏదో మంచి ఉద్యోగంలోనే ఉండి ఉంటాడు. ఏదైనా తనకు ఇప్పుడు ఆశ్రయం కావాలి. ఎవరిదోఒకరిది అండకావాలి. మరి ఈ జగన్‌కు తన మీద జాలి, అభిమానం ఏర్పడినయ్యంటే ఆ భగవదనుగ్రహమే కారణమై యుండాలి. ప్రస్తుతం ఇతడు చెప్పిన ప్రకారం నడుచుకోవటం తప్ప మార్గాంతరం లేదు.' అనుకొని 'సరే' నంది పైకి. జగన్ ముఖం విప్పారిందిఒక్కసారిగా.

* * *

''అమృతా ! నేను చెప్పింది మరచిపోకు'' విజయవాడ సమీపిస్తోండగా మరొకసారి హెచ్చరించాడు జగన్.

''మరచిపోను. నన్ను ఎవరు అడిగినా మాది విశాఖపట్నం అనీ, మీరు మా అన్నయ్యనీ, నేను మీ పిన్ని కూతుర్ననీ—ఇదేగా చెప్పవలసింది? ఓ. కె ! అలాగే చెబుతాను'' అంది అమృత—అంతవరకూ అతడు చెప్పిన పాఠాలను వల్లె వేసుకుంటూ.

తృప్తిగా ముఖం పెట్టాడు జగన్.

స్టేషన్ నుంచి రిక్షామీద కృష్ణలంకలో ఉన్న జగన్ వాళ్ళ ఇంటికి వచ్చారు. అప్పుడు తెల్లవారుఝాము ఏ మూడు గంటలో అయుంటుంది. వీధి వీధంతా నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా ఉంది.

జగన్ ఉండేది ఒక డాబాలో. రెండు పోర్షన్లుగా ఉంది. ఎడమవైపు వాటా అతడిది. రిక్షావాడికి డబ్బులిచ్చి పంపివేసి తలుపు తాళం

**జరిగిన కథ—8 :** రాజారావు అమృత మధులకు అక్రమ సంబంధముందని ప్రచారం చేస్తాడు. ఇల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతాడు అమృత తండ్రి. ఇంటికి వచ్చిన రాజారావుకి బుద్ధి చెప్పి పంపిస్తుంది అమృత. పిన్ని మేలుకోరి పెళ్ళికి అంగీకరిస్తాడు మధు. రాజారావు మోసంతో అమృత శీలాన్ని హరించబోగా డ్రైవర్ సింహాద్రి ఆమెను రక్షిస్తాడు. మధు భార్య పద్మ, ఆనంద్ అమృతల పవిత్ర అనుబంధాన్ని అనుమానించి అవమానిస్తుంది. పట్నంలో జరిగిన విశేషాలన్నీ భర్తతో చెపుతుంది అమృత. మధు భార్య తన స్వంత పిన్ని కూతురు అని తెలుసుకొన్న రాజారావు ఆమెను చూసే నెపంతో మధు వాళ్ళ ఊరు వెళ్ళి అమృతను ఓ ఆట ఆడించాలనుకుంటాడు. రాజారావు, అమృత మాటలు చాటునుంచి విని ఆవేశంతో రాజారావుని చంపాలని కత్తిరెత్తిన సుందరరామయ్య గుండెపోటుతో మరణిస్తాడు. మనశ్శాంతికై అమృతను కొన్నాళ్ళు ఆనంద్ దగ్గరకు పంపను అంగీకరిస్తాడు మధు.



తీశాడు జగన్. సందేహించకుండానే అతడితో పాటు ఆ ఇంట్లో అడుగు పెట్టింది అమృత.

ఇంట్లోకి వెళ్ళగానే కిటికీ తలుపులు తెరిచి టేబిల్ ఫ్యాన్ ఆన్ చేసి వీధి తలుపులు మూసేశాడు జగన్.

షర్టు ఊడదీసి, ఫ్యాన్‌కి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చొని, "నిద్ర వస్తోందా అమృతా?" అనడిగాడు జగన్ ఆమెవైపు అదోలా చూస్తూ.

"లేదు. ఎలాగో తెల్లవారిపోతోంది కద ? బాత్‌రూమ్ ఎక్కడుందో చెబితే ముఖం కడుక్కొని స్నానం చేసేస్తాను" అంది అమృత తన ధోరణిలో.

"ఇప్పుడెక్కడ తెల్లవారటం ? ఇంకా చాలా టైమ్ ఉంది. మధ్య గదిలో మంచం ఉంది! వాల్చుకొని పడుకో."

"నాకు నిద్ర రావటంలేదు."

"నాకైతే నిద్ర వస్తోందిమరి." కూర్చున్న వాడల్లా లేచి అక్కడే గోడకు ఆన్చి ఉన్న మడత మంచాన్ని వాల్చి పడుకున్నాడు.

అమృత కుర్చీలో కూర్చుంది.

"నిన్ను వంటరిగా వదిలిపెట్టి నేను నిద్ర పోతే భావ్యంగా వుంటుందా ? అమృతా ! నువ్వు కూడా వచ్చి ఇక్కడ పడుకో..." అంటూ తన మంచంమీద చోటు చూపించాడు జగన్ వెకిలిగా, నవ్వుతూ.

"జగన్‌గారూ ! మీకు బాగా నిద్ర వస్తున్నట్లుంది. ఆ నిద్ర మత్తులో ఏం మాట్లాడుతున్నదీ మీకు తెలుస్తున్నట్లు లేదు. మరిచేపోయారా ? నేను మీ పిన్ని కూతుర్ని" అంది అమృత.

ఆ మాటలకు షాక్‌తిన్నట్లు ఫీలౌతూ, "...అమృతా ! నేను పడుకుంటాను. ఒక గంట ఆగి లేపితే మిల్క్ తెస్తాను బూత్‌కు వెళ్ళి" అని కళ్ళు మూసుకుండిపోయాడు జగన్.

అద్దెకు తీసుకున్న ఈ ఇంటినిబట్టిచూస్తే జగన్ ఉద్యోగం మంచిదే అనిపిస్తోంది. ఇంట్లో సామాను, ఆర్భాటం చూస్తే భార్యతో సహా కాపురం ఉంటున్నట్లే తోస్తోంది... అతడి అర్ధాంగి ప్రస్తుతం పుట్టినింటికి వెళ్ళి ఉంటుంది. వివాహితుడైయుండీ, బాధ్యతగల ఉద్యోగం చేస్తూ, గౌరవప్రదంగా బ్రతకవలసిన ఈ జగన్ మాట తీరు చూస్తుంటే వట్టి కుసంస్కారిలా ఉన్నాడు. వచ్చి తనని అతడి ప్రక్కన పడుకోమంటున్నాడు, వెకిలిగా చూస్తున్నాడు, వెర్రిగా నవ్వుతున్నాడు ! మరి అతడి చర్యలకు అర్థం ? బయటి నలుగురి దృష్టిలోను తను అతడి చెల్లెలు. ఇంట్లో ఈ నాలుగు గోడల మధ్యకు వచ్చేసరికి ఆ అనుబంధం మారిపోతుందా ? జగన్ మెత్తటి మాటలు నమ్మి తను మోసపోయి వచ్చిందేమో ఇక్కడికి.

అలా ఆలోచిస్తూండగానే చాలా సమయం గడిచిపోయింది.

"నువ్వు నిద్రపోనేలేదా అమృత !" జగన్ తనంతటతానే లేచి కొంత ఆశ్చర్యం ప్రకటించాడు.

"లేదు. మీరూ నిద్రవస్తోందనీ పోలేకపోయారు ?"

"నేను నిద్రపోలేదని నీకెలా తెలుసు !"

"ఒక గంట ఆగి నన్ను నిద్రలేపమని చెప్పి మీ అంతట మీరు లేచి కూర్చుంటేను"

"నిజమే అమృతా, ఎదురుగా నిన్ను పెట్టుకొని నాకు నిద్రపట్టమంటే ఎలాపడుతుంది ?" అని లేచి "మిల్క్‌బూత్‌కు వెళ్లివస్తాను" చెప్పి బయటికి వెళ్లాడు జగన్.

ఆరోజు ఒంట్లో బడలికగా ఉందని

# ఒక అమ్మ కథ

ఆఫీసుకు వెళ్లలేదు జగన్. అమృతను తన పిన్ని కూతురుగా చుట్టుప్రక్కల అందరికీ పరిచయం చేశాడు. ఇంటివారి అమ్మాయి పంకజంతో మంచి స్నేహం ఏర్పడింది అమృతకు. ఆ పిల్ల ఇంటర్ పరీక్షరాసి ఫలితాలకోసం ఎదురు చూస్తోంది.

'విజయవాడలో కనకదుర్గ గుడి; గాంధీపర్వతం, కృష్ణాబ్యారేజి ఇవే చూడదగ్గ ప్రదేశాలు' అని చెప్పి 'వైజాగ్‌లో మీరు డాల్ఫిన్స్‌నోస్ చూశారా, షిప్‌యార్డ్‌కు వెళ్లారా, సముద్రస్నానం చేశారా, రోజూవెళ్లి బీచిలో కూర్చునేవారా ?' అంటూ ఒకటే ప్రశ్నలవర్షం కురిపించింది. అన్నిటికి సంతృప్తికరంగా సమాధానం చెప్పి తప్పించుకొంది అమృత.

''ఐతే ఈరోజు - మనం దుర్గగుడికి వెళ్దామా ?'' అనడిగింది పంకజం.

''అన్నయ్య అంగీకరిస్తే అలాగే వెళ్దాం'' అంది అమృత.

''నాకేం అభ్యంతరంలేదు. ఓపిక వుంటే నువ్వు పంకజం కలిసివెళ్లిరండి. బజారులో నాకు వేరేపని ఉంది.'' అన్నాడు వాళ్ల మాటలు విన్న జగన్.

సరే అంటే సరే అనుకున్నారు.

* * *

''అమృతా! ఈ వార్త చదువు'' ఆ సాయంత్రం వంట ప్రయత్నంలో ఉన్న అమృత దగ్గిరికి వచ్చి తన చేతిలోని దినపత్రికను ఆమె ముందు పెట్టాడు.

''ఏమిటో అంత ముఖ్యమైన వార్త ?'' అంటూ పేపరును తన చేతిలోకి తీసుకొంది అమృత.

''అన్ని వార్తలూ ఎందుకుగాని, నువ్వు ముఖ్యంగా చదవలసింది ఇది'' అంటూ ఆమె చదవలసిన మేటర్‌ను వేలుతో చూపించాడు జగన్.

'యువతి మానభంగం — హత్య' అన్న హెడ్డింగ్ దగ్గర అమృత చూపులు ఆగిపోయాయి. మొదటి ఆట సినిమాకు వెళ్ళి తిరిగి వస్తున్న ఒక యువతిని కొందరు దుండగులు కలిసి బలవంతానా ఒక టేక్సీలోకి ఎక్కించి— ఊరు బయటికి తీసుకువెళ్ళి మానభంగం చేయటమే కాకుండా తమ గుట్టు బయటపడకుండా ఉండటం కోసం ఆమెను చంపి కాలువలోకి తోసేశారు. పోలీసులు కేసు నమోదు చేశారు. హంతకులకోసం పెద్ద ఎత్తున గాలింపు చర్యలు మొదలు పెట్టారు— ఇది అందులోని సారాంశం.

''...ఇది నాకు చూపించటం దేనికి ?'' పేపరును తిరిగి ఇచ్చేస్తూ అడిగింది అమృత.

''ఈనాటి లోకంపోకడ ఏమిటో తెలియజెప్పటం కోసం'' అన్నాడు జగన్.

''ఒకరు నాకు తెలియజెప్ప నక్కరలేదు ఈ లోకం, దాని పోకడ గురించి.''

''ఏమిటి నీకు తెలుసు ? నేనే తారసపడకపోతే ఈ పాటికి నువ్వు ఎక్కడ ఉండే దానివో ? బహుశా రౌడీల చేతుల్లోపడి పొందవలసిన పరాభవం పొంది— ఏ కాలువలోనో, ఊరి బయట చెట్ల తుప్పల్లోనో చచ్చిపడి ఉండే దానివి. లేకపోతే ఏ వ్యభిచార గృహంలోనో, యిరుక్కుపోయి క్షణం క్షణం నరక యాతన అనుభవిస్తూ— అటు చావలేక, ఇటు బ్రతకలేక సతమతమైపోతూండేదానివి. సీ విషయంలో ఇవి పచ్చి నిజాలు ! ఏదో చదువుకున్నవాణ్ణి, సభ్యత సంస్కారం తెలిసిన వాణ్ణి కనుక నిన్ను ఈ ఇంటికి తీసుకువచ్చాను ! చేయూత నిచ్చిన వ్యక్తులకు కృతజ్ఞతలు తెలియజెప్పటమే విజ్ఞత'' అని, అమృత సమాధానం కోసం ఎదురు చూడకుండానే వెళ్ళిపోయాడు జగన్ అక్కడినించి.

అతడు వెళ్ళిన దిక్కే వెర్రిగా చూస్తుండిపోయింది అమృత కొద్దిసేపు. అసందర్భంగా అనవసర విషయాలు ముచ్చటించటంలో—అతడి ఆంతర్యం ఏమిటో కూడా అర్థం చేసుకొంది. అలా అని తన మీదికి ముంచుకు రాబోయే ప్రమాదం గురించి భయపడలేదు ఆమె. జగన్ మూర్ఖత్వానికే జాలిపడింది.

---

తిరిగి ఏమి ఆలోచించాడో ఏమో జగన్— భోజనం చేసేటప్పుడు ఎంతో ఉత్సాహంగా కనిపించాడు.

''ఇంతకూ నీ వివరాలు ఏమిటో చెప్పనే లేదు అమృతా ?''

''మీరు అడగలేదుకద ?'' అని— దాపరికం లేకుండానే తన జీవితానికి సంబంధించిన అన్ని విషయాలు చెప్పేసింది అమృత.

'ఐతే నువ్వొక వితంతువ్వన్నమాట ! భర్త పోయినా మంగళ చిహ్నాలు తీసివేయలేదంటే పెద్ద రివెల్యూషనరిస్టువు కూడా నన్నమాట నువ్వు... భేష్ ! మూఢాచారాలను ద్వేషించే వాళ్ళంటే నాకు ఎంతో ఇష్టం'' అని,

''నా గురించి నువ్వు అడగకపోయినా చెబుతున్నాను అమృతా. నేనొక సగటు ఉద్యోగస్తుణ్ణి. వివాహితుణ్ణి. నా భార్య విజయ పది రోజుల క్రితం పుట్టినింటికి వెళ్ళింది. మా పెళ్ళి జరిగికూడా సంవత్సరం కాలేదు. కాబట్టి మాకు పిల్ల జల్ల ప్రసక్తి లేదు''— తనూ దాచకుండానే— అన్ని వివరాలూ చెప్పేశాడు జగన్.

## 24

ఎండపొడ మీదపడేసరికి మెలకువ వచ్చింది జగన్‌కు. లేచిచూస్తే అమృత జాడ కనిపించలేదు. ఏమై ఉంటుందీ మనిషి ? ఒకవేళ రాత్రి జరిగినదానికి విరక్తిచెంది... గుండె గుభేల్‌మంది అతడికి.

రాత్రి ఆమెను అనుభవించాలని చూశాడు. 'జగన్ ! నాకు ఇష్టంలేదు. వదిలిపెట్టు' అని ప్రాధేయపడింది. కానీ తను ఆమె మాటలను పట్టించుకోకుండా, 'మాటలతో నన్ను బుకాయించకు అమృతా ! కాటికి కాళ్ళుచాచిన వ్యక్తిని పెళ్ళిచేసుకున్నావ్. ఎలాంటి సుఖసంతోషమూ ఎరగకుండా బ్రతికావ్ నీవు. అలాంటి నీలో ఎలాంటి కోర్కెలు, ఇష్టాలు లేవంటే నమ్మేంతటి వెర్రివాణ్ణికాదు.' అంటూ మూర్ఖంగా ప్రవర్తించబోయాడు.

'నన్ను నీ పిన్ని కూతురు, చెల్లెలిని అన్నావ్. ఇపుడు ఆ చెల్లెలి ముందే కామవాంఛలను ప్రదర్శిస్తున్నావా ? నీది నయవంచన జగన్ ! మర్యాదగా నన్ను వదలకపోతే బిగ్గరగా అరిచి నలుగుర్ని పోగుచేస్తాను. నీ పరువు తీస్తాను.' అని నోరుతెరిచి అరవబోయింది. దాంతో తను తగ్గవలసి వచ్చింది. అమృత వెనుక గదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకొని పడుకుంది తర్వాత.

'ఎంతైనా అమృత తనను అవమానించింది. కీలెరిగి వాతపెట్టాలి. సమయం చూసి దీనికి తగిన గుణపాఠం నేర్పాలి'అని రాత్రే నిర్ణయానికి వచ్చేశాడతను. 'మరి ఇప్పుడు అది కనిపించదేం?' అనుకుంటూ లోపలికి వెళ్తే వెనుక గదిలో దైవపటం ముందు కూర్చొని ఉంది కళ్ళు మూసుకొని, చేతులు జోడించి.

'' అమృతా ! '' పిలిచాడు జగన్. కానీ పలుకలేదు అమృత.

''గుడ్ ! యాక్టింగ్‌లో నీకు నువ్వేసాటి'' అంటూ వ్యాఖ్యానంచేసి టూత్‌పేస్ట్, బ్రష్ తీసుకొని బాత్‌రూమ్‌వైపు వెళ్ళాడు జగన్.

జగన్ స్నానంచేసి, ముస్తాబై ఆఫీసుకు బయలుదేరాడు. అప్పటికీ ఈలోకంలోకి రాలేదు అమృత.

అమృతను ఏదోవిధంగా సాధించాలనుకొంటున్న జగన్‌కు అదొక చక్కటి అవకాశంగా భావించుకొని ఆమె సూట్‌కేస్ తెరిచాడు.

* * *

జగన్ ఆ పగలు భోజనానికి రాలేదు. రాత్రి కూడా ప్రొద్దుబోయిన తర్వాతగాని ఇంటికి రాలేదు.

అతడు లోపల అడుగు పెట్టగానే గుప్పున ఏదో వెగటు వాసన కొట్టింది అమృతకు. త్రాగినట్లున్నాడు ఐనా కాన్షస్ తప్పలేదు మనిషి.

మాట మంతీ లేకుండానే డ్రస్సు మార్చుకొని బాత్‌రూమ్ వైపు వెళ్ళాడు.

జగన్ ప్యాంట్ హేంగర్‌కు తగిలిస్తూండగా ఒక కవరు క్రిందపడింది జేబులోంచి. అది అమృత కంటపడి తీసి టేబిల్‌మీద పడేసింది.

బాత్‌రూమ్ నుంచీ వచ్చి, ''అమృతా ! భోజనం వడ్డించు'' అన్నాడు జగన్.

అయిష్టంగానే వెళ్ళింది అమృత.

''నేను పిలవగానే భోజనం వడ్డించావంటే నామీద ఇష్టం ఉన్నట్లే''అన్నాడు భోంచేస్తూ.

''ఇష్టా ఇష్టాలు నాకు తెలియవ్. ఈ ఇంట్లో ఉన్నాను. వంట చేశాను. కాబట్టి నీకు వడ్డించటం నా విధి అనుకొని వచ్చాను. దీనికి నువ్వు విపరీతార్థాలు తీయటం— అది నీ దౌర్బల్యం'' అంది అమృత. రాత్రి జరిగిన దానితో అతడిమీద గౌరవం పూర్తిగాపోయింది. అందుకే ఏకవచన సంబోధన మొదలుపెట్టింది.

దాంతో జగన్ దిబ్బతిన్నట్లు చూశాడు.

''భోంచెయ్యి... నేను వెళ్తున్నాను'' అని ముందు గదిలోకి వచ్చింది అమృత. చూస్తే ఇందాక తను టేబిల్‌మీద పడేసిన కవరు గాలికి గాముల తిరిగి క్రింద పడింది. దాన్ని అందుకొని అప్రయత్నంగానే ఫ్రమ్ అడ్రస్ చూసింది. 'విజయ' అని ఉంది. జగన్ భార్య గామాలు ఏమని వ్రాసిందో అసలు ?

సభ్యత కాదనిపించినా ఏమిటో ఉత్సుకత కొద్దీ— కవరులోంచీ కాగితం బయటికి తీసింది.

''జగన్ గారికి,

తాళికట్టిన భర్త ఐన మిమ్మల్ని అలా సంబోధించవలసి వచ్చినందుకు చింతిస్తూనే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. పరిస్థితులను ఇంత వరకు తీసుకు వచ్చింది మీరే !

బుద్ధిమంతుడైన కుర్రవాడనీ, 'నా' అన్న వాళ్ళు ఎవరూ లేరని, లక్షణంగా ఉద్యోగం చేసుకుంటున్నాడనీ, చేసుకున్న భార్య దివ్యంగా సుఖపడుతుందనీ—ఇలా చెప్పిన మధ్యవర్తి మాటలను నిజమేనని నమ్మి, ఇరవై వేలు కట్నం పోసి మీకు నన్ను కట్టబెట్టారు. పెళ్ళైన తర్వాత గానీ తెలియలేదు మీరు మేడిపండువంటివారని. నటించి మనుషులనే కాదు, దైవాన్ని గూడా మోసం చేయగల సమర్థత మీలో ఉంది !

వివాహ సమయంలో 'మీకిచ్చే కట్నం డబ్బుతో పల్లెపట్టున రెండెకరాల పొలం కొని మీ పేర పెడతాను. ఉత్తరోత్రా అది మీకు ఉపయోగపడుతుంది' అని మా నాన్న నెత్తినోరు మొత్తుకున్నాడు. కానీ మీరు వినలేదు. 'పల్లెపట్టున పొలం కొనటం పెద్ద హెడ్ఏక్. సిటీలో ఇళ్ళప్లాట్లు కొనుక్కుంటే లాభసాటిగా ఉంటుందని' బుకాయించి ఆ డబ్బు మీరేతీసేసుకున్నారు. కానీ, మాట నిలుపుకొనే ప్రయత్నమే చేయలేదు. ఇష్టమొచ్చినట్లు పేకాడారు. చిత్తుగా త్రాగి, మించిపోతే దొరకదన్నట్లు వ్యభిచరించారు. చేతిలో డబ్బున్నంతవరకు ఒక కోటీశ్వరుడి కొడుకులా ఖర్చుపెట్టారు. చివరికి



వెనక్కు చూసుకుంటే అన్నీ అప్పులు ! మీ నిజ తత్వం తెలియని నేను మొదట్లో మా పుట్టి నింటికి వెళ్ళి అవసరపడిన డబ్బు తెచ్చి ఇచ్చాను కొన్నిసార్లు. నిదానంమీద మీ అసలు స్వరూపం బయటపడింది. గిట్టనివాళ్ళెవరో వచ్చి చెప్పలేదు. ఒకడుచెప్పినా నేను నమ్మను. కానీ, మీరే ఇంటికి తప్ప తాగి వచ్చి— అన్నీ వాగారు. ఐనా నేను వెంటనే బయటికి పొక్కలేదు... ఒక విధంగా చెప్పాలంటే నటించాను. ఆ నటననూ మీ దగ్గిరే నేర్చుకున్నాను. మళ్ళీ అప్పులు పెరిగి నన్ను తిరిగి మా ఇంటికి వెళ్ళి ఒక వెయ్యి రూపాయలు తెమ్మన్నారు. అలాగేనని నేను మా ఊరు వచ్చేశాను. మీలాంటి అబద్ధాల కోరును, వ్యసనపరుడిని ఏ ఆడది సహించదు, క్షమించదు. మరి నేనూ ఆడదాన్నేకద ?

ఇప్పుడు మా నాన్నగారికీ తెలిసిపోయింది మీ గురించి. కడుపు మాడ్చుకొని, కన్నబిడ్డల భవిష్యత్తుకోసం— తాము కూడబెట్టినసొమ్మును వెచ్చించాక అది వృధా ఐపోయిందని తెలిసిన రోజున ఆ కన్నవారి వేదన రోదన ఎంత హృదయవిదారకంగా ఉండేదీ మీకు అర్థం కాదు. మీవంటి నయవంచకులతో నాకు పొసగదని మా వాళ్ళతో చెప్పేశాను. ఐనా నాలా మా నాన్నా వాళ్ళు తొందరపడలేదు. చివరి ప్రయత్నంగా మీ దగ్గిరికి రావాలనుకొంటున్నారు. ఆయనకే సమాధానం చెప్పుకోండి మీకు డబ్బు ముఖ్యమో— పరువుప్రతిష్టలు ముఖ్యమో ? విలాసాలు ముఖ్యమో — వివాహ బంధం ముఖ్యమో ? నేనూ

# ఒక అమ్మ కథ

ఈ ఒక్కసారికీ పెద్దల మాటను గౌరవించుదా మనుకుంటున్నాను.

మీ నిర్ణయం మీదే మన భవిష్యత్తు ఆధారపడి ఉందిక.

ఇట్లు,
మీలో పరిమార్పుకోరే,
విజయ''

—చదివిన ఉత్తరాన్ని త్వరత్వరగా మడిచి వేసి తిరిగి కవరులోపెట్టి—దాన్ని యధాస్థానంలో ఉంచేసింది అమృత.

జగన్ భోజనం చేసి ఇవతలికి వచ్చాడు. గిన్నెలు సర్దటానికి లోపలికి వెళ్ళింది అమృత.

''నటించటంలో నీకు నువ్వేసాటి అమృతా'' అమృత తిరిగి వచ్చిన తర్వాత జగన్ వదిలిన డైలాగ్ అది.

''ఇక్కడికి వచ్చింది మొదలు నీ దగ్గిర నేర్చుకుంటున్నది అదేకద ?'' అంది అమృత టక్కున.

''ఉదయం నువ్వు తపోనిష్టలో మునిగి పోయినట్లు దేవుడి ఫొటో ముందు కూర్చుండి పోయావ్ ? ఎంత పిలిచినా పలుకకపోతేనూ...''

''నిజమే జగన్ ! నువ్వు పిలిచినట్లు నాకు తెలియదు.''

''హరికథలు నాకు చెప్పకు అమృతా ! నీదంతా యాక్టింగ్. నాకు తెలుసు ! నువ్వే గౌరవంగల ఆడదానివైతే మొగుడు పోయాక కూడా ముత్తయిదువలా కనిపించవు. ఒంటరిగా దేశంమీదికి ఎగబడవు. నీ పాతివ్రత్యం నోటి మాటలకే పరిమితం.''

''జగన్ ! తప్పతాగి వచ్చి ఏమిటి ఆ మాటలు ?''

''ఉష్ ! అరవకు. పెద్దగా అరిస్తే ఇంటి వాళ్ళు వింటారు. మాట్లాడుకొనేదేమిటో నెమ్మదిగానే మాట్లాడుకుందాం. ఏమంటున్నావ్ నేను త్రాగివచ్చాననికదూ ? నిజమే ! నేనుత్రాగి వచ్చాను. త్రాగి వచ్చినవాడే పచ్చి నిజాలు పలుకుతాడు. తెలుసా?''

''తెలియకేం ? ఆ నిజాలుచెప్పే కట్టుకున్న భార్యకు దూరమైనావ్.''

''అమృతా !... ఆ సంగతి నీకెలా తెలుసు !!''

''ఇందాక నువ్వు క్రింద జారవిడుచుకున్న ఉత్తరం చదివాను.''

''విజయ వ్రాసిన ఉత్తరం — పూర్తిగా చదివేశావా ?''

''అంతా చదివాను. నువ్వు మేకవన్నె పులివని తెలిసిపోయింది.''

''ఆ ఉత్తరం చదివాకే నాకు మనసు చెదిరిపోయింది అమృతా.''

''అందుకే త్రాగానంటావా ?''

''.........................''

''జగన్ ! భగవంతుడు చివరికి నీకు ఏం శిక్ష విధిస్తాడో తెలియదు. కానీ, నువ్వు చేసే తప్పుడు పనులకు అంతే లేకుండాపోతోంది... ఉదయం నా సూట్‌కేసులోని డబ్బు అలా దొంగతనంగా తీసుకువెళ్ళకపోతే — నోరు తెరిచి అడగకూడదూ ? నేనే ఇచ్చేదాన్నికద ?... ఐనా నేను బాధపడటంలేదు... జగన్ ! నువ్వు నాకు హితుడివి, బంధువువు కాకపోయినా సాటిమనిషిగా చెబుతున్నాను... ఇప్పటికైనా కళ్ళు తెరు. నీ బ్రతుకు బాగుచేసుకోవటానికి భగవంతుడు నీకు ఇచ్చిన చివరి అవకాశంగా భావించుకో విజయ వ్రాసిన ఆ ఉత్తరాన్ని... పరులమీద ఆశపడకుండా నీ బ్రతుకు నువ్వు బ్రతకటం నేర్చుకో. లేదా నీ దురలవాట్లే నిన్ను పతనం చేస్తాయి'' అంటూ తనకు తోచిన విధంగా సలహా ఇచ్చింది అమృత.

''... ఆ ఉత్తరం చదివిందిమొదలు నేనూ అదే ఆలోచిస్తున్నాను... మా మామగారు ఏ క్షణానైనా రావచ్చు. ప్రస్తుతం నీవు ఒక సమస్యవైపోతావు అమృతా, మా సిన్ని కూతురువని లోకులందర్నీ నమ్మించగలిగానుకానీ మా మామగార్ని మాత్రం మోసం చేయలేను.

''నేను ఈ భూమిమీద ఎవరికీ ఒక సమస్యగా నిలబడదలుచుకోలేదు జగన్ ! నీలో

ఇటీవల ఆత్రేయపురంలోని మహాత్మాగాంధీ జూనియర్ కళాశాలలో జరిగిన కోనసీమ సైన్సు పరిషత్ ఆరవ మహాసభలో ప్రసంగిస్తున్న సైన్సు పరిషత్ అధ్యక్షుడు శ్రీ సి. వి. సర్వేశ్వరశర్మ, స్టేటుబ్యాంకు మేనేజరు శ్రీ జి. విశ్వనాథం, ఉప విద్యాశాఖాధికారి డా. యస్. రవికుమార్, కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ వల్లూరి సత్యనారాయణమూర్తిగార్లని చిత్రంలో చూడవచ్చు.



మానసికంగా పరిమార్పు వచ్చిందంటే. తిరిగి నీ భార్యతో నువ్వు సుఖంగా బ్రతుకుతానంటే—ఈ క్షణాన వెళ్ళిపొమ్మన్నా వెళ్ళిపోతాను ఎటోకటు.''

''ఒంటరిగా ఎక్కడికని వెళ్ళగలవ్ అమృతా ? లోకం సంగతి నీకు పూర్తిగా తెలియదు. ఏటికి ఎదురీది నెగ్గుకురాలేవు. నీ గురించి నేనూ ఆలోచిస్తూనే ఉన్నాను ఒక చెంప. కొన్ని ప్రయత్నాలు చేశాను కూడా. ప్రస్తుత పరిస్థితిలో నువ్వు ఏదైనా అనాధ స్త్రీ శరణాలయంలో చేరటం మంచిది. బ్రతుకు తెరువుకు ఉపయోగపడే వృత్తి శిక్షణ ఇస్తారు అక్కడ. ట్రైనింగ్ పూర్తి అయ్యాక ఏదో ఒక ఉద్యోగంలో చేరవచ్చు. ఈ ఊళ్ళో ఒక సోషల్ వర్కర్ ఉంది. ఆమె పేరు లలితాబాయి. మంచి పలుకుబడి ఉన్న వ్యక్తే. ఆవిడతో కొద్దిగా పరిచయముంది. నీవు సరేనంటే రేపు వెళ్ళి ఆవిడతో మాట్లాడుతాను. కాలం కలిసి వస్తే నువ్వు మద్రాసు వెళ్ళవలసి ఉంటుంది. వాళ్ల సేవాసదనం అక్కడే ఉంది మరి.''

''ప్రయత్నించు జగన్. నేను ఎక్కడికి వెళ్ళటానికైనా సిద్ధమే'' అనేసింది అమృత టక్కున. ముఖ్యంగా జగన్‌కు దూరంగా ఎక్కడైనా వెళ్ళిపోవటమే ఆమెకు కావలసింది.

జగన్ మాత్రం అమృతమీద తన కసి కొంతవరకు తీరుతున్నట్లు తృప్తిపడి, ''నేను ఇక మాట్లాడలేను. కళ్ళు బరువెక్కుతున్నాయ్ అమృతా'' అని పడుకుండిపోయాడు.

మర్నాడు సాయంత్రం, ''అమృతా! లక్కీగా రాత్రే మద్రాసునుంచీ వచ్చింది లలితాబాయిగారు. ఆవిడతో బాగా పరిచయమున్న ఒక మిత్రుణ్ణి తీసుకువెళ్ళి నీ దయనీయ స్థితి వివరించాను. అది విని ఎంతో జాలిపడింది. అంతే కాదు. తమ సేవాసదనంలో నీకు తప్పకుండా ఆశ్రయం కల్పిస్తానని వాగ్దానం చేసింది. లలితాబాయిగారు తిరిగి రేపే మద్రాసు వెళ్ళిపోతుందట. నువ్వు వెంటనే బయలుదేరి నాతోపాటు వస్తే నిన్ను ఆవిడకు పరిచయం చేస్తాను. నీ సూటుకేసు కూడా తీసుకో. పంకజం వాళ్ళకు మీ ఇంటి దగ్గర్నుంచీ టెలిగ్రాం వచ్చినట్లు చెప్పు'' అన్నాడు జగన్ వచ్చి.

అలాగే చేసింది అమృత. అవసరం తనది మరి.

''మీ వదిన వచ్చేదాకా ఉంటావనుకున్నాను. కానీ, అనుకోకుండా టెలిగ్రామ్ వచ్చిందాయె. పోనీలేగాని అక్కా, నన్ను మాత్రం మరచిపోకు. అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూండు. ఏం ?'' అంది పంకజం. ''తప్పకుండా'' అని బొంకి, జగన్‌తోపాటు బయలుదేరింది అమృత.

[ఇంకా వుంది]

# పిల్లలు వారి మానసిక ప్రవృత్తులు



డాక్టర్ (శ్రీమతి) జయా నాగరాజు
మానసిక వేత్త

## పిల్లలు-ఆహారం

"చందమామ రావె జాబిల్లి రావె " అని పాటలు పాడుతూ తాపీగా పిల్లలకు గోరు ముద్దలు తినిపించే రోజులు కావివి "నీవు గబగబా తినకపోతే మాధాకవళం అబ్బి వచ్చి నిన్ను ఎత్తుకుపోతాడు అంటూ "ఒరేయి అబ్బి షావాడు అన్నం తినడం లేదు యిటోమారు రా ' అని కల్పితంగా పిలుస్తూ పిల్లలను భయపెట్టడం జరుగుతుంది చంటాడు భయంతో అటూ యిటూ కండ్లు పెద్దవి చేసి చూస్తూ గబగబా ముద్దలు మింగి బెక్కుకుంటూ కక్కుకోవడం సహజం ఆ పైని తిండి అన్న, భోజనం చేసే సమయమన్న విపరీతమైన రోత కలిగి అన్నం తినడం మానేయడమో లేక అలా అలా కంచాన్ని కెలికి వదిలేయడమో జరుగుతుంది

మరి కొందరు తల్లులు పిల్లలకు తల్లి పాలు కాక పోత పాలు పట్టించడం పరిపాటిగా జేస్తారు . తల్లి రోగగ్రస్తురాలైనా, పాలు చాలకపోయినా, పిల్లలకు తల్లిపాలు పడకపోయినా పోతపాలు త్రాగించడం సబబుగాని మామూలుగా కాదు తల్లి పాలుకన్నా శ్రేష్ఠమైనవి వేరే లేదు తల్లి పాలు అలవాటు నుంచి పోతపాలు అలవాటు పరచేటప్పుడు తల్లులు వాకచక్యంతో చేయకపోతే పిల్లలు అసలు ఒక పద్ధతి నుంచి మరో పద్ధతికి మారరు కొంతమంది చాందసులు బిడ్డకు నాలుగైదేండ్లదాకా తల్లి పాలే పట్టిస్తారు వేరే ఆహార పదార్థాలు చాలా తక్కువగా పెట్టుతూ ఈ పద్ధతి కూడా మంచిది కాదు ఈనాటి ఆధునిక యువతులు పిల్లల ఆహార విషయాలలో అతి శ్రద్ధ తీసుకుంటూ ప్రతి నాలుగు గంటలకే పాలు త్రాగించాలని బిడ్డ ఆకలితో ఏడ్చి మొత్తుకున్నా పట్టించుకొనక తాము నేర్చిన విధులనే పాటిస్తారు దీనితో ఆకలితో అలమటించి బిడ్డలు ఎక్కువగా పాలు ఒక్కసారే త్రాగే ప్రయత్నంలో వుక్కిరి బిక్కిరి అవుతారు లేదా ఎక్కువ త్రాగి కక్కుకుంటారు కడుపునొప్పి, పాలమారటం మొదలైన బాధలతో చిరాకుపడతారు. ప్రతీ బిడ్డా ఒకలాగే లెక్క ప్రకారం. తల్లులు వేసుకున్న ప్రణాళిక ప్రకారం వుండరుగా మరి ,

పుష్టికరమైన అన్ని రకాల తిండిని బిడ్డలకు తినిపించాలని తాపత్రయం కొందరికి దానితో పిల్లలకు రుచికరం కానివి, తినలేనివి, అయిష్టాకరమైనవి తినిపించడానికి ప్రయత్నించి, విఫలులై బెంబేలు పడతారు . "మా బిడ్డ ఏమీ తినదండీ ఎన్ని రకాలు చేసిపెడతామని " అని అంటూ వుంటారు అమ్మో అరటి పండ్లు శీతం తీపి పైత్యం. బంగాళాదుంపలు వాతం బత్తాయి పండ్ల రసం జలుబు " అని కొందరు ఏ తిండి పెట్టినా పిల్లలకు అరగదనో, పడదనో అనుకోవడం మరో అలవాటు ఈ మిడిమిడి జ్ఞానంతో పిల్లలకు ఏ పదార్థాలు పెడితే "ఎటుపోయి. ఎటు వస్తుందో" జబ్బు చేస్తుందేమోనని, ఏమి పెట్టరు దానితో శరీరానికి కావలసిన మాంసకృతులు, విటమినులు, కొవ్వు పదార్థాలు లేక బిడ్డ అనారోగ్యంగా వుండడం జరుగుతుంది

ఫలానా తినుబండారాలో లేక కూరగాయలో "చలవ" అని పాలు, కొబ్బరి, కోడి మాంసం 'వేడి అని అనుకోవడం, వాటిని పిల్లలకు వాడకపోవడం జరుగుతుంది ఏవేవో తమకు మంచి అని తోచిన తిండిని తినిపిస్తూన్న పిల్లలలో తిండి అంటే విముఖత్వం, లేదా కొన్ని రకాల తిండి మాత్రమే తినడం (ఫుడ్ ఫాడ్స్) జరుగుతుంది




చాలామంది పిల్లలుకు కారం తినిపించక తీపే తినే అలవాటు చేస్తారు ఇడ్లీలో చక్కెర, పెరుగులోనికి చక్కెర కలిపి పెట్టడం ప్రతి దానిలోనూ తీపి నంజుకోవడానికివ్వడంతో . చప్పిడిగాని తీపిగాని తప్ప కారం, వుప్పు, నవరసభరితమైన తిండిని తినలేక బాధపడతారు కొందరు.. లేదా మంచి చెడ్డ లేకుండా ఏది పడితే అదే తినే అలవాటు చేసుకుంటారు

యవ్వన దశలో ఈ తిండి లోపం లేక ఆహార పదార్థ స్వీకరణా లోపం మూలంగా పూర్తిగా తిండినే మానివేసి ఒక విధమైన మానసిక రుగ్మత (అనోరెక్సియా నెర్వోసా)కు లోనవ్వడం కద్దు

తిన్న తిండి అరగకపోవడం, కడుపు వుబ్బరం, తేనుపులు, అజీర్ణ విరోచనాలు, వాంతులు మొదలైన జీర్ణకోశ సంబంధమైన వ్యాధులకు చిన్నప్పటి ఆహార విషయాలు వాటిని తినిపించే విధానంలో లోపమే కారణమని వేరే చెప్పనక్కరలేదు భోజనం సమయంలో నాకిది వద్దు. నే తినను" అని బ్రతిమాలుతున్నకొద్దీ పళ్ళేలను విసిరి కొట్టే పిల్లలు . "వూహు నాకా కూరే కావాలి.." అని మారాం చేసే పిల్లలు, వారడిగినవి లేకపోతే అన్నం తినకుండా బుంగ మూతి పెట్టే పిల్లలు మనకు కోకొల్లలు.

(పైవారం : పిల్లలు - భయం)

## షాక్కుని జైరి

### బందిపోట్ల దౌర్జన్యం !

నిజామాబాదు తాలూకా లింగ సముద్రంలో 16వ తేదీ రాత్రి వో పదకొండు మంది దొంగలు వూరు మీద పడి కొన్ని యిళ్ల తలుపులు పగలేసి, దౌర్జన్యం చేసి ఆడవారి నగలు డబ్బూ దస్కం వగైరాలు ఎత్తుకుపోయారట. అడ్డు వచ్చిన ఆడ మగలను హింసించారట. మొత్తం 16 తులాల బంగారం, ఎనభై తులాల వెండి పోయిందటావూరు యిళ్లల్లోంచి.

### ప్రాణం తీసిన సహజత్వం !

అమరావతిలో ఓ నాటకంలో ఓ సీనులో బిందె ధుమిల్లు పేలాలట. ఈ సీను అతి సహజంగా వుండగలందులకు బిందెలో ఓ బాంబు పెట్టి దాన్ని సమయానికి వెలిగించేసరికది ధుమ్మున పగిలి ఎదట వరసలో కూర్చుని నాటకం చూస్తున్న వో రిటైర్డ్ హెడ్ మాస్టరుగారి గుండెలోకి వో యిత్తడి ముక్క దూసుకుపోయి, ఆయన్ని పొట్టన పెట్టుకుందట.

### భర్తపై మోజు తీరాక విషప్రయోగం!

పశ్చిమ జర్మనీకి చెందిన క్రిఫెల్ట్ నగరవాసిని మేరియా వెల్నన్ తాను ఒక మొగుడితో వుండి, అతని మీద మోజు తీరాక, మరో మొగుడి కోసం ప్రయత్నించేలోగా యీ పాత మొగుణ్ని హరీమనిపించే వ్రతం ఆరంభించిందట. ఆ రకంగా ఆవిడ ముగ్గుర్ని సఫా చేసి దొరికిపోయిందట. చెర్రీపళ్లను విషంలో నానేసి, ప్రేమ మీరా తానొదలబోతున్న మగడికి తినిపించేదట వాళ్ళు నచ్చుకపోతే విడాకులివ్వచ్చుగదా అని జడ్జిగారంటే "వీటన్నిటికీ చాలా టైము పడుతుంది ఈ మార్గం నాకు హాయి అనిపించింది. అన్నదట- ఆహా !




### ఈతలో భారత విద్యార్థి ప్రతిభ !

ఇంగ్లండుకు చెందిన డోవర్ రేవు నుంచి ఫ్రాన్సులోని కేప్ గ్రిస్నెజ్ వరకూ వున్న 32 కిలో మీటర్ల దూరాన్ని భారతదేశానికి చెందిన 18 ఏళ్ల విద్యార్థి (పేరు దొరకలేదు) 8 గంటల 42 నిముషాలలో యీది ప్రపంచ రికార్డు స్థాపించాడట

### కన్నడ నటుల ఇక్కట్లు !

కన్నడ చిత్ర సీమలో ప్రఖ్యాత హాస్య నటుడు ద్వారకేష్, నిర్మాతగా మారి కొన్ని కన్నడ సినిమాలను తీశారు. ఆయన యింటి మీద కొందరు తరుచు దాడి చేయడం, ఫోనులలో ఆయన్ని బెదరించడం, దారులు కాసి కారు మీద రాళ్ళు రువ్వడం వంటి చర్యలు భరించలేక తాను కన్నడ నాడు వదలి, కన్నడ సినిమాలు వదిలి మద్రాసులో స్థిరపడి, తమిళ సినిమా వోటి తీసి, అనక హిందీ వైపెళ్లిపోయారాయన. ఇప్పుడు అదే స్థితి నటుడు విష్ణువర్ధన్‌కు పట్టింది. ఏ వ్యక్తులు, ఎందుకు తనను వేధిస్తున్నారో చెప్పకుండా ఆయన కూడా తన మకాంను మద్రాసుకు మార్చేసుకుని, తాను "ఆ బాధ" పడలేననీ, కన్నడంలో తప్ప ఏ యితర భాషలలోనైనా తాను నటించడానికి సిద్ధం అనీ అన్నారట- ఏనో ఇదో !

### పరారైన ఖైదీ !

నంద్యాల జైల్లో వున్న వడ్డె రాముడు అనే వో ఖైదీ లఘుశంకకు వెళ్లొస్తానని (21వ తేదీ) చెప్పి, అటుకేసి వెళ్లి బజరంగబలీ అని జపించి, గోడ గెంతి పలాయనం చిత్తగించాడట

### భార్య పోరు పడలేక ప్రేయసితో ఆత్మహత్య !

తన భార్య పెట్టే పోరు పడలేక, నాగపూర్‌కు చెందిన అగర్వాల్ అనే ఆయన తన ప్రేయసితోను, నలుగురు పిల్లలతోనూ కలసి తాళ్లతో బంధించుకుని ఓ సరస్సులో దూకేశాడట. అనక ఆరు శవాలనూ చేపలు పట్టేవారు బైటకి లాగారట. మిస్టర్ అగర్వాల్ భార్య విడిగా చాలా కాలంగా వుంటోందట. ఆయన తన నలుగురు (2 + 2) పిల్లలతోనూ, ప్రేయసితోనూ వుంటున్నాడట- ఏం గొడవో, ఏమిటో

### బాక్సింగ్‌పై నిషేధం ?

బాక్సింగ్ ఆట చాలా అనాగరికమనీ, మాటి మాటికి వొళ్లంతా వొదిలి ముఖం మీద డుబిక్కు డుబిక్కున గుద్దుకోడం వల్ల తలలోని అన్ని భాగాలూ కదిలి దెబ్బ తినే అవకాశముందని, న్యూజిలాండ్ మెడికల్ ఎసోసియేషన్‌కు చెందిన డాక్టరు డీన్ విలియమ్స్ చెప్తూ, యీ ఆటను మొత్తంగా నిషేధించాలని అన్నారట. ఈ విషయం మీద బ్రిటీష్ మెడికల్ ఎసోసియేషన్ యొక్క అభిప్రాయానికి తాను ఎదురు చూస్తున్నట్టు కూడా ఆయన అన్నారట.

### జైలుకెళ్లిన జైళ్ల మంత్రి !

నాగాలాండ్ జైళ్ల మంత్రి (అదో పదవా) యొకటిన్ కోన్యాన్ అనే ఆయన పీకమొయ్య త్రాగి, మధువు తరువాతి కార్యక్రమం కోసం రోడ్డున పడి, ఏ వనితా దొరక్క, కోపంతో తుపాకి పేలిస్తే, అది ఓ 16 ఏళ్ల అమ్మాయికి తగిలిందట. దాంతో ఆయన మీద హత్యా ప్రయత్న నేరాన్ని పెట్టి పోలీసులాయన్ని జైల్లో జేర్చారట.

### లాకర్ తగాదా!

మద్రాసు కెతెడ్రల్ రోడ్‌లో వున్న భారత్ ఓవర్‌సీస్ బ్యాంకులో రఘునాథన్ అనే వొహాయన లాకర్ తీసుకుని, అందులో 3లక్షల కీమ్మత్తుగల నగలు 1982లో పెట్టాడట. లాకర్ నిబంధన ప్రకారం అది అతని ఒక్కనికి చెందుతుందట. కానీ ఆయన భార్య వచ్చి లాకరు తెరిచి, నగలు పట్టుకుపోయిందట. అనక రఘునాథన్ లాకర్ తెరుచుకు చూసి గిరి గంతేసి, బ్యాంకు వారిని సంజాయిషీ అడిగితే వారు ఫక్కుమన్నారట దాంతో అతను కోర్టుకు ఎక్కాడట.



# వ్రతం

## కప్పగంతుల మల్లికార్జునరావు

పేసెంజర్స్ హెడ్స్ కౌంట్ చేసి ఛార్టు చూచాడు కండక్టర్.

వొక పాసెంజర్ షార్ట్! లేచి బస్సంతా కలయ చూచాడు.

'మీ తాలూకు వాళ్ళెవరైనా రావాల్సి ఉందా- మేడమ్. బస్సు బయల్దేరుతున్నా చెప్పరేం? 'డబుల్ సీటర్‌లో విండో సీటులో కూర్చున్న యువతిని వుద్దేశించి అన్నాడు.

'నా తాలూకు వాళ్ళెవరూ రానక్కర్లేదండీ. కానీ యీ విండో పక్క సీటు ఖాళీగానే వుంది.'

కండక్టర్ వాచీ చూచుకున్నాడు. డ్రయివర్ హారన్ మోగించాడు. వో రెండు నిముషాలు అటూ యిటూ చూచి కండక్టర్ రైటు చెప్పాడు. డ్రయివర్ ఇంజన్ స్టార్ట్ చేసాడు.

సరిగ్గా ఆ సమయంలో బస్సు పక్క కొచ్చి వో కారు ఆగింది. శ్రీ రాజ్ అందులో నుంచి దిగివచ్చి కండక్టర్‌కి టికెట్ చూపించాడు.

'ఎక్కండెక్కండి సార్. మీ కోసమే బస్సు ఆగిపోయింది. యింత లేటుగా వస్తే ఎలాగండీ?'

శ్రీరాజ్ బస్సులోకి దూరేడు మెల్లగా.

'సారీ ఫర్‌ది ట్రబుల్ మిస్టర్ శ్రీరాజ్...' కారులో నుంచి నలుగురు దిగివచ్చి శ్రీరాజ్‌కు వీడ్కోలు చెప్పేరు.

బస్సు కదిలింది. శ్రీరాజ్ తన సీట్ నెంబర్ వెతుక్కుంటూ వచ్చాడు. సీటులో వో యువతి పక్క సీటు ఖాళీగానే వుంది.కూర్చోటమా? లేక ఆమెను ఆడవారి పక్కనున్న సీటులోకి పంపించి...

'ఎక్స్ క్యూజ్‌మి సర్. మీ సీట్ విండో పక్కదనుకొంటాను. రండి కూర్చోండి' ఆ యువతి స్వీట్‌గా అంటూ తను పక్కకు జరిగి అతనికి జాగాయిచ్చింది. "ఏమి నమ్రత? ఎంత మర్యాద?" అనుకొన్నాడు,

'పోనీ మనం సీట్లు మార్చుకొంటే... అంటే లేడీస్...

"ఓ మీ ఇష్టం. కానీ నాకు మాత్రం నా సీట్‌లో నేను కూర్చోటానికి అభ్యంతరంలేదు. మీకు అభ్యంతరమైతే అలాగే కానివ్వండి."

'నో నో... అది కాదండీ. పోనీ మీరు విండో పక్క నా సీట్‌లో కూర్చోండి. నేను మీ సీట్‌లో కూర్చుంటాను".

ఆమె మెల్లిగా నవ్వి పక్క సీట్లోకి జరిగింది.

'థాంక్యూ సర్. తనను గౌరవించిన పురుషుడిని స్త్రీ ఆరాధిస్తుంది. సింపుల్ అడ్‌జస్ట్‌మెంట్స్ మెన్స్ లైఫ్ హాపియర్ కదూ? నా పేరు శారద'

అతను ఆరాధనగా ఆమెవైపు చూచాడు.

తను అతడిని ఆకర్షించినట్లు ఆమె గ్రహించింది!

శారద అందగత్తె కాక పోయినా అనాకారి కాదు. మాటలో ప్రసన్నత, ఆలోచనల్లో సరళత, ఆచరణలో గంభీరత ఆమె అలంకారాలు. డిగ్రీ పుచ్చుకుని ఏదో చిన్న ఉద్యోగం చేస్తున్న ఆమెకున్న కోరిక వొక్కటే. వివాహం. అయితే అదంత సులభంగా తీరే కోరికా? తండ్రి ఆర్థిక స్థితి ఆమె కోరిక తీరటానికి అడుగడుగునా అడ్డం పడుతూనే వచ్చింది.

పోనీ తన భర్తను తనే వెతుక్కుంటే? ఎవరినైనా ప్రేమిస్తే! తండ్రికి శ్రమతగ్గించి నట్లవుతుంది గదా?

బస్సులో కూర్చుని వేగంగా వెనక్కి వెనక్కి వెళుతున్న పచ్చటి పొలాలను చూస్తుండగా ఆమెకు మొదటిసారిగా ఆ ఆలోచన వచ్చింది.

'మీరు కూడా ప్రకృతిని చూస్తూ సర్వం మర్చిపోయే వారులా వున్నారే?'

ఆమె వులిక్కిపడి పక్కకు చూచింది. అతను- శ్రీరాజ్!

అతను కూర్చున్న వద్ద నుంచి ఆమెనే గమనిస్తున్నాడు. ఆమెను చూచే కొద్దీ యింకా చూడాలనిపిస్తోంది. ఆమెలో ఏదో వింత ఆకర్షణ వుంది. ప్రకృతి ఆరాధనకు ఆమె కళ్ళు పరవశించి పోతున్నట్లున్నాయి. ఏదో ఆలోచనలో వున్నట్లు తెలుస్తున్న మొహంలో సమస్యల తాలూకు మబ్బుల మరకలు లేవు.

అతనికి ఏవేవో గుర్తుకు రాసాగేయి....

ఆమెకు పెళ్ళయిందా? అయి వుంటే ఆ భర్త ఎంత అదృష్ట వంతుడో? కాక పోతే... చేసుకోబోయే వాడు ఎంత అదృష్టవంతుడో?

ఆమెను పలకరించకుండా వుండలేక పోయాడతను-

'అంటే- మీకూ ప్రకృతి అంటే యిష్టమా ? మరి రెండో సీటును నాకు యిచ్చేసేరేం? ప్రకృతిని మించిన అందమైన శక్తి ప్రపంచంలో కాదు- యీ పృథ్వీలో మరే ముందండి? ఎంత చూచినా తనివి తీరని ఆనందం...'

'అలాగా నాకూ అచ్చంగా అలాగే అనిపిస్తుందండీ. ప్రకృతి సౌందర్యాన్ని ధ్వంసం చేసే వారన్నా, ప్రకృతికన్నా యంత్రాలకు విలువనిచ్చే వారన్నా నాకు అసహ్యమండీ...'

'అలాంటి వాళ్ల పట్ల జాలి చూపాలి కాని అసహ్యించుకోవటం దేనికండీ? స్వల్పకాలికమైన తక్షణ లాభాలకు భ్రమ పోయికొందరు ప్రకృతి [illegible] యంత్రాంగంతో ఆట లాడుకుంటున్నారనుకోండి, మీలాంటి వాళ్ళు అలాంటి వాళ్లని ఎడ్యుకేట్ చెయ్యటం మంచిది కదా?'

ఎంతటి సహృదయత? సౌమనస్యం?...ఏమేమో ఆలోచనలు... గుర్తులు....

'అవును మీలాంటి భార్య వుంటే అలాంటి పనులెన్నైనా చెయ్యవచ్చు' అలా పేద్దగా గొణుక్కున్నట్లు అతనికి తెలియదు. కానీ ఆమె ఆ మాటల్ని వింది. వొక్కొక్క క్షణం ఆమె మొహంలో ఏదో ఆశ! అతని వైపు పరిశీలనగా చూచింది.

కానీ అతనామెను గుర్తించే స్థితిలో లేడు. ఎక్కడో....వూహాల్లో....

* * *

**తీపి కలలు కంటూ.... తను ఆఫీసు నుంచి అయిదింటికే బయట పడి స్కూటర్‌ని అయిదుంబావు కల్లా యింటి ముందు ఆపేడు.**

తన భార్య- శారద లాంటి భార్య- తన కోసం అప్పటికే తయారయి ఎదురు చూస్తోంది. తాము స్వయంగా పెంచిన చిన్న గార్డన్‌లో -

'శారూ. నీకోసం ఏం తెచ్చానో చెప్పుకో చూద్దాం...' సినిమాటిక్‌గా అడిగాడతను.

'ఏమోనబ్బా! మీరు నేను చెప్పుకో గలిగినవి తెస్తారా? ఒక వేళ నేను చెప్పుకో గలిగినా పైకి చెప్పటానికి నాకు సిగ్గబ్బా...'

'సిగ్గా ఎందుకు?'

'ఎందుకంటే... మీరు నాకు ఏమిచ్చినా నాకు తియ్యగానే వుంటుంది. కనుక –'

'అయితే అటు తిరుగు, నేనేం తెచ్చానో చెప్తాను.'

శారద అటు తిరిగింది. తను ఆమె జడలో సన్న జాజులు దండను అమర్చి, ఆమెను కౌగలించుకుని మెడ మీద చుంబించాడు.

'అదుగో... అందుకే మీరు నాకేమిచ్చినా తియ్యటి సిగ్గు..'

'యివాళ మన ప్రోగ్రాం ఏమిటో తెల్సా? చెప్పటం ఎందుకసు? నేరుగా వెళ్తే అన్ని విషయాలు నీకే తెలుస్తాయిగా! సంధ్యా సమయం– నూతన దంపతులకు విలువైనది.. లెటజ్ నాట్ వేస్ట్ ఐట్ వర్స్...'

మరో పావు గంట తర్వాత వారిద్దరూ వూరి బయట ప్రకృతి మధ్య వున్నారు.చుట్టూ పచ్చటి తివాచీ పరచినట్లు వరిచేలు... వాటి గట్ల వెంబడి బొమ్మలు కొలువులో పేర్చిన బొమ్మల్లా వున్న కొబ్బరి చెట్లు... మామిడి చెట్లు.. అస్తమయ సూర్యుని అరుణ బింబం ఆకాశంలో మేఘశకలాలు నింగికి నేలకు మధ్య స్వేచ్ఛగా విహరించే క్రమశిక్షణ కలిగిన పక్షుల గుంపులు.

సౌందర్యం... ప్రకృతి సౌందర్యం... ఎటు చూచినా సౌందర్యమే!

ఎంతసేపు అలా కూర్చున్నారో తాము! చీకటి పడిందన్న స్ఫురణ అయినా లేకుండా వొకరి కొకరు అనుకొని...యిద్దరూ ఒక్కటే అయినట్లు అనుభూతితో.. అలా... అలా... అనంత విశ్వంలోకి చూస్తూ...

"రా అందంగా వుంది కదూ?!"

ప్రకృతి.. ప్రకృతి!– చుట్టూ చీకటి...

"చీకటి మాత్రం ప్రకృతి ధర్మంలో భాగంకాదా? చీకటిలో ఎంత అందముందో చూడు! పరమేశ్వర సృష్టిలో ప్రయోజన రహితమ్మైనది ఉంటుందంటావా రాజ్?'

"నిజమే. వుండదు. చీకటిలో ఎంతటి వెలుగు వుంటుందో?"

చీకటి సౌందర్యం వెలుగుకిరాదు. వెలుగు సౌందర్యం చీకటికిరాదు.

మరో రోజు – యిద్దరూ ఏదో మీటింగ్‌కు అతిథులుగా వెళ్ళారు. వాతావరణ కలుష్యాన్ని అరికట్టటానికి తీసుకోవల్సిన చర్యలనీ గురించి తను చెప్తే, శారద ఉడవుల పరిరక్షణను గురించి అద్భుతంగా మాట్లాడింది.

"శారూ. నువ్వు ప్రకృతివి సౌందర్యానివి –'

'రాజ్. నువ్వు పురుషుడివి. అంటే శక్తివి. ఎనర్జీవి ప్రకృతీ పురుషుల కలయికే యీ అద్భుత సృష్టికి మూలం'

'నిన్ను భార్యగా పొందిన నేను అదృష్టవంతుడిని శారూ ....'

తన పేరు మాత్రమే విన్పించి నివ్వెరపోయింది శారద.



ఏమిటితను? తనను గురించి కలలు గంటున్నాడా?

'ఏమండీ. మీరేదో ఆలోచనలో వున్నట్టున్నారు! ఊహా లోకంలో విహరిస్తున్నారా?'

శ్రీరాజ్ కమ్మటి వూహలు చెదిరేయి. శారద శారదలా కాక మరెవరిలానో కన్పించింది. ఆమె శారదకు పూర్తి ఆపోజిట్ –

'ఏం? అయిదుంబావుకే యింట్లో ప్రత్యక్షమయ్యారు. నేను తెమ్మన్నది తెచ్చారా?'

'ఏమిటి? కలర్ టీవీనా వొకొసెట్ వుంది కదా'

'బోడిసెట్. బ్లాక్ అండ్ వైట్‌ది– మీ పీనాసి బుద్ధి పోనిచ్చుకొన్నారు కాదు. అవునులెండి. మీరేదో పెద్ద ప్రయోజకులని మిమ్మల్ని చేసుకోటం నా బుద్ధి పొరపాటు. పుట్టుకతో వచ్చిన కాని బుద్ధులు ఎక్కడికి పోతాయ్? అందుకే పెళ్లి చేసుకొనే ముందు వాళ్ల వంశ చరిత్ర చూచి చేసుకోమన్నారు. ఎర్రగా వుంటే చూచి ప్రేమ మత్తులో పడి మోసపోయాను. మీలాంటి టేస్ట్‌లేని మనుష్యులతో నేను కాపురం చెయ్యలేను. నేను మా పుట్టింటికి పోతున్నాను'

'అది కాదు ....

'మీ సంజాయిషీలు నాకు అనవసరం. నేను కలర్ టీవీ కావాలన్నాను. మీరు ఇంత సింపుల్ కోరికను కూడా తీర్చలేని అసమర్థులు. మా యింటిలో గదికి కోటీ టీవీ వుంది తెల్సుగా! మా నాన్నను ముష్టెత్తినా మీకు రెండు మినీ టీవీలు పారేస్తాడే?' ఆమె విసురుగా బయటికెళ్లింది.

అతను ఆమె వెంట బయటికి వెళ్లబోయాడు.

ఆమె వాకిట్లోకి వెళ్లి తలుపులు విసురుగా వేసింది. ఆ తలుపు అతని మొహాన కొట్టుకుంది. రక్తం....

ఏడుపు.... భయం.... భీభత్సం! జీవితమే భీభత్సం–

## (అ) క్రియలు

నేటి సమాజంలో
రేపులూ
లంచాలూ
హత్యలూ
సమాపక క్రియలు!
మమతా
సమతా
మానవతా
అసమాపక క్రియలు!

– పి. మోహన్

### వ్రతం

'వద్దు వద్దు.... నన్ను విడిచి వెళ్లవద్దు... ప్లీజ్.....'

శ్రీరాజ్ శారద చెయ్యి పట్టుకున్నాడు.

శారద కోపంగా చెయ్యి వెనక్కి లాక్కోలేదు. ఆమెకి అతనిపైన జాలి వేసింది. అంచేత ధైర్యం చెబుతున్నట్టు అతని చేతిని తన చేతిలో మెల్లగా నిమిరింది.

అతను ఆమె వైపు చూచాడు. పక్క సీటు పేసెంజర్–

ఛటుక్కున తన చేతిని ఆమె చేతి నుంచి లాక్కొంటూ 'సారీ' అన్నాడు.

* * *

'కాఫీలు తాగే వాళ్ళు తాగి రావచ్చునండీ' అంటూ కండక్టర్, డ్రయివర్ బస్సు దిగి వెళ్లిపోయారు. పాసెంజర్స్ కూడా వొక్కరొక్కరే దిగిపోతున్నారు.

'క్షమించండి మేడమ్. నేను కాఫీకి వెళ్తున్నాను. మీరు కూడా వస్తారా? లేక తీసుకు రమ్మంటారా?'

'అలా ఆహ్వానించిన మీ సంస్కారానికి నా జోహార్లు. మీరా ప్రసక్తి ఎత్తకపోతే నేను కాఫీ తాగాలన్న ఆలోచనే లేదు. మీ ఆహ్వానాన్ని తిరస్కరిస్తే అది మీ సహృదయతను అపార్థం చేసుకొన్నట్టు అనుకుంది. అంచేత వస్తాను' ఆమె లేస్తూ అంది.

యిద్దరూ కాఫీ తాగేరు. కాఫీలు ముగించిన పురుష పుంగవులంతా కాష్టాలు వెలిగించి బస్సు దరిదాపుల్లో నిలబడి బాతాఖానీలు కొడ్తున్నారు.

'మీకు సిగరెట్టు కాల్చే అలవాటు లేదా?' ఆమె అడిగింది.

'ఏం? అలా అడిగేరు?'

అతనికి హఠాత్తుగా వో క్షణకాలం ఏదో సంఘటన గుర్తుకొచ్చింది.

'ఛీ .... సిగరెట్టు కూడా తాగని మగాడంటే నాకు అసహ్యం. అసలు మోడరన్ అలవాటు వొక్కటీ లేని భభ్రజమానాలని పురుషులనుకోవాలంటేనే నాకు రోత. యూ ఆర్ ఏన్ ఇన్‌సల్ట్ టు మోడరన్ సివిలైజేషన్ ....'

ఛీ ఛీ .... కల .... దుష్టస్వప్నం అది –

పాలల్లో విషపు చుక్కలా యిప్పుడా డైలాగ్ గుర్తుకొచ్చిందేం తనకు? యింతకీ యీమె ఏమంటుందో?

'అలా అడిగినందుకు మీరు అన్యథా భావించరని ఆశ. సిగరెట్టు తాగే అలవాటు కూడా లేని పురుషులంటే నాకు అమిత గౌరవం –'

'ఐసీ! థాంక్యూ ....'

యిద్దరూ తమ తమ సీట్లలో కూర్చున్నారు. శ్రీరాజ్ బ్రీఫ్‌కేస్ తెరిచాడు.. తనని గురించి ఏమన్నా వివరాలడగుతాడనుకొన్న ఆమె వూహ తప్పయింది. పోనీ తనని గురించి ఆయన ఏమన్నా చెప్తాడేమో?

'యీ పుస్తకాన్ని మీరు చదివేరా మేడమ్?'

మేడమ్ అని పిలవకపోతే తను పేరు చెప్పింది గదా? వూహల్లో తను పేరును 'శారు'గా మార్చుకొన్న వ్యక్తి! తనను పేరుపెట్టే పిలవచ్చుగా? లేకపోతే కొంపతీసి యితనికి మరో 'శారు' ఎవరైనా తెల్సా?

'దాంపత్య వనం – కుటుంబ జీవితంలో మీరు ఫల పుష్పాలను పండించుకోవాలంటే తప్పక చదవ్వాల్సిన గ్రంథం'

దాన్ని చూచి పేజీలు తిప్పుతూ ఆమె నవ్వింది.

'స్త్రీలు అంత అందంగా నవ్వుతారా?' అతను అనుకొన్నాడు



ఇటీవల మచిలీపట్నం లేడీస్ రిక్రియేషన్ క్లబ్ 58వ వార్షికోత్సవ సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో ప్రసంగిస్తున్న శ్రీమతి టి. రాఘవకుమారి (సెక్రటరీ), శ్రీమతి పి. ఆదిలక్ష్మి, శ్రీమతి ఎం. సీతారావు, శ్రీమతి ఎన్. లక్ష్మీ సుబ్బరాజు, శ్రీమతి వి. ఎల్. శారదగార్లని చిత్రంలో చూడవచ్చు.

'నాకింకాపెళ్ళి కాలేదు'

'పెళ్ళయ్యాక చదివి మాత్రం ఏం లాభమండీ. పెళ్ళి కాకముందే చదివితే మంచిదనుకొంటా' అదో విధంగా అని నిట్టూర్చాడతను.

యింతకీ యితనికి పెళ్ళయినట్టా కానట్టా?

పుస్తకాలు చదివి దాంపత్య జీవితాలని తీర్చి దిద్దుకొనే వారు కూడా వుంటారని నాకు తెలియదండీ. స్త్రీ పురుషుల మధ్య పరస్పర ఆకర్షణ, అవగాహన, సర్దుకొనే తత్వం, కుటుంబ శ్రేయస్సు కొరకు దంపతులిద్దరూ ఎవరి ధర్మాలు వారు నిర్వహించాలన్న దీక్ష యిత్యాది దాంపత్య జీవితాన్ని నడిపే శక్తులను కొంటున్నాను నేను. యీ విషయాలు పుస్తకాల ద్వారాకన్నా కుటుంబ సంప్రదాయాలనుంచి, తలిదండ్రులనుంచి, సమాజంనుంచి స్వభావ సిద్ధంగానే ప్రతి వాళ్ళు వొక వయసు వచ్చేసరికి నేర్చుకొంటారేమో?'

'నిజమేనండీ చాలా విశ్లేషించారు. మీకు కుటుంబ జీవితం మీద చక్కని అవగాహన వున్నట్టు నాకర్థమయింది. మిమ్మల్ని చేసుకొనే వారెవరో కాని చాలా అదృష్టవంతుడు'

అలా అంటుండగా అతనికి మళ్ళీ ఏవేవో దృశ్యాలు గుర్తుకొచ్చాయి. మనసు వికలమయింది. మనిషి మూగబోయినట్లయ్యాడు.

'కానీ అసలు ఎవరైనా చేసుకొనే అదృష్టం వుండాలి కదా నాకు ముందు?' ఆమె మెల్లగా గొణుక్కొన్నట్టు విషాదంగా అనుకొని అతను విన్నాడేమోనన్న ఆశతో అతని వైపు చూసింది.

అతను తిరిగి ఏవో వూహల్లో తేలిపోతున్నాడని గ్రహించి నిట్టూర్చింది!

................

................

అతను పలకరిస్తాడేమోనని ఆమె చాలా సేపు ఎదురు చూచింది.

కొవ్వూరు దగ్గరి కొస్తోంది. తను అక్కడ దిగిపోతుంది.

అతను రాజమండ్రి వెళ్తాడో లేక కొవ్వూరులోనే దిగుతాడో?

చాలా చిత్రమైన మనిషి లాగున్నాడు అతను. కాకపోతే ఏమిటి?

అతడు తనచేత ఆకర్షించ బడ్డాడు. బహుశా తనని గురించిన వూహల్లోనే అతను వుండి వుండవచ్చు. తన పట్ల ఆ ఆరాధన కన్పిస్తోంది.

కానీ యింతవరకు అతను తనని గురించిన వొక్క విషయం అడగలేదు. తనని గురించి విషయం వొక్కటి చెప్పలేదు. అతను అడగందే తనని గురించి ఎలా చెప్పుకోటం? వొక అడుగు ముందుకు వేసి తన మనసులో మాటను వ్యక్తం చేస్తేనే కదా స్త్రీ కాస్త చొరవ చేసుకోటానికి వీలయ్యేది.

'నన్ను పెళ్ళి చేసుకొంటారా?' అని తనను తాను అడుగుతుందా?

## రాజనీతి!

చేతికి -
పూలగుత్తి
వీపుకి
విచ్చుకత్తి -
ఇదే నేటి
రాజకీయం
కాదన్నావా
నువ్వో దేశద్రోహివి!
అవునంటే
నీకుందో మంత్రి పదవి!!

—"సింహం"

ఛీ.... స్త్రీ జాతికే అవమానకరమైన పని కాదూ అది?

అయినా యిదేమిటి? అతడిని చూస్తుంటే ఆశ కలుగుతున్నదేం?

అతడిని తను ప్రేమించిందా? లేదు. తను స్త్రీ. పెళ్ళి చేసుకున్నాకే భర్తను ప్రేమిస్తుంది. అతనే తనను....

'ఏమండీ? మీ రెక్కడిదాకా వెళ్ళాలి?'

వూహల్లో నుంచి బయట పడ్డాడు.

'వెళ్ళాలనుకొనే దాకావెళ్ళగలిగే అదృష్టం అందరికీ వుండదు కదండీ. నేను వెళ్తున్నది మాత్రం నరకానికే అనుకోండి' వూహ హేంగ్ వోవర్‌లోనే వుండి అసంకల్పితంగా అన్నట్టు అన్నాడు.

'నరకం ఏమిటి?' ఆమె ఆశ్చర్యపోతూ అంది.

అప్పుడు అతను పూర్తిగా తనను తాను తెల్సుకొన్నాడు.

'సారీ. ఏం లేదు. నేను రాజమండ్రి వెళ్ళాలి. మీరు?'

అమ్మయ్య! యిప్పటికి ఆమాత్రం ప్రశ్నన్నా అడిగేడు.

'యిక్కడే. కొవ్వూరు. వచ్చేసింది' అంటూ ఆమె తన వివరాలన్నీ రాసిన చిన్న చీటీ అతని కిచ్చింది.

'మీరు కాస్తంత అబ్సెంట్ మైండెడ్ లాగున్నారు. మీ వూరు వెళ్ళాక నన్ను ఏదన్నా అడగటం మర్చిపోయానని అనిపిస్తే మా నాన్నగారితో మాట్లాడండి. అడ్రస్ యిచ్చాను.

కొవ్వూరు డిపోలో బస్సు ఆగింది. ఆమె దిగడానికన్నట్టు సీటులో నుంచి లేచింది. అతను ఆమెకు దోవ యిచ్చాడు.

'మీ లగేజ్ దించడానికి నేను హెల్ప్ చేస్తాను' అని కూడా అన్నాడు. కానీ తన విషయా లేమీ చెప్పలేదు. యింత దూరం ప్రయాణం చేసి తన పేరన్న చెప్పాలన్న ఇంగితం లేదేం యీ మనిషికి?

'నా వివరాలు యిచ్చినా మీ పేరన్నా చెప్పేరుకారు' అంది ఆమె చొరవ చేసుకొని.

'ఓ! సారీ. మర్చిపోయాను. పైగా.... వొంటరిగా వున్న ఆడపిల్లతో అంత చనువు తీసుకోటం కూడా మంచిదికాదు కదండీ. అయినా మీరుగా అడిగారు కనుక –ఇదిగో నా విజిటింగ్ కార్డు. నా వివరాలన్నీ అందులోనే వున్నాయి'

బస్సు దిగిందామె. ఆ తర్వాత ఆమె ఎటు పోయిందో?

బస్సు కదిలేక అతను ఆమె యిచ్చిన చీటీని వొకసారి చూచాడు.





ఇటీవల విజయవాడలో "కాళిదాస పీఠం" నిర్వహించిన సాహిత్య గోష్ఠిలో ప్రసంగిస్తున్న కుర్తాళం ఉత్తర పీఠాధిపతులు శ్రీ విమలానంద భారతీ స్వామివారు. వారి శిష్యులు, సభకు అధ్యక్షత వహించిన శ్రీ పాటిబండ్ల సుందరరావుగార్ని కూడా చిత్రంలో చూడవచ్చు.

'నా పేరు కుమారి శారద. పెళ్ళవుతే శ్రీమతి శారద నవుతాను.' అని అందులో వొకచోట వుంది.

అది చూచి అతను నవ్వుకోలేదు. ఏదో అర్థమయినట్లయి కాస్సేపు ఆలోచనలో పడ్డాడు. ఆ తర్వాత జాలి పడ్డాడు.

చేతిలో కాగితాన్ని వుండగా చుట్టి బస్సులోనుంచి విసిరి వేశాడు.

పవిత్ర గోదావరీ జలాల్లో వెళ్ళి పడిందా వుండ!

## వ్రతం

..........

..........

యింటి తలుపులు తీస్తుంటే అతనికి నరకంలోకి ప్రవేశిస్తున్నట్లనిపించింది. తలుపు తెర్చాడు. ఎదురుగ్గా పెళ్ళినాటి తమ ఫొటో!

తను – సరోజ!

ప్రేమ జంట! ప్రేమ పెళ్ళి! అయినా తమిద్దరి 'వేవ్ లెంగ్త్స్' సరిపోలేదు. జీవితం పట్ల తమ దృక్పథాలు వేరు. వివాహ వ్యవస్థ, కుటుంబ జీవనం పట్ల తమ యిద్దరి ఆలోచనలు ఉత్తర దక్షిణ ధృవాలు.

సరోజ ధనవంతుల బిడ్డ. ధనంతో అన్నీ కొనగలననుకొంటుంది.

ధనంతో ఏమైనా కొనవచ్చు. కానీ విలువల్ని ఎలాకొనటం? సద్బుద్ధిని, సదాలోచనలను ఎలా కొనటం?

పోరాడినా ఆమె వున్నప్పుడు తనకీ యిల్లు నరకంలా కన్పించలేదు. కానీ విడాకులు కావాలంటూ ఆమె వెళ్ళిపోయాక యిక్కడ తనకు మిగిలిందేమిటి! తన యిల్లు, జీవితం నరకం కాక మరేమిటి?

అతనికి నీరసం ఆవహించినట్లయింది. ఎక్కడి వస్తువులు అక్కడ అలాగే చెల్లా చెదురుగా పడి వున్నాయి. క్రింద పడివున్న ఉత్తరాలను ఆత్రంగా ఏరి చేతిలోకి తీసుకొన్నాడు.

కొంప తీసి సరోజ అన్నంత పని చేయలేదు కదా?

విడాకుల నోటీసు కన్పిస్తుందేమోనని బాధగా వుత్తరాలన్నీ చించి చూశాడు. అదృష్టమే. యింకా ఆ పని చేయలేదు.

అతను నీరసంగా బట్టలన్నీ విప్పకుండా అలాగే మంచంమీద వాలిపోయాడు. తలుపుల్ని అలాగే తెర్చి వుంచానన్న స్ఫురణ కూడా లేదు.

కళ్ళు తెరిచి వుంచితే సరోజ స్ఫురణ.... మూస్తే



# కార్టూనిస్టులకు సూచనలు!

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
- ★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి.

# ధర్మ పథం

–బులుసు వేంకటరమణయ్య



# మితభాషిత్వము

మానవులలో మూడు రకాల వారు కానవస్తారు. కొందరు చాలా మితంగా మాట్లాడతారు. కొందరు అవసరానికి మించి అత్యధికంగా మాట్లాడతారు. ఇక కొందరు ఏమీ మాట్లాడకుండానే ఉంటారు. వీరిలో అధిక ప్రసంగిని వాగుడుగాయ అని, ఏమీ మాటలాడకుండా ఉన్న వానిని ముంగిపోతు అనీ నిందించడం కలదు. మిత భాషిని అందరూ మెచ్చుకుంటారు.

అధిక ప్రసంగి ఆలోచన లేకుండా తన యిచ్చ వచ్చినట్లు మాట్లాడతాడు. అందువల్ల కారణం లేకుండానే ఇతరుల మనస్సులకు నొప్పి కలిగించే మాటలు అందులో దొర్లడం సహజం. మితభాషి ఆలోచించి, నిదానించి ముక్తసరిగా ఎదుటివారి మనస్సు కనిపెట్టి మాటలాడడం వల్ల ఎవ్వరికీ నొప్పి కలగదు.

మనుష్యులు ఉత్తములే కావచ్చును. పరోపకార బుద్ధి కలిగి, ఇతరులకు సహాయం చేసే సంకల్పంతో తగిన వారిని కలుసుకోవచ్చును. అక్కడ అనవసరంగా అధిక ప్రసంగం చేసినట్లయితే, అవతలి వ్యక్తికి చికాకు కలిగి అనుకున్న పని నెరవేరక పోవచ్చు. అట్టి సందర్భాలలో మితంగా మాటలాడడమే ఉచితం.

మితంగామాట్లాడకుండా అధికప్రసంగం చెయ్యడంవల్ల సొంత పనులకే దెబ్బ తగులుతుంది. తన మూలంగా తన వారికి కలగవలసిన మేలు ఉడిగిపోతుంది. అన్ని విధాలా అనుకూలంగా వున్న సంబంధాలు వచ్చినా, ఆ పెళ్లిళ్లు తప్పి పోతాయి. అధిక ప్రసంగం వల్ల అవతలివారు చాలా దుడుకు వారనే దురభిప్రాయం కలుగుతుంది.

అధికంగా మాట్లాడడంవల్ల– ఆ ప్రసంగంలో అనవసరంగా ఇతరులను విమర్శించడం జరగవచ్చును. అందువల్ల అధిక ప్రసంగి మంచివాడయినా, చెడ్డ వాడనే అభిప్రాయం ఏర్పడుతుంది.

కేవలం మితభాషిగా ఉన్నంత మాత్రాన ఎక్కువ ప్రయోజనం లేదు. దానితో పాటు సమయోచితంగా మాటలాడే నేర్పు కూడా ఉండాలి. సముచిత పద్ధతిని సంభాషించక పోతే మిత భాషిత్వాన్ని కూడా హర్షించరు.

అధిక ప్రసంగిగానూ, లేక మూగవానివలె మాటలాడకుండానూ ఉండడం కంటే మితంగానూ, ఉచిత రీతిని మాటలాడడం ఎంతో అవసరం. □

---

సరోజ బొమ్మ....

ఫోను మోగింది.

ఫోనెవ్వరు అప్పుడే. సరోజ ట్రంక్‌కాల్ కాదు కదా?' ఆ రెండో ఆలోచన అతనికి కొండంత వుత్సాహాన్నిచ్చింది.

ఒక కుటుంబాన్ని కలపటం, నిలుపుకోటం కష్టం. విచ్ఛిన్నం చేయటం, చేసుకోటం ఎంత సేపు? క్షణం.

అతను రిసీవర్ ఎత్తి 'శ్రీ రాజ్‌హియర్' అన్నాడు.

'అయ్యా శ్రీ రాజ్‌గారేనా? నేను కొవ్వూరు నుంచి మాట్లాడుతున్నాను. నాపేరు సుందర్రామయ్య. మీతో బస్సులో ప్రయాణం చేసిందే – శారద – ఆమె తండ్రిని. మా అమ్మాయికి వివాహం చేయాలని వరుడికోసం అన్వేషిస్తున్నానండి. వరులు దొరికినా కట్నం వద్ద తూగలేక పెళ్ళి చేయలేని అసమర్థుడినయ్యాను. మిమ్మల్ని గురించి అమ్మాయే చెప్పింది. ఆశ కొద్దీ అమ్మాయి వద్దంటున్నా నేనే ఫోను చేస్తున్నాను. మీక అభ్యంతరం లేకపోతే మీ తలి దండ్రులతో పెళ్ళి చూపులకు రండి. వాళ్ళు మీవద్దే వుంటున్న పక్షంలో నేను స్వయంగా వచ్చి ఆహ్వానించి తీసుకెళ్ళగలను....'

సరోజ – శారద –

సరోజ తన జీవితంలోకి ప్రవేశించి తెంచేసుకొంటానంటోందా బంధాన్ని. శారద తన జీవితంలోకి ప్రవేశించి పెనవేసుకొని పోతానంటోంది. సరోజ తన జీవితాన్ని నరకం చేసింది. శారద స్వర్గాన్ని చేస్తుంది.

ఎలాగూ తనకు విడాకులిస్తానంటోంది కనుక సరోజకు విడాకు లిచ్చి శారదను చేసుకొంటే తన జీవితం స్వర్గమయం అవుతుంది. అది స్వార్థం.

కానీ ధర్మం? విడాకుల పేరిట కుటుంబాలు ఛిన్నాభిన్న మవుతే సమాజం ఛిన్నాభిన్నం కాదూ? భార్య తొందర పడితే తనూ తొందర పడటమేనా? తనకు విడాకులొద్దు. ధర్మం కావాలి. కటుంబం కోసం....

'సారీ సర్! నా కిదివరకే పెళ్ళయింది. మీ అమ్మాయికి ఆ విషయం చెప్పకపోవటం పొరపాటే. నాకు పెళ్ళయినా సంసార సుఖం లేదనుకోండి. నా భార్య విడాకులు కోరుతోంది. అయినా నేను మళ్ళీ పెళ్ళి చేసుకోను. లీగల్‌గా నా భార్య నా నుండి విడాకులు పొందినా మనసా వాచా కర్మణ్యా నేను నా భార్యను ప్రేమిస్తూనే వుంటాను. విడాకులు యివ్వను. నే నాచరించే వ్రతం అది'

అతను ఆగేడు. అవతల నుంచి రెస్పాన్స్ లేదు.

'హల్లో సార్. మీరేమనుకోనంటే మరొక్క మాట. మీ అమ్మాయి శారద నాకు చాలా నచ్చింది. నా చెల్లెలుగా భావించి ఆమె పెళ్ళి బాధ్యతను నేను తీసుకొంటాను. ఆమెకు అనుగుణమైన వరుని వెతికితెచ్చి పెళ్ళి చేసే పూచీ నాది. మీ రా విషయంలో విచారించకండి. రేపు మీ రొకసారి రాగలరా?'

అతను తలుపు శబ్దమైనట్టు అనిపించి అటు తిరిగి చూచాడు. తలుపు తెరిచేవుంది. కానీ గుమ్మం వద్ద.... సరోజ.....

'సార్. మరో మంచి వార్త. శారద, వదినగారు యిపుడే వచ్చింది. కనుక శారదను తీసుకొని మీరో సారి మా యింటికి రండి?. ఏం?'

ఫోను పెట్టేసి అతను సరోజ వైపు నడిచాడు.

'సరోజా! నువ్వు వస్తావని నాకు తెల్సు. ఎందుకంటే భారత దేశంలో వివాహబంధం చాలా గట్టిది. పవిత్రత దాని శక్తి.'

'నన్ను క్షమించరూ....' కాళ్ళమీద వాలబోతున్న భార్యను కౌగిలించుకొని గుండెల్లోకి చేర్చుకొన్నాడు శ్రీరాజ్! □



# సీరియల్ హంతకులు!



ఇటీవల అమెరికాలో మోడల్‌గా పని చేస్తున్న ముగ్గురు యువతులు అతీగతీ లేకుండా అదృశ్యమయ్యారు. మరి కొన్నాళ్ళకే పంతొమ్మిదేళ్ళ ఫ్లోరిడా స్టేట్ అమ్మాయి తనకు జరిగిన భయంకరమైన అనుభవాన్ని ఇట్లా చెప్పింది. పోయిన మార్చి 20న ఓ ఫొటో గ్రాఫర్ ఆ అమ్మాయి దగ్గరకెళ్ళి, డబ్బులిస్తాను ఫొటో కి కొన్ని భంగిమలిస్తావా? అని అడిగాడట. దానికి ఆమె ఒప్పుకోక పోవడంతో, ఆమెను కార్లోకి విసిరేసి తాళ్ళతో కట్టేసి, పెట్టెలో పెట్టి ఓ ప్రదేశానికి తీసుకెళ్ళి ఆమెను బలవంతంగా అనుభవించటం, నానా హింస పెట్టటం, పైగా కళ్ళను జిగురుతో కప్పేయటానికి ప్రయత్నించాడట. మొత్తానికి ఆ పిల్ల ఆ ఉన్మాది నుంచి తప్పించుకుని పారిపోయి వచ్చేసింది.

ఏప్రిల్‌లో మరో అయిదుగురు అమ్మాయిలు టెక్సాస్, ఒక్లహోమ, కొలొరడో, నెవాడా, కాలిఫోర్నియా, ప్రాంతాల్లో అదృశ్యమయ్యారు. అది జరిగిన తర్వాత ఎఫ్‌బిఐ వాళ్ళు హంతకుడి కోసం గొప్ప వేట మొదలెట్టారు. హంతకుడు పేరు క్రిష్టఫర్



తన స్నేహితురాలు కెన్నాన్ క్రిష్టఫర్ వైల్డరు

వైల్డరు (39) బాగా బలిసిన కాంట్రాక్టరు. ఒకప్పుడు కార్ల పందేలలో కూడా పాల్గొనే వాడట. ఇతగాడ్ని పోలీసులు ఏప్రిల్ 13న న్యూహాంస్ షైర్‌లో పట్టుకున్నారు గానీ. పెనుగులాటలో ఇతని తుపాకీ ఇతని ప్రాణాలు తీసింది. డజను మంది అమ్మాయిల అదృశ్యానికి ఇతనే కారణం అని తెలిసింది. అందులో నలుగురి మృతదేహాలు మాత్రమే దొరికాయి. ఇతని కారులో దొరికిన వస్తువులు : తుపాకీ సంచి, కత్తి. కత్తెర. నరంలాంటి సన్నటి త్రాడు. ఫొటోలు. తుమ్మ జిగురు. ఫ్లోరిడాలో అతని పొరుగున వున్నఆవిడను ఇతని గురించి అడుగగా "నిజానికి అతను చాలా మంచివాడు. చాలా సరదాగా వుండేవాడు." అన్నదట!

బయట ఎంతో సౌమ్యంగా, మంచి వాళ్ళుగా కనిపించే ఈ సీరియల్ హంతకుల సంఖ్య పెరుగుతోంది అంటున్నారు., తుపాకీ పుచ్చుకుని టపటపామని కాల్చిపారేసే హంతకుల మాదిరి వాళ్ళుకాదు ఈ రకం. వీళ్ళపని ఏమిటంటే. నెలకొకసారి,లేక సంవత్సరానికి కొన్ని హత్యలు అకారణంగా చెయ్యటం అలవాటు, శవాలనుఅడవుల్లోనూ, చెత్త కుండీల్లోనూ లేక పోతే వూరి బయట రోడ్ల మిద పారేస్తారు.

వీళ్ళు బయట మంచి వాళ్ళుగా కనిపించటంవల్ల ఎవర్ని ఎందుకు చంపుతారో వాళ్ళకే తెలీక పోవటం వల్లఈ రకం హంతకులను గుర్తించి పట్టుకోవటం చాలా కష్టమవుతోందిట. "ఇది వరలో జాక్ రిప్పర్ అయిదుగుర్ని చంపాడు . బోస్టన్ స్ట్రాంగులర్ పద ముగ్గుర్ని చంపాడు . ఇప్పుడు ఈ రకం సీరియల్ హంతకులు ముప్పయి అయిదుకు మించి వున్నారని అంచనా. ఒక్కొక్కరూ ఇరవై ముప్పయి మందిని చంపుతూ" అన్నారు న్యాయశాఖకు చెందిన రాబర్ట్ హెక్.

మనస్తత్వ శాస్త్రవేత్తలు, సంఘ సంస్కర్తలు నేర పరిశోధకులు, ఈ సీరియల్ హంతకుల్ని ఇంటర్వ్యూ చెయ్యటం మొదలెట్టారు, వారి ఉన్మాదానికి కారణాలు కనిపెట్టేందుకు.

ప్రధానంగా పిల్లల పెంపకంలో గల లోపాలే వీటికి కారణం అని తేల్చి చెప్పారు. చిన్నతనంలో పిల్లల్ని సరిగా చూడక పోయినా, మానసికంగా గాయపరచినా, వారు పెద్దయ్యాక ఇట్లా మారతారు అంటున్నారు. కొందరు హంతకులు ఇతరులను కేవలం బొమ్మలుగా భ్రమించి తమకు తోచినట్టుగా వినియోగిస్తారట. కొంతమంది హంతకులు మనిషిని చంపటం ద్వారా కామతృష్ణను తీర్చుకోగలుగుతారట."కేవలం తన మానసికానందం కోసమే హత్యలు చేసేవారు ఈ సీరియల్ హంతకులుగా చెప్పవచ్చు. తాము చేస్తున్న పని అతి ఘోరమైనదని తెలిసినా కూడా, ఆ చర్య వల్ల అనుభూతి పొందుతున్న పైశాచిక ఆనందాన్ని ఃమలుకోలేక హత్యలు చేస్తుంటారు." అంటారు మనస్తత్వ పరిశోధనాసంస్థకు చెందిన రాబర్ట్ రఫ్‌మాన్.

ఇలాంటి డజను హంతకులను ఎఫ్‌బిఐ వాళ్ళు ఇంటర్వ్యూ చేశారు.వాళ్ళు తేల్చిన విషయాలుఇవి: హంతకులంతా శ్వేత జాతీయులే. వాళ్ళల్లో ఃలామంది మంచి అందగాళ్ళు, ఆకర్షించగల శక్తి గలవాళ్ళు, తెలివి గలవాళ్ళు అయివున్నారు. వారి వయస్సు కూడా నలభై లోపే. క్రిష్టఫర్ వైల్డర్ ఓ కెమేరా పుచ్చుకుని. ఇతర్లను ఆకర్షించేవాడు. 'థియోడోర్ బండీ' 36 మంది అమ్మాయిలను చంపాడని అంచనా. లా చదివిన ఇతగాడు సౌమ్యంగా మాట్లాడి. అవిటి వానిగా నటించి

"థియోడోర్‌బండీ"





వేన్ విలియమ్స్

ఇతరుల సహాయం కోరేవాడు. వేన్ విలియమ్స్ 24 మంది నల్లజాతి యువకులను చంపాడని అనుమానించారు. 1982లో ఇతనికి శిక్ష పడింది. 1972-73లో ఎడ్మండ్ కెంపర్‌కు తన తల్లినీ మరో ఏడుగురు ఆడవాళ్లను నరికి పారేసినందుకు కాలిఫోర్నియాలో శిక్ష పడింది. అతను మనిషిని చంపిన తర్వాత వారిని తినేవాడట! అంత ఘోరం చేస్తూ కూడా. మళ్లీ ఏమి ఎరగనివాడికిమల్లే 'శాంటాక్రుజ్'బార్‌లో డ్యూటీలో లేని పోలీసువాళ్ల మధ్య కాలక్షేపం చేసేవాడట!

ఎడ్మండ్ కెంపర్



విదూషకుడిలా సరదాగా నిపించే జాన్‌వేన్‌గేసీ అనే చికాగో వ్యాపారస్తుడు 1972-78 మధ్య కాలంలో పిన్న పెద్దల్ని కలిపి మొత్తం 33 మందిని చంపేశాడట.

ఏదో తమ లోకంలో భ్రమిస్తూ మానసిక ఒత్తిళ్లకు లోనయి ఎదుటి మనుషులను ఆవేశంతో చంపటం మామూలుగా మానసిక రోగులు చేసే పని. కానీ ఈ సీరియల్ హంతకులు మానసిక వేత్తలకు కూడా అంతు చిక్కని వాళ్ళు!

'ఒక వ్యక్తి మీద అతన్ని వదులుకోలేనంత ప్రేమ వుంటుంది. ఐనా ఒక్కోసారి అదే వ్యక్తి మీద తనని బాధించినందుకు కసి వుంటుంది. బాల్యంలో తన ద్వేషాన్ని బయటకు చెప్పుకోలేని భయంతో అణగద్రొక్కేసుకుని వుంటాడు. ఆ ద్వేషమంతా అతని బుర్రలో ఓ చోట గూడు కట్టుకుని వుండిపోయి, అప్పుడప్పుడు బయట పడుతూ వుంటుంది. క్రమంగా పెద్దవాడు అవుతున్నకొద్దీ, ఈ ద్వేషం ఎక్కువవుతూ వుంటుంది' అంటారు. జార్జి వాషింగ్‌టన్ యూనివర్సిటీలో సైకియాట్రీ ప్రొఫెసరు అయిన రిచర్డ్ రాట్‌నర్. కౌమార దశలో తల్లితండ్రుల మీద ఆధార పడి వుండి, వారు చెప్పినట్టు నడుచుకోలేక, వేరే ఆధారం లేక, ఒక్కొక్కసారి ఆ మానసిక ఆవేదనకు తట్టుకోలేక ఏదో ఒక అఘాయిత్యం చెయ్యటం జరుగుతుంది. ఒక్కొక్కసారి మనిషిని చంపటం కూడా చేస్తారు.

సీరియల్ హంతకుల గురించి కొందరి ప్రముఖ మానసికవేత్తల అభిప్రాయం ఇట్లా వుంది : ఈ రకం హంతకులు తమ ఆధీనంలో వున్న వాళ్లతో ఎంతో చనువుగా సంచరిస్తారు. తమలోని లక్షణాలు వాళ్లలో చూస్తారు. లక్షణాలు అంటే- అవినీతి, మోసం చెయ్యటం లాంటివి. తమ కామ వాంఛను వాళ్లతో తీర్చుకుంటారు- నయాన్నో భయాన్నో. తర్వాత తమలోని నీతి, మంచితనం మేల్కొంటుంది. తాము తప్పు చేయటానికి ఎదుటి మనిషి కారణం అన్న భావం కలిగి, ఆ చెడును నాశనం చేస్తున్నాననే ఆవేశంతో ఆ మనిషిని చంపేస్తారు. ఒక్కసారి మనిషిని చంపటం తెలిశాక, ఆ రకం పనిని తనకి ఆనందాన్నిచ్చే విషయంగా భ్రమించి తర్వాత హత్యలు చాలా సులభంగా చేసేస్తారు. తర్వాత తర్వాత చాలా వేగంగా కూడా చేస్తారు.

ఆవేశంతో ఆ మనిషిని చంపటం తెలిశాక, ఆ రకం పనిని తనకి ఆనందాన్నిచ్చే విషయంగా భ్రమించి తర్వాత తర్వాత చాలా వేగంగా కూడా చేస్తారు.

సీరియల్ హంతకులతో ఇష్టాగోష్ఠి జరిపిన మరొక మానసికవేత్త మార్టిన్ అర్నె ఇట్లా అంటారు : సూక్ష్మంగా చెప్పాలంటే, ఎక్కువమంది కామం ముదిరి హత్యలు చేస్తారు. బాధ పెట్టడం, హింసించటం, గాయపరచటం ఇత్యాది పనుల వల్ల కొంత మంది ఆనందాన్ని అనుభవిస్తారు. కానీ ఈ హంతకులు, కేవలం మనుషుల్ని చంపటం ద్వారానే ఆనందాన్ని పొందగలుగుతారు. తమ కామ తృష్ణని తీర్చుకోవాలని వున్నా, నిజమైన కామ క్రీడలకు భయపడి, మనిషిని చంపి, ఆ శవాన్ని చూస్తూ, దీనితో ఆడుకుంటూ తన వాంఛను తీర్చుకుంటారు.

మరి కొంత మంది మానసిక వేత్తల అభిప్రాయం ఇట్లా వుంది : ఈ హంతకులు మానభంగాలు చేసి ప్రాణాలు తీస్తుంటారు. అబలలను హింసించి ఎంతో తృప్తిని పొందుతూ వుంటారు. వారి మీద అఘాయిత్యం చేసి ఇతరులు నవ్వులాడుకోవటం మానేసి భయంతో బిక్క చచ్చిపోవాలి అని వాంఛిస్తుంటారు. వారు చేసిన హత్యలు వెలుగులోకి వచ్చి పోలీసులు తికమక పడుతుంటే వాళ్లకెంతో సంతోషం. వీరు సంఘంలో ఎంతో హుందాతనాన్ని నటిస్తూ వుండటం వల్ల, ఎన్ని హత్యలు చేసినా వీరి ఆచూకి తొందరగా తెలీటం కష్టమవుతోంది. వీరు హత్యలు చేశాక ఎంతో తెలివి తేటలు వుపయోగించి, హత్య తాలూకు ఆధారాలు దొరక కుండా చేస్తారు. వీళ్లకి తాగుడు అలవాటు కచ్చితంగా వుంటుందని చెప్పలేం. కారు వుపయోగిస్తూ వుంటారు.



జాన్‌వేన్‌గేసీ

యూనివర్సిటీ ఆఫ్ వర్జీనియాలో లా మరియు సైకియాట్రి శాఖలకు అసోసియేట్ ప్రొఫెసర్‌గా వున్న పార్క్ ఇలియట్ డైట్జ్ ఇట్లా అంటారు :

'నోటి వెంట నురగ వచ్చే వాళ్ళు ఈ హత్యలు చేస్తూ వుంటారు. అనిపించింది. అదే నిజమయితే హంతకుల్ని పట్టుకోవటం ఎంతో సులభం. కానీ ఈ రకమైన ఆధారం సరయినది కాదు. ఎందుకంటే, ఎంతో సౌమ్యంగా ప్రవర్తించే వాళ్ళు కూడా ఇట్లాంటి భయంకరమైన హత్యలు చెయ్యగలరు.

పిల్లల ఎదుట భార్యాభర్తలు తిట్టుకోవటం కొట్టుకోవటం, తరచూ పిల్లల్ని చావబాదటం, సరిగా చూడకపోవటం, పిల్లలు మానసికంగా దెబ్బ తినటానికి దారి తీస్తుంది. పెద్దయ్యాక తల్లి-దండ్రులను సరిగా చూడకపోవటం, ఇటువంటి విషయాలే కారణం అవుతాయి. అనురాగంతోనే అన్నీ సాధించవచ్చు. కానీ దీనికి ఎంతో నిజాయితీ, ఓపిక అవసరం అనిపిస్తుంది.

—బాబు

('డిస్కవర్' ఆధారంగా)

సీరియల్

# శ్రావణి



మాదుగుల కృష్ణకుమారి

నేలమీదపడి అచేతనంగావున్న శ్రావణిని ఒళ్ళోకి తీసుకుని "మళ్ళీ బ్రతికివచ్చి నువ్విలా మా కళ్ళకు కన్పడతావని అనుకోలేదు." అని అవ్యక్తానందంతో కళ్ళనిండుగా ప్రేమతో శాంతమ్మ కూతురిని చూస్తుండిపోయింది.

ప్రమీల ముఖాన నీళ్ళు చిలకరించింది. "శ్రావణీ ఎవరొచ్చారో చూడు" అంది చిన్నగా తట్టి లేపుతూ.

పదినిముషాలకు చిన్నగా కదిలి "అమ్మా" అంది శ్రావణి నీరసంగా.

"అమ్మా నే వచ్చేశా. ఎంతపని చేశావే మా మీద కోపం వస్తేమాత్రం అంత దారుణం చేస్తావా ? ఈ ముసలి వయసులో మమ్మల్నిలా బాధపెట్టొచ్చా. ఆవిడ ధర్మమా అని మళ్ళీ చూడకలిగాం" అంది ఆనందంగా.

"అమ్మా శ్రావణీ" అన్నాడు లక్ష్మయ్య జారిపోతున్న కన్నీటిని కండువాతో తుడుచుకుంటూ.

దూరంగా దోషిలా సిగ్గుతో తల దించుకుని నిలబడింది రాజ్యం.

ఒకసారి కళ్ళువిప్పి తన వాళ్ళనందర్నీ వరుసగా చూసిన శ్రావణికి ఒక రకమైన బాధో, ఆనందమో తనకే తెలియనిది ఏడుపు రూపంలో ముంచుకువచ్చింది. ఆ ఏడుపు మరింత ఉధృతమై ఉప్పెనలా ముంచెత్తింది.

## (గత సంచిక తరువాయి)

"ఎందుకమ్మా ఏడుపు, అందరం వచ్చేశాం నీకింక భయమేమీ లేదు" అని ప్రేమగా కూతురిని గుండెల్లో పొదుపుకుంది శాంతమ్మ.

చిన్నపిల్లలా ఒదిగిపోయింది శ్రావణి ఏడుస్తూనే.

అమ్మ కన్పడగానే ఏడ్చేసే ఇంత పిరికి పిల్లైనా ఆరోజు అంత ధైర్యంగా చచ్చిపోవాలని పట్టుపట్టి నాతో పోట్లాడింది, అనుకుని చిన్నగా నవ్వుకుంది కళ్ళు చెమ్మగిల్లిన ప్రమీల.

శ్రావణి గుండెల్లో బాధంతా తీరి మనసు తేలికపడిందని తెల్సుకున్నాక మళ్ళీ మొదలు పెట్టింది ప్రమీల.

"మీ వాళ్ళందరి సమక్షంలో జరిగిందాంట్లో నీ కేమాత్రం భాగంలేదని రుజువు చేశాను. విన్నావుగా నువ్వుకూడా" అంది.

విన్నానని తల వూపింది ఒకచేత్తో కళ్ళు తుడుచుకుంటూ.

"వాడలా చేశాడని ఒక్క మాటమాత్రంగా అయినా మాతో చెప్పివుంటే ఇంత గొడవ జరగనిచ్చేవాళ్ళమా ?" అంది శాంతమ్మ.

"నన్ను క్షమించు శ్రావణీ" అంది సిగ్గుగా రాజ్యం.

**జరిగిన కథ—11** శ్రావణి తన పెళ్ళికి ముందు జరిగిన సంఘటనలు చెప్తూ తనను తన బావ ఏ విధంగా అల్లరి పెట్టిందీ ప్రమీలతో చెప్పసాగింది. శ్రావణి చెప్పినదంతా విన్న ప్రమీల ఆమె జీవితం నాశనం కావడానికి కారణం ఆమె బావే అని గ్రహిస్తుంది. ఎలాగైనా ఆమె బ్రతుక్కొక దారి చూపాలని నిర్ణయించు కొంటుంది. కైలాష్ తన స్నేహితుడైన శ్రీహరి భార్యే తనింట్లో ఉన్న శ్రావణి అని తెలుసుకొంటాడు. శ్రీహరి భార్య స్మృతులతో అశాంతి పాలవుతాడు. శ్రావణి సమస్యను భార్య ప్రమీలతో కలసి పరిష్కరించాలనుకొంటాడు కైలాష్. శ్రావణికి వైద్యం చేసిన శతభిషాచారి దగ్గరకు వెళుతాడు. అక్కడ శేషుని చూస్తాడు. కైలాష్ శేషుతో స్నేహం పెంచుకొంటాడు. తాగుడు మైకంలో తన రహస్యాలన్నీ కైలాష్‌కు చెప్పడం మొదలుపెడతాడు శేషు. శ్రావణి జీవితం నాశనం కావడానికి శేషే కారణం అని తెలుసు కొంటాడు కైలాష్. ప్రమీల, కైలాష్‌లు కలసి శ్రీహరి దగ్గరకు బయలుదేరుతారు. శ్రీహరి కైలాష్‌లు శ్రావణి ఇంటికి వెళుతారు. శ్రావణి ఇల్లు వదిలి వెళ్ళిపోయిందని తెలుసుకొని కృంగిపోయిన శ్రీహరిని తమ ఇంటికి తీసుకువస్తాడు కైలాష్. ఒక్క రోజులో పరిస్థితి అంతా చక్కబడుతుందని నిజం నిరూపిస్తానని శ్రావణితో చెబుతుంది ప్రమీల. శేషు తనతో చెప్పిన రహస్యాలన్నీ టేప్ రికార్డరు ఆన్ చేసి శ్రీహరికి వినిపిస్తాడు కైలాష్. శ్రావణి తల్లిదండ్రులతో పాటు అక్క రాజ్యంకూడ టేప్ రికార్డర్‌లో శేషుమాటలు విని నిజం తెలుసు కొంటుంది. అందరూ శ్రావణి ఉన్న గదిలోకి వెళుతారు.

"నా ముఖానలారాసుంటే ఎవరేంచేస్తారు' అంది నిర్లిప్తంగా.

ఆమె చూపులు నేలకు ఆని వున్నాయి. కారణం ఎదురుగా శ్రీహరి వున్నాడు. ఆమె మనసంతా పచ్చి పుండులా వుంది. ప్రమీలక్క చాలా నాటకం ఆడింది. ఎన్నో విషయాల్ని చాకచక్యంగా తెల్సుకుంది. కానీ జరిగింది మరొక్కసారి గుర్తుకువస్తే ఆ రోజు ప్రమీలక్క నన్ను ఎందుకు రక్షించిందా అన్న బాధ తీవ్రం అవుతోంది ఆమె మనసులో. తన కాళ్ళు పట్టుకుని క్షమించమన్న మనిషి, మాయ చేసి తన శీలాన్నే హరించాడు. అది తల్చుకుంటేనే మనసు, ఒళ్ళు కూడా కంపరమెత్తిపోతోంది. ఇప్పటికిప్పుడు వీళ్ళనందర్నీ తప్పించుకుని ఎందులో అయినా పడి చావాలన్నంత ఆవేశం ఆమె మనసులో అనుక్షణం అధికమవసాగింది. తన జీవితాన్ని పాడుచేసిందేకాక, ఎందుకూ పనికిరాకుండా మోడులా మిగిల్చిన వాళ్ళమీద కోపంతోపాటు, ఏమీ చెయ్యలేని తన అశక్తతకు దుఃఖం లోపలినుంచి కట్టలుతెంచుకు వస్తోందామెకు.

శ్రావణి మనసులోపడే క్షోభను గమనించిన ప్రమీల మృదువుగా ఆమె చెయ్యి పట్టుకుని "జరిగిందానికి బాధ పడటం అనవసరం. అది మర్చిపోవటానికి ప్రయత్నించు" అంది.

"అట్లా ధైర్యం చెప్పమ్మా. నువ్వెవరివో కానీ దేవతలా నా బిడ్డని కాపాడావు. ఇన్నాళ్ళు కంటికి రెప్పలా చూశావు. ఎన్ని జన్మలక్కయినా నీ ఋణం తీర్చుకోలేము" అని శాంతమ్మంటే—

చిన్నదానివయినా నీ మంచి మనసుకి చెయ్యెత్తి దణ్ణం పెట్టవచ్చునని కైలాష్ దంపతులవంక కృతజ్ఞతగా చూశాడు లక్ష్మయ్య.

"నన్ను బ్రతికించి నాకు చాలా బాధ పెంచావక్కా" అంది శ్రావణి.

"నిరాశావాదం వదిలెయ్యి. ఎదురుగా మీ ఆయన వున్నాడు. జరిగింది విన్నాడు. మా పని పూర్తయింది. ఇంక మీపని వుందన్నట్లుగా శ్రీహరివైపు చూసింది ఏం చెపుతాడోనన్నట్లుగా. అప్పటివరకు కళ్ళప్పగించుకుని చూస్తున్న శ్రీహరి మనసు భార్య గురించి తెల్సిన నిజంతో కొంతవరకు తేలికపడింది.

కానీ మనసులో ఏదో మూల సంకోచం. శ్రావణిని ఏలుకోవటం సముచితమేనా అని. పరాయివాడింట్లో వున్నదని కేవలం అనుమానం వల్లనే సీతను రాముడు అడవులకు పంపాడు.

కానీ అలనాడా సీతను పరపురుషుడెవ్వడు తాకనన్నా తాకలేదు. కానీ ఈరోజు తన భార్యకి జరిగింది చెవులతో స్వయంగా విని కూడా ఏలుకోవాలంటే ఏదో అలజడి మొదలయింది మనిషిలో.

కానీ మనసు హెచ్చరించింది ఒకవైపు.

"నీ భార్య చనిపోయిందని తెల్సి ఎంతో ప్రేమ కురిపించావు. ఆమే నా జీవిత మన్నావు.

ప్రాణ మన్నావు. ప్రేమ దేవతన్నావు. బతికుంటేనే చాలని బాధ కురిపించావు. కానీ బతికివున్న భార్యను ఏలుకోవటానికి ఎందుకింత ఆలోచన. ఇదేనా నీ సంస్కారం.''

మనిషిగా మళ్ళీ ఆలోచిస్తే...

ఏ ప్రయోజనం ఆశించి ఆమెను అర్ధాంగిగా తెచ్చుకుంటావు. నీ వంశవృద్ధికా తోడ్పడదు. ఎండినచెట్టు చిగురించటం అసంభవం. ఆమెను భార్యగా తెచ్చుకుంటే నీకే అవమానం. నీ వంశం నిర్వంశం కావాలన్నదే నీ కోర్కె అయితే ఆమెనే తెచ్చుకో. నీ తల్లి ఆవేదనను అర్థం చేసుకో, ఆలోచించుకో అని మరొకవైపు.

కేవలం భార్య సంతానవతి అయితేనే అర్ధాంగిగా అభిమానిస్తావా ? అదే లోపం, నీలో వుంటే నీ భార్య మరొక పెళ్లికి తలపడగలదా ? భర్తకో న్యాయం, భార్యకో న్యాయమా ? నిజంగా నువ్వామెను ప్రేమించే వాడివయితే నీకీ ఆలోచనే రాదు. రాకూడదు. రానేరాదు. మనసులో నీ భార్యనే ఆరాధిస్తూ, వేరొక స్త్రీకి నీ జీవితంలో భాగం పంచనంత మాత్రంగానే అది సంస్కారమనిపించుకోదు. మరొక నిముషం కూడా వృధాచెయ్యక ఆమెను తెచ్చుకుని నీ ప్రేమను నిరూపించుకుని ప్రేమ మూర్తిగా ఆమె మనసులో నిల్చిపో. మరొకసారి నీ సంస్కారాన్ని రుజువు చేసుకుని పురుష జాతిలోనే ఆణిముత్యంగా నిల్చిపో— అని పదే పదే మనసు హెచ్చరించింది.

మనిషికి, మనసుకి జరిగిన సంఘర్షణలో చివరకు మనసే గెల్చింది.

ఏమయినాకానీ శ్రావణి నా భార్య. ధర్మేచా అర్థేచా, కామేచా, మోక్షేచా, నాతిచరామి అని పెళ్ళినాడు చేసిన ప్రమాణాల్ని వమ్ము చెయ్యకుండా ఆమెవల్ల నా వంశం నిర్వంశం అయినా, ఎటువంటి కిష్ట పరిస్థితి ఎదురయినా పట్టిన చెయ్యి విడువను. నా భార్యగా స్థానం ఎప్పుడూ ఆమెదే. అని స్థిర నిశ్చయానికి వచ్చిన శ్రీహరి మనసు కుదుటపడింది.

''ఏమిట్రా ఆలోచన?'' అన్నాడు కైలాష్.

''బాబు శ్రీహరి ! అడిగే అవకాశం పోగొట్టుకున్నాననే అనుకున్నాను. కానీ దేముడు వాళ్ళ రూపంలో నా బిడ్డను రక్షించాడు. ఇప్పుడు కాళ్ళుపట్టుకొని అడుగుతున్నాను నా కూతుర్ని ఏలుకొమ్మని'' కన్నీళ్ళతో కాళ్ళు పట్టుకోబొయ్యాడు లక్ష్మయ్య.

''మామగారు'' అని దూరంగా జరిగాడు శ్రీహరి.

''నాన్నా !'' వారించింది శ్రావణి.

''ఏంచూసుకుని నీ కూతుర్ని ఏలుకొమ్మని అడుగుతున్నావు నాన్నా. నేను ఎవ్వరికి పనికిరాను. ఇంక నా బతుకింతే. ఏ జన్మలో తల్లి బిడ్డలను వేరు చేశానో అసలీ జన్మలో ఆ భాగ్యానికే నోచుకోలేదు. ఎండిన చెట్టును ఎవ్వరూ వుంచుకోవాలనుకోరు. మోడులాటి నా బతుకు ఇంతటితో పూర్తవవలసిందే. ఏ ఆనందం, ఏ ఆశతో నేను బతకాలి'' అని దోసిలిలో ముఖం దాచుకుని హృదయవిదారకంగా విలపించింది.

ఆమె ఏడుపు గుండెల్ని పిండినట్లయింది శ్రీహరికి. ఇంక తాత్సారం చెయ్యటం మంచిది కాదని ముందుకు నడిచి ''శ్రావణీ ?'' అని ప్రేమగా పిలిచాడు.

చివాల్న తలెత్తి ''వద్దండి వద్దు నన్ను తాకవద్దు. నేను మీకు పనికిరాను. నా నీడకూడా మీమీద పడకూడదు. పెళ్ళికి ముందే నాకే మాత్రం తెల్సినా నేనసలు ఈ పెళ్ళికే అంగీకరించేదాన్ని కాదు. కానీ నా నుదుట కల్యాణ ఘడియ వుండబట్టి మీకు ఇల్లాలిని కాగలిగాను. ఈ చేదునిజం తెలియనంతవరకు మీతో శీలవతిగా వుండకల్గాను. కానీ ఇప్పుడు నేను కళంకినని తెల్సిపోయింది. ఇన్నాళ్లు తెలియక చేసిన పాపమే నన్ను నా మనసుని కాల్చేస్తోంది. తెలిసి మీకు మళ్ళీ దగ్గర కాలేనండి. మీరు ఇంకొకరిని పెళ్ళి చేసుకుని ఆమె ద్వారా అయినా మీ అమ్మగారి కోర్కె తీర్చండి.'' అంది దూరంగా జరుగుతూ.

ఆమెకు దగ్గరగా వెళ్లి చెయ్యి పట్టుకుని ''వేరొకరిని పెళ్లి చేసుకొమ్మని నీచేత చెప్పించుకునేటంత స్థితికి నేనింకా దిగజారలేదు. నీ మీది ప్రేమే ఇన్నాళ్లు ఆ పని చెయ్యనియ్యకుండా కట్టిపడేసింది. లేకపోతే మగవాడిగా నా అవసరాలు తీర్చుకునే అవకాశం లేక కాదు నేనిలా వుంది. ఆరోజు ఆవేశంతో ఆలోచించకుండా ప్రవర్తించినందుకు నేను ఎంతగానో సిగ్గుపడుతున్నాను. నిన్ను దూరం చేసుకున్నందుకు పడే వ్యథ నాకు తెల్సు, నామనసుకి తెల్సు.''

''అవునమ్మా శ్రావణి, వాడు చెప్పేదంతా నిజం. నా మిత్రుడు అందరిలాంటివాడు కాదు'' అన్నాడు కైలాష్ నచ్చచెపుతున్నట్లుగా.



భారం అంతా మీదే అన్నట్లుగా శ్రావణి తల్లితండ్రులు బయటకు వెళ్ళారు. "నీ పట్టుదల నీదేకానీ ఎదుటివాళ్ల మాట విన్పించుకోవే?" అంది కోపంగా ప్రమీల.

"ప్రమీలక్కా! నువ్వు కూడా నన్నర్థం చేసుకోవెందుకని? ఆయన సహృదయతతో నన్నంగీకరించినా. నా మనసు ఒప్పటంలేదు. ఈ జీవితంలో అమ్మా అన్పించుకోలేను. ఆయన్ని నాన్నగా చెయ్యలేను. మాతృత్వాన్ని పొందలేని నిర్భాగ్యురాల్ని. ఎందుకు నాలాటి ఆడది భార్యగా వుండి ప్రయోజనం? మోడు చిగురించదు. నాకెవ్వరూ ఏమీ చెప్పద్దు." అంది మొండిగా.

"శ్రావణీ నా మాట విను. లోకంలో కాపురాలు చేసే భార్యా భర్తలందరు పిల్లలతోనే వున్నారా? పిల్లలున్న భార్యా భర్త అందరూ, ఏ కలతలు లేకుండా అన్యోన్యంగా కాపురాలు చేస్తున్నారా? నల్లగిరితోపాటే మనమూను. నా మాట విను. నన్ను కాదనకు" కన్నీళ్ల నిగ్రహించుకుంటూ అన్నాడు శ్రీహరి

తను అనవల్సిన మాటలు భర్త నోటి నుంచి రావటం సహించేలేని శ్రావణి అంతటి ఔదార్యాన్ని భరించలేక "వద్దండి నామాట విని దయనెసి నన్ను మర్చిపొండి. మీ మంచి మనసుని నాలాటి దానికోసం బాధ పెట్టకండి. మంచికి కూడా ఒక హద్దు వుంటుంది" అంది.

అరగంటసేపు ఇద్దరిమధ్యా మాటలు సాగాయి. కానీ శ్రావణి తన మాటమీద నుంచి ఒక్కడుగు కూడా ముందుకు వెయ్యలేదు.

శ్రీహరికి ఓర్పు నశించింది.

శ్రావణి చెయ్యి పట్టుకుని విసురుగా దగ్గరకు లాక్కుని ఎర్రబడ్డ కళ్ళతో తీక్షణంగా ఆమె ముఖంలోకి చూస్తూ "నువ్వు ఎలాటిదానివయినా సరే, నీ గత జీవితం ఎంత భరింపరానిదయినా సరే నువ్వు నాకు కావాలి. నేను నిన్ను వదలను. తెల్సిందా? మరింకేం మాట్లాడకు" అన్నాడు కోపంగా.

తనమీద అతనికున్న అవ్యాజమయిన అనురాగానికి ఆమె మనసు ఒక్క క్షణంపాటు ఆనందపడింది. కానీ అది క్షణికం మాత్రమే. అంత మంచి మనసున్న వ్యక్తికి తను భార్యగా తగదని మౌనంగా వుండిపోయింది.

"ఇంకా నీ నిర్ణయం అదే అయితే ఇద్దరం ఒకేసారి బ్రతుకును అంతం చేసుకుందాం పద. నీతో కల్సి బ్రతకటానికి ఇష్టపడకపోతేమానె కనీసం చావులో అయినా కల్సేటందుకు ఒప్పకో" అన్నాడు.

అంతే. ఆ మాట శ్రావణి గుండెల్ని చీల్చుకుని వెళ్ళి ఒక్కసారిగా ఆమె మనసుని కదిపింది. అతని ప్రేమానురాగాలకి ఆమె కళ్లు వర్షించాయి.

అప్పటివరకు మనసులోవున్న శంకలన్నీ దూదిపింజల్లాగా ఎగిరిపోయినాయి. "నీ గత

# శ్రావణి

చరిత్ర ఎలాటిదైనా సరే నువ్వు నాకు కావాలి" అన్న శ్రీహరి మాటలు పదేపదే ఆమె మనసులో ప్రతిధ్వనించసాగాయి. ఆమె శరీరంలోని అణువణువు అతని ప్రేమతో నిండిపోయింది.

"నన్ను క్షమించండి. మీ మనసుని కష్టపెట్టాను. ఎందుకండి నీనంటే మీకింత ప్రేమ. ఎవరేమన్నాసరే అన్నిటికి ఎదురునిల్చి మీకోసం మీ ప్రేమకోసం వస్తానండి" అని భోరున ఏడుస్తూ శ్రీహరి కాళ్ళకు చుట్టుకుపోయింది.

నీళ్ళు నిండిన కళ్ళతో భార్యను లేవనెత్తి ఆర్తిగా గుండెలకు హత్తుకుని తృప్తిగా కళ్ళు మూసుకున్నాడు.

సంతోషంగా చూశారు కైలాష్, ప్రమీల.

## 53

కూతురు కాపురం కుదుట పడ్డందుకు ఎంతో ఆనందంగా వున్నారు శ్రావణి తల్లి—తండ్రి.

"నా మాట నిలబెట్టుకున్నట్లేనా?" అంది ప్రమీల చిరునవ్వుతో.

"ప్రమీలక్కా! నువ్వే లేకపోతే ఈ రోజు నేనంటూ వుండేదాన్నే కాదు. మీకు నా కృతజ్ఞతలు చెప్పకునేందుకు మాటలు దొరకటంలేదు" అని కన్నీళ్ళతో ఇద్దరికీ నమస్కరించింది.

"చూడమ్మా నీ కింక అన్నయ్యల్లేని కొరత నేను భర్తీ చేస్తాను. అమ్మా, నాన్నల ఇల్లేకాదు పుట్టిల్లు, ఇక్కడ కూడా ఒకపుట్టిల్లు వుందని గుర్తుంచుకో" అన్నాడు ఆప్యాయంగా కైలాష్.

"అయితే ఈ ఇంటికి కూడా, నేను అల్లుడ్ని అన్నమాట" అని నవ్వి "ఏరా, మామా?" అన్నాడు శ్రీహరి హాస్యంగా.

"మామ, కాదురా బావని" అన్నాడు.

అందరూ వుల్లాసంగా వున్నా శ్రావణి అంతరంగంలో ఏదో తెలియని బాధగానే వుంది. ఎంత ఆనందంగావుండాలని ప్రయత్నించినా ఆబాధ కొట్టొచ్చినట్లుగా కన్పడుతోందామె ముఖంలో. మాటిమాటికి కళ్లు తుడుచుకుంటూనే వుంది అవి ఆనందభాష్పాలని మిగిలినవారు అనుకున్నా ప్రమీల మాత్రం ఆమె బాధ అర్థం చేసుకుంది. అందుకే మనసులోని మాట బయట పెట్టింది.

"నా ఫ్రెండు డాక్టరు ఒకామె వుంది. మొదటిసారిగా శ్రావణిని తీసుకెళ్లినపుడు పరీక్షించిన ఆవిడ " రీకెనలైజేషన్ " చేస్తే తప్పకుండా పిల్లలు పుట్టే అవకాశం వుందని చెప్పింది. అప్పుడే చేస్తానంది కూడా. కానీ ఈ సమస్య పరిష్కారమయ్యేదాకా నేనే ఆగమన్నాను. మీ అభిప్రాయం కూడా తెల్సుకుని " అంది ప్రమీల శ్రీహరి వైపు చూస్తూ.

"చెల్లాయి, ఎంత డబ్బయినా సరే ఆ ఏర్పాట్లేవో త్వరగా చూడు ఎవ్వరికి రాని ఆలోచన నీకు రావటం మా అదృష్టమమ్మా. నిజంగా నిన్నేవిధంగా అభినందించాలో నాకు తెలియటంలేదు; మరి మాటలు కూడా చాలవమ్మా. నీలాటి చెల్లెల్ని పొందిన ఈ అన్నయ్య అందరికన్నా అదృష్టవంతుడు."

"ఒరేయి బావా! పొగడ్తలన్నీ మీ చెల్లెలికే ఇవ్వకురా దాంట్లో సగభాగం నాకుకూడా" అన్నాడు కైలాష్.

"చెల్లాయి కోసం అన్న కష్టపడితే ఎవరికట గొప్ప" అని 'అంతేనా శ్రావణీ' అన్నట్లుగా చూసింది ప్రమీల.

"మీరు మనుషులు కాదక్కా నా పాలిటి దేముళ్ళు" అంది శ్రావణి.

"ఆ మాటా నిజమే చెల్లాయి, కాపురం బాగుచెయ్యటానికి పునాదిరాయి మా ఆవిడయితే, తర్వాత టాపు లేపింది మనం" అన్నాడు గర్వంగా కైలాష్.

అందరూ పకాలున నవ్వారు.

"నాదొక చిన్నకోరిక శ్రావణి" అంది ప్రమీల గంభీరంగా.

"నేను నోరు తెరిచి అడగకముందే నా కోర్కెలన్నీ తీర్చినదానవు నీకేం కోర్కెలున్నాయి" అంది ఆశ్చర్యంగా శ్రావణి.

"తీరుస్తావా? లేదా?" అంది ప్రమీల.

"నీవు ఏమడిగినాసరే కాదనను సరేనా?" అంది ఏమాత్రం తొణకక.

కైలాష్ కూడా భార్య ఏమడుగుతుందా? అని చూస్తున్నాడు.

"అయితే విను! నీ కథను నేను నవలగా రాసుకుంటాను. అలా అయితే నువ్వు నా మనసులో శాశ్వతంగా నిల్చిపోయే అవకాశం వుంటుంది. అంతేకాదు అది చదివేటప్పుడు పురుషుల్లో కూడా ఇంతటి సంస్కారవంతులు, ఆదర్శమూర్తులు వున్నారని పురుష జాతే కాకుండా, స్త్రీజాతి కూడా గర్వించేటట్లుగా రాస్తాను. మా అన్నయ్య శ్రీహరి అజ్ఞాతంగా అందరి మనసుల్లో మెదులుతూ వుంటాడు" అంది ప్రమీల.

"ఆరిపోయిన మా ఇంటి దీపాన్ని వెల్గించిన జ్యోతివమ్మా నువ్వు. ఆడపడుచుగా కోరిన ఈ చిన్నపాటి కోర్కెను తీర్చలేనంతటి అసమర్థుడు కాడీ అన్నయ్య. నీ ఇష్టం మేము ఎప్పుడు కాదనము." అన్నాడు శ్రీహరి శ్రావణి వైపు చూస్తూ. శ్రావణి కూడా ఇష్టంగా చూసింది.

"అయితే శ్రీమతి గారికి కొత్త నవలకి ప్లాట్ దొరికిందంటే కొన్నాళ్లపాటు మనకి..." అన్నాడు కొంటెగా చూస్తూ కైలాష్.

"అన్నీ పూర్తయినా శ్రీమతి ఇంటికి వచ్చేదాకా నాపనికూడా అంతేరా బావా" అన్నాడు నీరసంగా శ్రీహరి.

వాళ్ల మాటలకు పక్కున నవ్వారు ప్రమీలా, శ్రావణి.

## ఇ'వేమన' పద్యాలు






మగని బలిమి గలుగ మగువకును బలిమె
బలములేని మగడు పనికిరాడు
పనికిరాని మగని బాటించి చూడరు
విశ్వదాభిరామ వినురవేమ

**54**

బెడ్‌లైటు ముందు కూర్చుని నిశ్చల దీక్షతో పుస్తకం చదువుతోందా వ్యక్తి. పూర్తిగా అందులో, నిమగ్నురాలయిపోయింది. కళ్లనిండుగా నీళ్లు ధారాపాతంగా కారుతూ చెంపల అంచుల నుండి కిందికి జారుతున్నాయి. ఆ కన్నీటి మధ్య అక్షరాలు అస్పష్టంగా కన్పడుతున్నాయి. కానీ ఆమె చేతులు పుస్తకాన్ని వీడలేదు. పూర్తిగా పుస్తకంలో లీనమయిపోయినందువల్ల ఆమె చెవులకు గుక్కపట్టి ఏడుస్తున్న పిల్లవాడి ఏడుపు ఏమాత్రం సోకలేదు.

ఒళ్ళెరగని నిద్రలో వున్న శ్రీహరికి చటుక్కున మెలకువ వచ్చి పక్కన చూశాడు. ఊహూఁ భార్య లేదు. ఏడుస్తున్న పసివాడ్ని సముదాయించాలని ప్రయత్నించాడు. కానీ అతని వల్ల కాలేదు. వాడ్ని ఎత్తుకునే పక్కరూమ్‌లోకి నడిచాడు.

శ్రావణి మాత్రం కదలలేదు.

మృదువుగా తట్టి "చూడు బాబెలా గుక్కపట్టి ఏడుస్తున్నాడో" అన్నాడు.

ఒక్కసారిగా ఉలిక్కిపడిన శ్రావణి కంగారుగాలేచి పుస్తకం టేబులుపై పెట్టి కన్నీళ్లు తుడుచుకుని పాలు కలపటానికి పరుగెత్తింది.

ఆ పుస్తకాన్ని చేతిలోకి తీసుకుని చూశాడు శ్రీహరి.

పుస్తకం బాగా నలిగిపోయి కొసలు చినిగిపోయినాయి. అందమైన జంట వున్న ముఖచిత్రంతో పైన ( ) బై కే. ప్రమీలా కైలాష్. అని వుంది.

అప్పటికి శ్రావణి ఆ పుస్తకాన్ని ఎన్నిమార్లో చదివిందనటానికి గుర్తుగా ప్రత్యక్షసాక్షి నలిగిన ఆ పుస్తకమే.

కాసేపటికి బాబుకి పాలుపట్టి వాడ్ని పడుకోపెట్టి మరీ వచ్చింది శ్రావణి.

"ఇప్పుడు టయిము ఎంతయిందో తెలుసా? ఇలా రాత్రిళ్ళు చదవవద్దని నీ కెన్నిసార్లు చెప్పాను. అసలు ఎన్నిసార్లు చదివితే నీకు తృప్తి కల్గుతుంది" ప్రేమగానే మందలించాడు భార్యను.

"ఎన్నిసార్లు చదివినా తృప్తి వుండదండి. ఉన్నా అది తాత్కాలికం మాత్రమే. అసలా పుస్తకం పుచ్చుకున్నానంటే నాకు పరిసరాలే గుర్తుండవు. అది చదివినప్పుడల్లా నాకు ప్రమీలక్కే గుర్తుకు వస్తుందండి. నాకోసం కాదు నేను చదివేది. ఆమె కోసం" అంది భారంగా.

"చూడు శ్రావణి! గాయం చేసిన గతాన్ని మర్చిపోవటానికి ప్రయత్నించాలికానీ అనుక్షణం గుర్తుతెచ్చుకోకూడదు. అలా గుర్తుకు తెచ్చుకుంటే మిగిలేది బాధ మాత్రమే. ఈ పుస్తకం చదివినప్పుడల్లా నువ్వు మానసికంగా పడే ఆవేదన నాకు తెలుసు. అందుకే ఇకనుంచీ ఒక నిర్ణయానికి వచ్చాను. రోజుకి ఒకేసారి నీకా ఛాన్సు ఇస్తున్నాను. ఆ పుస్తకం ధ్యాసలోపడి నన్ను, నేను కోరి కోరి కన్న నా బంగారు కొడుకుని నువ్వు అలక్ష్యం చేస్తున్నావు" అన్నాడు చిరుకోపంగా.

"అమ్మో! ఒక్కసారా?" అంది దిగులుగా.

"అవును, ఒక్కసారే. గతాన్ని నువ్వు మర్చిపోవాలంటే అంతే. నీకు కాలక్షేపానికి నేనున్నాను. మన బంగారుకొండ వున్నాడు. ఏరా బాబు అమ్మతో మనల్ని బాగా చూసుకొమ్మని నువ్వుకూడా చెప్పరా" అని కొడుకు బుగ్గ ముద్దుగా నిమిరాడు.

సమాధానంగా పసివాడు నిద్రలోనే నవ్వాడు.

"సరల కొంచెం వుండండి పూర్తిచేసి వస్తాను" అంది వెళ్ళపోతూ.

"పర్మిషన్ నాట్ బి, గ్రాంటెడ్ శ్రీమతీ. చెప్పానుగా ఈరోజు కోటా పూర్తయింది. మరి నా కోటా మాత్రం మిగిలివుంది" అన్నాడు కొంటెగా కన్ను గీటుతూ పుస్తకం తలగడ కింద వుంచుతూ.

"రోజుకి మీకు ఎన్నికోటాలే! నాకు తెలియక అడుగుతున్నాను" అంది బుగ్గన చెయ్యి పెట్టుకుని.

"ఎన్నయినాసరే నా ఇష్టంపై ఆధారపడి వుంటుంది. మాటలతో టైమ్ వేస్టుచెయ్యకు" అని భార్యను దగ్గరకు తీసుకుని బెడ్‌రూమ్ చీకటి చేశాడు.

సిగ్గుపడ్డ చీకటి మరింత సిగ్గుగా నవ్వుకుంది ఆ దంపతుల్ని చూసి.

**[అయిపోయింది]** ●



నూతన యవ్వనం పొందండి! సంతాన వంతులు కండి. చర్మ వ్యాధులనుండి విముక్తులు కండి. హస్త ప్రయోగమువలన కలుగు నరముల బలహీనత, శీఘ్ర స్ఖలనము, అంగము చిన్నదగుట, అవసర కాలమందు అసంతృప్తి, సంతానము లేక పోవుట, సమస్త చర్మవ్యాధులకు అద్భుత చికిత్స! పోస్టు ద్వారా చికిత్స కలదు.

**"క్యాంపులు"**: ప్రతి ఆదివారం **'భీమవరం'** షణ్ముఖ లాడ్జిలో ఉదయం 8 గం. నుండి సాయంత్రం 6-30 గం. వరకు. ప్రతి నెల 1 మరియు 16 తేదీలలో **'రాజమండ్రి'** హోటల్ అప్సరలో మధ్యాహ్నం 12 గం. నుండి రాత్రి 9 గం. వరకు.

## డా॥ డి. మార్కండేయులు

**ఆయుర్వేద భిషక్, సెక్స్ & స్కిన్ స్పెషలిస్ట్,**

**పార్కురోడ్, గుడివాడ - 521301**

ఫోన్స్ : **522 & 540**

---

ఆపరేషను, ఇతర వైద్య చికిత్సలతో నిరాశచెందిన సోదర, సోదరీ మణులు అనేకులు మా సలహాలచే సంతానవంతులయి ఇచ్చిన యోగ్యతాపత్రములు గలవు. స్త్రీ, పురుష వంధ్యాదోష నివారణా నిపుణులు.

మీకు బేబీ/బాబు కావాలా



వివరములు ఉచితం

పోస్టు ద్వారా చికిత్స గలదు.. ఈ మాస ములో స్వయముగా సంప్రదించుటకు

— తెనాలి —

| | |
|---|---|
| గురువారం<br>ఆదివారం | మధ్యాహ్నం.. గం. 12-00 నుండి<br>సాయంత్రం.. గం. 5-00 వరకు |

— విజయవాడ —

| | |
|---|---|
| మంగళవారం<br>బుధవారం<br>శనివారం | మధ్యాహ్నం.. గం. 12-00 నుండి<br>సాయంత్రం.. గం. 5-00 వరకు |

## శ్రీ నాగార్జున మూలికా కుటీరం

రైల్వే స్టేషన్ వద్ద., రామాలయం వీధి, తెనాలి. 522 202.. * 2వ లైను, కేదారేశ్వరపేట, విజయవాడ. 520 003..

---

**తాజా వార్తలకు**

**నిజమైన వార్తలకి**

**న్యాయమైన**

**వ్యాఖ్యలకి**

# ఆంధ్రపత్రిక

**చదవండి!**

---




---

**మీరు కుట్టుపని నేర్వండి!**



వేలాది మందికి నేర్పితిని. ప్రజలు, పత్రికా ప్రశంస లందిన నా పుస్తకాల్తో అనేకులు నేర్చిరి. శ్లాకు, షర్టు, ప్యాంటు, జాకెట్లతో 35 రకాలు కత్తిరించి కుట్టేది. 300 చిత్రాలు రు. 40. వేలాది బొమ్మల్తో 365 కటింగ్ ప్లాన్లు రు. 40. ప్రభుత్వం వారామోదించిన 2 తెలుగుపోస్టేజీ రు.8 పంపండి.

జి. పున్నారావు చౌదరి,

మోపర్రు, తెనాలి తాలూకా—522312.

# ప్రెస్టీజ్

# ప్రెషర్ పాన్

## దీనితో వండిన భోజనం తింటే ఎంత సంతృప్తికలుగుతుందో
## దీనితో వండడం కూడా అంత సంతృప్తికరంగాను వుంటుంది!



వేపుడు



హెచ్చు వేపుడు



సాచ్



ప్రెషర్ కుక్



బిర్యానీని చాకచక్యంతో వండండి. లేదా గ్రుడ్డును వేగంగా వేపండి. లేదా పూరీని చక్కగా-పొంగించండి. మరి కూరను చకచక తయారుచేయండి. అన్నీ నిమిషాలమీద. ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ అంతటి బహుళ ప్రయోజనకారి అన్నమాట. అది అంత వాటంగా, వసతిగా వుంటుంది. దీనిలో మీరు వేపుడు, హెచ్చు వేపుడు, దోరవేపుడు మరియు ప్రెషర్ కుకింగ్ చేయవచ్చు.

ఒక్క ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మాత్రమే నూటికి నూరు పాళ్ళ భద్రతను సమకూర్చగల అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టంను కలిగియున్నది.

ఇప్పటికే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ మీవద్ద వుండివుంటే, మూత లేకుండా దీనిని కొని ఎక్కువగా సొమ్ము ఆదాచేసుకోండి. లేదా సొంత మూత కలదానిని కొనండి. ఈ ప్రెషర్ పాన్ మీకోసమే మరి.

Prestige
PRESSURE
PAN

ttk తయారి.

MAA(S) PP 1B TEL 84

# న్యూ ఢిల్లీ లేఖ....

( 5 వ పేజీ తరువాయి)

ప్రణబ్ ముఖర్జీ ఒక మెరికలాంటి ఆర్థిక మంత్రి కాక పోవచ్చు కాని ఆయన కూడా అశోక్ మిత్రాలాగే జ్యోతిబాసులాగే బెంగాలీ కదా? తమ రాష్ట్రానికి తగిన చేయూత ఇవ్వరా ముఖర్జీ? ఒక రాష్ట్రం బాగు పడాలంటే కేంద్రం ధర్మం చెయ్యాలన్న వాదం సరయినది కాదు ఈ వాదాలలో నిజం లేదు. హర్యానా తీసుకోండి ఈ రాష్ట్రంలో కేంద్రం నెల-కొల్పిన పెద్ద ప్రాజెక్టు ఏమి ఉంది? పశ్చిమ బెంగాల్‌లో ఎన్నయినా ఉన్నాయి (దామోదర్ లోయ ప్రాజెక్టు ఇప్పుడు బీహారు, బెంగాలు రాష్ట్రాలు రెండిం టిదీ అయినా దానిని ముందు బెంగాలులోనే మొదలు పెట్టారు హర్యానాలో దా లో ప్రా లేదు. చిత్త రంజన్‌లోకో కర్మాగారమూ లేదు అయితేనేమి హర్యానాలో కార్మికుల తలసరి ఉత్పత్తి పశ్చిమ బెంగాల్ కార్మికుల తలసరి ఉత్పత్తి కన్నా 30 శాతం ఎక్కుగా ఉంటోంది. ఈ వ్యత్యాసం రోజు రోజుకీ పెరుగుతోంది)

అభివృద్ధి లోపలి నుంచి రావాలి, బయటి నుంచి ఇచ్చే ధర్మం వల్ల కాదు అందుకనే (ఉదాహరణకి) జపాన్ సాధించినంత అభివృద్ధి భారత ం సాధించలేకపోతోంది జపాన్‌కి భారత దేశానికి ఉన్నట్టు సహజ సంపద అంతగాలేదు ఉన్న సహజ సంపద ఏమిటంటే అక్కడి జనంలో ఉన్న క్రమశిక్షణ, అభివృద్ధి కోసం జనంలో సహజంగా ఉండే చాక-చక్యాన్ని వాడాలనే పట్టుదల ఒక సమాజం యొక్క వనరుభలో అతి ముఖ్యమయినది ఆ సమాజంలోనే దాగి ఉంటుందన్న సంగతి అశోక్‌మిత్రాకి తెలిసే ఉండాలి తెలియకపోతే ఆయన తెలుసుకోవటం మంచిది ప్రభుత్వం లేదా రాజ్యం ఈ సంపదయొక్క వినియోగానికి దోహదాలు కల్పించాలి అదే వారి కర్తవ్యం

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో. జపాన్‌లో ప్రభుత్వాలు చేసే పని ఇదే.

మనుష్యులకి కొంత స్వేచ్ఛ ఇస్తే వాళ్ళు తమకి, తమ తోటి వారికీ పనికి వచ్చే విధంగా కృషి చేస్తారు

వాళ్ళని ఏడి వాదపు గొలుసులతో కొట్టండి. జీవితాంతం బానిసలుగా ఉండిపోతారు

కోట్ళు కావాలంటే బానిసలు బాగా పనికి వస్తారు కాని, జీవితంలో అతి ముఖ్యమయిన అభివృద్ధి-ప్రగతీ- సంపదా కావాలంటే బానిసలు పనికిరారు మానవుడి భావనాశక్తి చాలా గొప్పది 'ఏది సాధ్యమో, ఏది కాదో నిర్ణయించగలిగింది ఇదే కాని ఇంకేదీ కాదు □

# భలే బేరం!

ఒక అందమైన
స్టీలు గిన్నె కేవలం
రూ.2.25లకు



ఈ
విధమైన
3
సబ్బులతో






ACIL/0838/84-Tel

సూపర్ పవర్

# రీగల్

మురికిని నిర్మూలిస్తుంది
బట్టలను కాపాడుతుంది




షా వాలెస్ వారి
విశిష్ట ఉత్పాదన

సూపర్ పవర్ రీగల్ బహుమతి లేకుండాను లభించును

# ఎప్పుడు ఏమవుతుందో చెప్పటం కష్టం!

ఇటీవలే శ్రీ జయదుబాషీగారు ఒక చక్కటి ఊహా కల్పన చేసారు! రాష్ట్రపతి జ్ఞానీ జెయిల్‌సింగ్ కూడా గవర్నరు శ్రీ రామ్‌లాల్ లాగే అసమ్మతి వాది శ్రీ చవాన్‌ని "ప్రోత్సహించి" ప్రధాన మంత్రి శ్రీమతి గాంధీని బర్తరఫ్ చేస్తే చివరికి ఆమె వర్గం వారు (అని సూచన) స్విట్జర్లాండ్ వెళ్ళిపోయి అక్కడ ఒక బ్యాంక్ పెట్టుకున్నట్లు ఆయన ఊహించారు.

శ్రీ దుబాషిగారు రాష్ట్రీయ స్వయం సేవక సంఘం తాలూకు వారని తెలుస్తూనే ఉంది. ఈ సంస్థ వారు కొందరు శ్రీమతి గాంధీతో స్నేహంగానే ఉంటారని వింటాము. ఎమర్జెన్సీని "బలపరుస్తూ" శ్రీ దేవరస్‌గారు అప్పటిలో శ్రీమతి గాంధికి రాశారట. అయినా సరే, రా. స్వ. సే. సం.తో సన్నిహిత సంబంధం కల భారతీయ జనతాపార్టీ వారు మాత్రం శ్రీమతి గాంధీని తలచుకొని ద్వేషంతో దహించుకు పోతూవుంటారని అనుకోక తప్పటంలేదు.

జనతావారు కేంద్రంలో అధికారంలోకి వచ్చినప్పుడు "స్టేట్స్‌మన్" పత్రికలో ఒక వార్త పడింది. ఆ వార్తతో బాటు ఒక "పత్రం" యొక్క ఫోటో కూడా పడింది. కీ. శే. సంజయ్‌గాంధికి కాబోలు స్విట్జర్లాండ్‌లో రహస్యంగా బాంకు ఎకవుంటు వున్నదన్న ఆరోపణని బలపరిచే వార్త ఇది. ఇదిపడిన అనతి కాలంలోనే ఆ వార్త పత్రం అసత్యాల మీద ఆధారపడినవని తేలిపోయింది. వాటిని ప్రచురించినవారు శ్రీమతి గాంధికి ఏ విధంగా తమ పశ్చాత్తాపాన్ని తెలుపుకున్నారో నాకు గుర్తు రావటంలేదు కానీ శ్రీ దుబాషీగారు చేసిన సూచన ఈ ఉదంతాల్ని జ్ఞాపకం తెప్పించింది.

నేడు భారతీయ జనతా పార్టీగా చెలామణి అవుతున్న రాజకీయ వర్గం యొక్క చరిత్ర సుదీర్ఘమయినది కాదు. అది జనసంఘంగా ఉన్నప్పుడు దానిలో నుంచి శ్రీ బాలరాజ మధోక్‌గారు విడిపోయారు. ఇటీవలి కాలంలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామిగారు కూడా విడిపోయారు. అంటే, ఈ పార్టీ కూడా చీలికల ప్రమాదానికి అతీతం కాదని ఎవరయినా నిర్భయంగా చెప్తే నమ్మవచ్చున్న మాట.!

ఇక భా.జ.పా "గుణా"లని గురించి ఆలోచించి చూస్తే అది ఎక్కువగా (1) "అగ్ర" వర్ణాలుగా వర్ణించబడే వారిదిగానూ (2) "మహమ్మదీయుల సమస్య"లుండే చోట్ల ఒకప్పుడు బలం కలిగిందిగానూ (3) మొత్తం మీద హిందీ ప్రాంతపు రాజకీయ పక్షంగానూ పరిగణింపబడుతోందని అనవచ్చు.

ఐతే ఈ "గుణా"లలో కూడా మార్పులు కొన్ని వస్తున్నాయి. జమ్మూ కాశ్మీరులోనూ, ఢిల్లీలోను భా.జ.పా. బాగా ఓడిపోయింది. (రా.స్వ.సం. స్వంత రాష్ట్రం అనతగిన మహారాష్ట్రలో భా.జ.పా. ఎప్పుడూ బలంగాలేదు.) ఈ పరిణామాల ఫలితంగానే కావచ్చు శ్రీ వాజపేయీగారు ఆశ్చర్యం వినోదం కలిగించే విధంగా చలన చిత్ర నటులూ, తెలుగుదేశం స్థాపకులూ అయిన శ్రీ రామారావుగారిని ఆశ్రయిస్తున్నారు. ఆయన శ్రీ చరణ్‌సింగ్‌గారిని కూడా ఆశ్రయిస్తున్నారు. అది వేరే సంగతి. 1979లో జనతా ప్రభుత్వాన్ని పడగొట్టింది ఈయనే (శ్రీ సింగ్‌గారే) ఇవాళ భాస్కరరావుగారు ఏ పనయితే చేశారని ఆయనని తిడుతున్నారో అదే పనిని లేదా అలాంటి పనిని శ్రీ సింగ్‌గారు చేశారు. అప్పుడు శ్రీ సంజీవరెడ్డిగారు కూడా ఇప్పుడు శ్రీ రామ్‌లాల్‌గారిలాగే వ్యవహరించారని ఎందరు (ఇప్పుడు) అనడంలేదు?

తప్పులిన్నువారు తమ తప్పు లెరుగుదురు కాని వాటిని గురించి మాట్లాడరు!

కాంగ్రెస్(ఐ) వారి అవినీతని గురించి గోలపెట్టేవారు మధ్యప్రదేశ్ మాజీముఖ్యమంత్రి శ్రీ సక్లేచాగారి సంగతి ఎత్తారు.

కీ.శే. భింద్రన్‌వాలేగారు ఒక కాంగ్రెసు(ఐ) సృష్టి అనే వారు శ్రీ జఠ్‌మలానిగారు ఈ మధ్యనే శ్రీ లోంగోవాల్‌గారి తరఫున వకాల్తా పుచ్చుకున్నారన్న విషయాన్ని గురించి చెప్పరు. ("మీ వకాల్తా అక్కరలే"దని శ్రీ లోంగోవాల్‌గారు అన్నారు!)

ఉపరాష్ట్రపతిగా శ్రీ హిదయతుల్లాగారినే మళ్ళీ ఎన్నుకోవాలని భా.జ.పా వారు సూచించినట్లు చెప్పబడింది. దీని అర్థం ఏమిటో ?

విశాఖపట్నం జిల్లాపరిషత్ అధ్యక్షుడు శ్రీ ద్రోణంరాజు సత్యనారాయణగారిని కాంగ్రెసు(ఐ) అసమ్మతివాదుల సహకారంతో పడగొట్టాలని ప్రతిపాదించినవారు భా.జ.పా.చెందిన శ్రీ చలపతిరావుగారు. ముఖ్యమంత్రి శ్రీ రామారావు జి.ప.లలో సభ్యులను "నామినేట్" చెయ్యటం శోచనీయం అని ఆ సందర్భంలోనే అన్నవారు ఈయనే.

1948 జనవరి ఆఖరులో ఢిల్లీలో ఏమి జరిగిందో అందరికి తెలుసు. అప్పుడు ఎవరు మిఠాయి పంచారో కూడా ఇంకా కొందరికి జ్ఞాపకం లేకపోలేదు. అలాంటివారే కొందరు ఇవాళ గాంధీ "జీ" అని తమ గౌరవభావాన్ని చాటుకుంటున్నారు. మిఠాయి పంచటం తప్పు అని నేను అనటంలేదు– శ్రుతి-మార్చి పాడటం ఎబ్బెట్టుగా ఉందని మాత్రం అనుకుంటున్నాను. ఇంకొక రాజకీయ పక్షానికి చెందినవారు సయితం గాంధిగారిని తిట్టారు. పండిత నెహ్రూగారిని సామ్రాజ్యవాదుల వేటకుక్కగా వర్ణించారు. 1937లో హిట్లరుగారిని ప్రశంసించి 1942లో బ్రిటిషువారితో చేతులు కలిపారు. ఇదంతా జరిగిన రెండు దశాబ్దాలలోనే వారే పరమ గాంధేయులుగా మారిపోయారు. పండిత నెహ్రూగారి సంరక్షకులుగా అయ్యారు.

కొన్ని వారాల క్రిందట హైదరాబాదులో శ్రీయుతులు వాజపేయి, డా.ఫరూక్‌అబ్దుల్లా, కామ్రేడ్ బసవపున్నయ్యగారలు తీసుకువచ్చిన సంచలనం శ్రీ రామ్‌లాల్‌గారి ఉద్యోగం ఊడటానికి కారణం అయి ఉండవచ్చు. శ్రీమతి గాంధిగారు భయపడిపోయి శ్రీ రామారావుగారిని మళ్ళీ ముఖ్యమంత్రి కుర్చీలో కూర్చోపెట్టి ఉండవచ్చు; కాని, విజయం ఎవరిదయినా అయితే అది శ్రీ రామారావుగారిదే కాని ఆయన పక్షాన గొంతు చించుకొని కలువేసిన శ్రీయుతులు వాజపేయి, వెంకయ్యనాయుడుగార్లదిగాదు. నేటి భారత కమ్యూనిస్టు పార్టీకి చెందిన కొందరు ఒకప్పుడు ఈలాగే పం.నెహ్రూగారిని, శ్రీమతిగాంధినీ పెట్టుబడిదారుల బారినుండి తప్పిస్తున్నట్టు మాట్లాడేవారు. ఒకసారి శ్రీమతి అరుణా అసఫ్ అలీగారు తమ వల్లనే (అంటే తమ వర్గం వల్లనే) దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని అనగా సర్దార్ పటేల్‌గారు "బండి కింద కుక్క"ని గురించి చెప్పారట. భా.జ.పా. వారు ఆంధ్రప్రదేశ్‌లోని తమ స్వంత శక్తి మీద ఎన్ని స్థానాలు గెలవగలరు? త్వరలో శాసన సభ ఎన్నికలు రాబోతున్నాయని అంటున్నారు. వాటిల్లో శ్రీ రామారావుగారు గెలవడం ఖాయం. ఆ గెలుపులో వాటాకోసం శ్రీ వాజపేయిగారు తాపత్రయ పడడంలో ఆశ్చర్యం లేదు. (తమిళనాడులో శ్రీమతి గాంధీగారు ఈ విధంగానే శ్రీ రామచంద్రన్‌గారి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడుతున్నారు).

శ్రీ జయదుబాషీగారి కల్పనలో శ్రీమతి గాంధీగారు స్విట్జర్లాండ్ వెళ్ళి బాంకు పెట్టుకున్నారు. రాజకీయాలలో ఎప్పుడు ఏమవుతుంతో చెప్పటం కష్టం- విధి వక్రిస్తే శ్రీ వాజపేయిగారు హైదరాబాద్‌కి మారిపోయి చలన చిత్ర పరిశ్రమలోకి దిగినా దిగవచ్చు. అన్నల సంఖ్య పెరిగినా పెరగవచ్చు.

—ఒక తమ్ముడు □

# హైదరాబాదు నోట్‌బుక్

## చెరువుమీద అలిగి....

ఇటీవల కొందరు కళా కారులకు తెలుగునాడుపై కోపం వచ్చింది. పైవాళ్ళు పిలిస్తేగాని తెలుగుగడ్డపై అడుగు మోపం, కోరితేగాని కచ్చేరీలు చేయం-అంటూ అలకలు పోయారు. కవులు,కళాకారులు అనుకుంటున్న వారెవ్వరూ, ఎప్పుడూ మన దేశంలో అగ్రశేణిలో నిలబడి ప్రజలకు నాయకత్వం వహించినట్టు, ప్రజా సందోహాన్ని నడిపించినట్టు చరిత్ర చెప్పడంలేదు. కళాకారులు ఎప్పుడూ రెండవ వరసలోనే ఉన్నారు. ఇతర దేశాల సంగతి తెలియదుగాని మనదేశం వరకు ఇది నిజం. కనుక ఆ మాటల కెవ్వరూ విలువనివ్వనక్కరలేదు. తత్వవేత్త, ప్రజా సేవకుడు, సంఘ సేవకుడు జనాన్ని ముందుకు నడిపారు, కవి, తదితర కళాకారులు వారికి వంత పాడారు. అంతే, తత్వవేత్తలూ, సంఘ సేవకులు ప్రజా నాయకులు, రచయితలు కావచ్చు; వారికిరచన తమ లక్ష్య సాధనకు ఉపకరణం మాత్రమే. అంగీర సోమహరి నిప్పును వాడడాన్ని సంఘానికి తెలిపాడు. సంఘం కొన్ని వేల సంవత్సరాలు ముందుకు పోయింది. మధుచ్ఛందుడు ఆ పనిని అగ్ని మీదే పురోహితం, యజ్ఞస్య దేవమృత్విజం, హోతారం రత్నదాతమం- అని గొంతెత్తి శ్లాఘించాడు. అది వేదానికి తొలి ఋక్కయింది. సూర్యాదేవి ప్రేమకు ప్రాధాన్యమిచ్చి సవితను వెదుక్కుంటూ వెళ్ళి వరించింది. దా ని దేవతలు సుమంగళీరియం వధూరిమాం అ స్తుతించారు. రాముడు గొప్ప పనులు చేశాడు. వాల్మీకి రామయణం కీర్తించాడు. వాల్మీకి చెప్పినట్టు రాముడు చేయలేదు. మహా తత్వవేత్త అయిన కృష్ణుడు యుద్ధ రంగంలోనూ, జీవిత యద్ధ రంగంలోనూ జాతి నిలువదొక్కుకొనే గీతాలు ఆలపించాడు. వ్యాసుడు వాటిని రికార్డు చేశాడు. అహింసా తత్వాన్ని దర్శించిన సుగతుడు భారత జాతికి నూతన సందేశ మిచ్చారు. కవులు, కళాకారులు దానిని కావ్యాలుగా, నాటికలుగా, శిల్పాలుగా తీర్చారు. చంద్రగుప్త, స్కంద గుప్తులు దేశాన్ని జయించి భారతీయ ధర్మాన్ని పునః ప్రతిష్ఠించారు. దానిని కాళిదాసు రఘువంశంగా, కమార సంభవంగా, నాటకాలుగా విస్తరింప జేశాడు. ద్రష్ట అయిన విద్యారణ్యుడు హక్కబుక్కలను- బలవంతంగా మతాంతరులైన వారిని- శుద్ధి చేసి వేదమత పునః ప్రతిష్ఠకు వదిలారు. కవులు కో కొల్లలుగా వారిని ఆశ్రయించారు. మన దేశంలో పద్యాలు, పాటలు అల్లుకొనే ఏకవీ, పాటలు పాడుకొనే ఏ గాయకుడూ, రంగులు పూసే ఏ చిత్ర కారుడూ సంఘానికి నాయకత్వం వహించి ముందుకు తీసుకొని వెళ్ళిన దాఖలాలు లేవు. 'ఎప్పుడూ' వంత పాటలోనే ఉన్నారు. తత్వ వేత్తలు, ఋషులు, ఆచార్యులు, భక్తులు నూతన మతాలు ప్రవర్తింపజేసి ప్రజలను నడిపించారు. చివరకు ఇటీవల గాంధీజీ వంటి మహా క్రాంతదర్శి దేశాన్ని మహా సంగ్రామానికి నడిపారే గాని, కవులెవ్వరుగాని, కళాకారులెవ్వరుగాని నడపలేదు. మీదు మిక్కిలి జనగణమనలు పాడారు. అలాటప్పుడు కవులు, గాయకులు అలుకచూపడం చెరువుపై అలిగి వెళ్ళి పోయినవారి సామెతగా జనానికి వినోదం కలిగిస్తుందే కాని సానుభూతి కాని, ఆదరంగాని కలిగించదు. ప్రజా బలంతో అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాలు ప్రజా వ్యతిరేకులు, ఋషిమ్మన్యులు అయిన అలాటి వారిని లెక్క పెట్టనక్కరలేదు. ఎంతటివారి మేధ అయినా, కళ అయినా ప్రజను నైతికంగా, మానసికంగా, బుద్ధికంగా, ఆధ్యాత్మికంగా పైకి తీసుకొని వెళ్ళేట్టు ఉండాలి. ఎవరు అధికారానికి వస్తే వారిని ఆరాధించే వీరు అలాటి గొప్ప పనులేమి చేశారని వారికి ప్రభుత్వం భయపడాలి? నిజమైన కళాకారులు, సర్జనశీలురు ఇలాటి పంతాలకు పోరు. అలాటి పంతాలు, పట్టుదలలు ఉన్న వారిని, వారి ఆశ్రితులు హర్షిస్తారు గాని, ప్రజలు హర్షించరు, మర్షించరు. అధికారంలో ఉన్న వారి వాద్యాలకు నర్తనం చేసే వారు ద్రష్టలా, నత ద్రష్టలుగాని. కళాతత్వం జీర్ణించినవారు తత్వవేత్తలే అయిపోతారు. అలాటివారు ఇలాటి మాటలు అనగలరా? యహూదీ మెనుహిన్ ఇలా అన్నారా? జూబిన్ మెహతా ఇలా ఆలోచించారా? వీణ శేషణ్ణ, వీణ సుబ్బన్న, వాసు దేవాచార్, టైగర్ వరదాచార్ అంతటి పాండిత్య భారంతోను సామాన్య ప్రజలకోసం ఎంత ఆరాటపడేవారు. ఒక చిన్న బాలుడు అది వాయించండి, ఇది పాడండి అని అడిగినా ఎంత వినయంతో తల ఒగ్గేవారు? ఏమైనా, ఒకొక్కప్పుడు అగ్రశేణిలో వున్నవారి బెదిరింపులకూ బెదిరిపోలేదు.- ఇక రెండవశ్రేణిలో ఉన్న వారి మాటలను పట్టించుకుంటుందా? ఎవరైనా, ఎంతటి గొప్ప వాడైనా తన హద్దు పద్దులు ఎరిగి, తనను ఋషిమ్మన్యుడిగాను, ద్రష్టమ్మన్యుడుగాను భావించుకొని మిడిసి పడక నూతన చరిత్రలు సృష్టిస్తున్న కాలానికి అనుగుణంగా నడచుకొనడం శ్రేయస్కరం. నిజం చేదుగానే కాదు, కర్ణ కఠోరంగాను ఉంటుంది.

### ఉపశ్రుతి :

పక్కింటి ముంగిట్లో పిల్లలు ఆడుకుంటున్నారు. రేపటి నుంచి బళ్ళు తెరుస్తారటరా – అన్నాడొక విద్యార్థి. ఎందుకూ?- అనడిగాడు మరొక విద్యార్థి. భాస్కరరావు అధికారం పోయిందట. ఎన్. టి. రామారావు మళ్ళీ వచ్చాట్ట. కర్ఫ్యూ పోయిందట- అన్నాడు ఇంకొక విద్యార్థి. ఇదేం బాలేదురా. కర్ఫ్యూ ఉంటేనే బావుండేది. ఎంచక్కా ఇంట్లో ఆడుకోవచ్చు- అన్నాడు ఆరేళ్ళటిక్కు (భాను కిరణ్). రాజకీయాల ప్రాభవం పిల్లల లేత మనస్సుపైనా ఇంతగా ముద్ర వేసిందే అని విస్తుపోయాను.

**— తిరుమల రామచంద్ర**

ఇటీవల గుంటూరు ఫిలిం ఆర్ట్సు అసోసియేషన్, విజయవాడ బాటిలింగ్ కంపెనీల సంయుక్త ఆధ్వర్యంలో గుంటూరులో జరిగిన అభినందన సభలో శ్రీ ఎస్. పి. బాల సుబ్రహ్మణ్యంకు "గాన కళాజలధి" బిరుదునందిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీ ఎ. చెంగప్ప.



# ముఖ్యమంత్రి సతీమణి మృతి



మన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు-గారి ధర్మపత్ని శ్రీమతి బసవ రామతారకం అక్టోబర్ నెల ఒకటవ తేదీ సాయంత్రం 6 గం. 15 ని. లకు మద్రాసులో కన్ను మూసారు. గత కొద్ది కాలంగా తొడకు సంబంధించిన కేన్సర్ వ్యాధిలో బాధపడు-తున్న శ్రీమతి తారకం వయస్సు 59 సంవత్సరాలు. అడయార్‌లోని కేన్సర్ ఇనిస్టిట్యూట్‌లో సెప్టెంబర్ 5 నుంచి ఆమె చికిత్స పొందుతున్నా ప్రయోజనం కనిపించలేదు.

గత జూలైలో ముఖ్యమంత్రి శ్రీ రామారావు గుండెకు శస్త్ర చికిత్స చేయించుకోవడానికి అమెరికా వెళ్లి-నప్పుడు శ్రీమతి బసవతారకం ఆయన వెంట వెళ్ళారు. అమెరికాలో ఈమెను పరీక్షించిన వైద్య నిపుణులు అడయార్ కేన్సర్ ఇనిస్టిట్యూట్‌లో చికిత్సను కొనసాగించవలసిందనిసలహా ఇచ్చినట్లు తెలుస్తోంది. ఆగస్టు 14న స్వదేశానికి మరలి వచ్చాక డాక్టర్ల సలహా మేరకు శ్రీమతి తారకం అడయార్ ఇనిస్టిట్యూట్‌లో చికిత్స నిమిత్తం అడ్మిట్ అయ్యారు. అయితే ఆమె పరిస్థితి మెరుగు కాలేక పోయింది.

ఈలోగా శ్రీ రామారావు పదవీచ్యుతులు కావడంతో ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం నెలరోజులపాటు అవిశ్రాంతి ఉద్యమం నడపవలసి వచ్చింది. ఈ పోరాట కాలంలో ఆయన భార్య నొక్కసారైనా చూడ-లేక పోయారు. అయితే ముఖ్య మంత్రిగా మళ్లీ పదవీ ప్రమాణాన్ని స్వీకరించాక మద్రాసు వెళ్లి తమ సతీమణితో రెండు రోజులుగడిపారు. దురదృష్ట వశాత్తు రాజధాని నగరంలో చెలరేగిన మతకల్లోలాల కారణంగా ఆయన తమ శ్రీమతి వద్ద అంతకంటే ఎక్కువరోజులు ఉండలేక పోయారు. "నాకు నా భార్యకంటే రాష్ట్ర ప్రయోజనాలు ముఖ్యం" అని నిబ్బరంగా పలికినా ఆయన కంఠంలో ఆవేదన తొణికిసలాడినట్లు స్పష్టమవుతోంది.

శ్రీమతి బసవ రామతారకం తమ అంతిమ ఘడియలను భర్త సాన్నిధ్యంలో గడప గలిగారు. ఆమె చివరి శ్వాస తీసుకొనేటప్పుడు ఆమె భర్త శ్రీ రామారావు, ఏడుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు, కోడళ్ళు, అల్లుళ్ళు అందరూ అక్కడే ఉన్నారు. శ్రీమతి తారకం మృతి చెందడంతోనే శ్రీ రామారావు కుప్పకూలి పోయారు. నాలుగు దశాబ్దాల అనుబంధం చిరస్మరణీయమని కళ్ల నీరు పెట్టు-కున్నారు.

శ్రీమతి తారకం రామారావుగారికి స్వయాన మేనమరదలు కూడ! వారి వివాహం 1942లో జరిగింది. ఆమె లేనిలోటు తీర్చలేనిదని రామారావు వాపోయారు రాష్ట్రపతి, ప్రధానమంత్రి, తదితర రాజకీయ ప్రముఖులు చలన చిత్రానికి సంబంధిం-చిన ప్రముఖులు. హితులు. బంధు మిత్రులు. శ్రేయోభిలాషులు ఎందరో తమ ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేశారు. శ్రీమతి తారకం భవుతిక కాయానికి అక్టోబర్ రెండున మైలాపూర్‌లో అంత్యక్రియలు జరిగాయి. వేలాది మంది అభిమానులు అశ్రు-తర్పణం చేశారు. □

# ఉత్తరాలు...

(4 వ పేజీ తరువాయి)

## ధర్మపథం

7.9.84 సంచికలో శ్రీ బులుసు వేంకట రమణయ్యగారి 'ధర్మపథం' ద్వారా భగవంతుని ఉనికిని నేటి ప్రపంచ మందలి నాస్తికులకు చాల చక్కగా ఉదహరించబడింది. భగవంతుడు తగిన సమయంలో దొంగలకు తగిన శాస్తి చేశాడు. ఆనాడు. ఈనాడు కూడా భగవంతుడు తగిన సమయంలో ఎవరికి తగిన శాస్తి వారికి చేస్తూనే వుంటాడు. 'అహం'కు లోబడి మనం భగవంతుని ఉనికిని గుర్తించలేకపోతున్నాం. బాగా శ్రద్ధతో 'ధర్మపథం' నిర్వహిస్తున్న శ్రీ బులుసు వేంకట రమణయ్యగారికి నా హృదయ పూర్వక అభినందనలు....

పి. శేషాద్రి రెడ్డి, తిరుపతి

◆ ◆ ◆ ◆ ◆

## కుంభకర్ణుని నిద్ర

కుభ కర్ణుడు నిర్దేశత్వం కోరదలచి, నిద్రను కోరి-నట్లు రఘు వంశంలో ఉన్నదనీ, నిర్దయత్వాన్ని కోరదలచి కాదనీ 7.9.84 తేదీ సంచికలో ఏ. ఏ. రంగాచార్యులుగారు వ్రాసిన జాబు చూచాను. రామాయణ కథలోని అంశాలు చాల విభిన్న పద్ధతుల్లో ఉన్నట్లు అందరికీ తెలుసు. పావ-రాజుగారి ఉత్తర రామాయణంలో "కుంభ కర్ణుడు ఏమి కోరుతాడో అని భయపడగా, బ్రహ్మ ఆదేశా-న్ననుసరించి వాగ్దేవి వాని నోటిలో ప్రవేశించి, నిద్రను కోరేటట్లు చేసింది" అని ఉన్నది. నేను చిన్నప్పుడు చదివిన రామోదం తమనే సంగ్రహ రామాయణ కథను బట్టి వ్రాశారు. అందులో "నిర్ద యత్వేచ్ఛయా" నిద్రాం కుంభ కర్ణో వృణీ తచ" అని ఉన్నది. ఇంతకూ నిర్దయ నిద్రలకు సన్నిహిత సంబంధం కానవస్తుంది. నిర్దయత్వం నేను కల్పించినది కాదు.

బులుసు వేంకట రమణయ్య



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar...

# ఆప్కో చేనేత వెలుగులతో దీపావళిని వెలిగించండి!





తళ తళలాడే
దీపకాంతులకు, వెలుగు
పూలు వెదజల్లే
టపాకాయలకు నూత్న
ఉత్తేజాన్ని అందించేవే
ఆప్కో చేనేతలు.
మన సంస్కృతికి,
సంప్రదాయాలకు
ప్రతీకలైన * నారాయణ
పేట * కొత్తకోట
* వేంకటగిరి * ధర్మవరం
* గద్వాల * పోచంపల్లి
సిల్కు చీరలు
ధరించండి. దీపావళిని
ఆహ్వానించండి !!

**20%**
రిబేటు
16-10-84 నుండి
23-10-84
వరకు




ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోఆపరేటివ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్-500 029

## ఆప్కో
## చేనేతలు